*Vegu-jukka Series*

# SRI TULASI RAMAYANAM

## SUNDARAKANDAM



*Bh. N. Sarma*

**Author.**

# ప్రధానపోషకులు



మ. రా. శ్రీ ఐ. వి. శివరామదాసు పంతులుగారు,
మొఖాసాదార్, నరసింగరాయపురం.

శ్రీ శ్రీ శ్రీ చెలికాని శ్రీరంగనాయకులు దొరగారు,
బి. ఎ. బి. యల్, రాజాం.

మ. రా. శ్రీ వై. వి. రమణమూర్తి పంతులుగారు,
బి. ఎ. బి. యల్, రాజాం.

## ఆశీర్వాదము.

శ్రీయుతులు, చిరంజీవులు,

ఇంగుళిగె వేంకటశివరామదాసుగారు, బాలకాండము ద్వితీయ ముద్రణార్థము రూ **116** లు బహుమానముగా నొసంగి శ్రీరామ కార్యమునకు దోడ్పడినారు. శ్రీరాముని కరుణా కటాక్షమున వారికాయురారోగ్యములు గలుగుగాక యని యాశీర్వదించుచున్నారము.

“స్వసూక్తీనాం పాత్రం రఘుతిలకమేకం కలయతాం
కవీనాం కోదోషస్స తు గుణగణానామవగుణః
యదేతైర్నిశ్శేషైరపరగుణలుబ్ధైరివ జగ
త్యసావేకశ్చక్రే సతత సుఖ సంవాద వసతిః.
యదిక్షుణ్ణం పూర్వైరితి జహతి రామస్య చరితం
గుణైరేతావద్భిర్జగతి పునరన్యో జయతి కః
స్వమాత్మానం తత్తద్గుణ గరిమ గంభీర మధుర
స్ఫురద్వాగ్బ్రహ్మాణః కథముపకరిష్యంతి కవయః”



శ్రీరస్తు.

శ్రీయుత, పండిత గాదె శ్రీజగన్నాథస్వామిగారి

—: సుహృత్ప్రశంస :—

అవిరళవాగ్విలాసరుచి । నార్యులు మెచ్చఁగ, భక్తియుక్తి రా
ఘవ చరితంబు నొక్క నవ । కావ్యముగా ఘటియించి, కీర్తిచే
నవనిని జన్మపావనుఁడ । వై చరితార్థుఁడవైతివౌర! భా
గవతుల నారసింహ కవి! । గౌరవ పాత్రుఁడ వౌదు వెల్లెడన్.



# శ్రీయుత భాగవతుల నృసింహశర్మగారు,

గ్రంథకర్త:— శ్రీమదాంధ్ర తులసీ రామాయణము.



"గీ. రాముఁ డభిరాముఁ డాది నా । రాయణుండు,
తులసి తత్కథాలహరికి । నలరి పలికె;
నట్టి పలుకులఁ బలికెద । నాంధ్రమునను,
సంతసింపని ప్రాజ్ఞులీ । జగతిఁ గలరె?"

భగవాన్ తులసీదాస మహాకవి

గ్రంథకర్త:— శ్రీతులసీరామాయణము (హింది)



ఓమ్ నమశ్శివాయ

మ. రా. శ్రీ దేశోద్ధారక బిరుదాంకితులగు

కాశీనాథుని నాగేశ్వరరావు గారిచే విరచితమైన

# పీఠిక

శ్రీరామావతారము భగవదవతారములందు, సకల జంతువులకును బ్రహ్మానందదాయకమైన యవతారము. శ్రీరాముఁడు రావణ సంహారమున కవతరించిన నరపుంగవుఁడు. రావణుఁడు బ్రహ్మనిష్ఠాపరుండైనను, అసురసంపదారాధకుఁడు. దశకంఠుఁడు మహాబలుఁడు. దాశరథి మానవమాత్రుఁడు. శ్రీరాముఁడు మానవుఁడైనను ధర్మనిరతుఁడై, రావణాదులను సంహరించి, దైవబలప్రాబల్యమును విశదము చేసెను. శ్రీరామావతారమునందు, నరసింహ వామన కృష్ణ బౌద్ధావతారములందుఁబోలె, లోకాతీత భయంకర కార్యములుగాని దివ్యవిలాసములు గాని వ్యక్తముగాక, లోకమునకుఁ బరిపాటియైన సాంసారిక ప్రవృత్తి వ్యక్తమైనది. శ్రీరామచంద్రుఁడు సామాన్యమానవుల విధంబున సంసారయాత్రకు సహజములైన సుఖదుఃఖముల ననుభవించిన యవతారమూర్తి. అతఁడు దశరథమహారాజునకుఁ జిరకాలమునకుఁ దపఃప్రభావమువలన గల్గిన ప్రియపుత్రుఁడు. అతఁడాగర్భ శ్రీమంతుఁడయ్యు, బాల్యమునందు విశ్వామిత్రాశ్రమములో గురుకులవాసముఁ జేసి, యజ్ఞరక్షణమును జేసెను. శివధనువును మోపెట్టి సీతను బెండ్లియాడెను. అతఁడు పితృవాక్య పరిపాలనార్థము రాజ్యాధికారమును త్యజించి, యరణ్యవాసమును గైకొనెను. సీతా లక్ష్మణులతో నరణ్యవాసక్లేశము ననుభవించెను. భార్యా వియోగదుఃఖము ననుభవించెను. వాలిని జంపి సుగ్రీవునకుఁ బట్టముగట్టి హనుమంతుని భక్తిని బడసెను.

రావణుసంజంపి సీతనువిడిపించి విభీషణుని రాజ్యమునందు నిలిపెను. సీతా లక్ష్మణాదులతో రాజ్యాభిషిక్తుండై ప్రజల నేలెను. జనాప వాదమును బోగొట్టుకొనుటకై జానకిని వనవాసమున కంపెను. కుశలవులను రాజ్యాభిషిక్తులనుజేసి యవతారమును జాలించెను. రామచరితము చాటుపద్యములందు మనోహరముగా వర్ణింప బడియెను.

శ్రీ రామ చరితము సంసార యాత్రకు సామాన్యమైన సుఖ దుఃఖములతో నిండియున్నను మానవజన్మకుంబరమావధియైన దైవ ప్రతిష్ఠను మనోహరముగా సువ్యక్తము చేయుచున్నది. సంసార యాత్రయందనవరతము ధర్మాధర్మములకు సంరంభము సంప్రాప్త మగుచున్నది. మానవులు మమకారాహంకారములు జనుని ధర్మపరా ఙ్ముఖులగుచు సామాన్యముగం బురుషార్థమును నిరర్థకము చేయు చున్నారు. ధనరాజ్యదారాపుత్రాదులందు "గల మమకారము ధర్మ నిష్ఠయందుం గలుగక నరజన్మము వ్యర్థమగుచున్నది. మోహ పరాయణుల దుర్గతిని రామాయణము హృద్యముగ వర్ణించుచున్నది. నరరూపమును దాల్చిన శ్రీరామచంద్రుండు బాల్యమునుండియును మోహమును విసర్జించి ధర్మము నారాధించి జీవయాత్రను సార్థకము చేసి లోకారాధ్యుం డయ్యెను. అవ్యక్తమైన శ్రీమన్నారాయణ ప్రభావము రామావతార మూలముననను మానవ. జన్మమునందు సుఫలమై లోకమునకుం దరణోపాయము కరతలామక మయ్యెను. బహువిధ పురుషార్థములకును రామనామయోగము స్వస్తివాచక మయ్యెను. రామరక్ష రామరాజ్యము రామబాణము రామభక్తి రామ మైత్రి రామవాక్యము రామకార్యము రామ తారకము మున్నగు పదములు భారతామ్నాయమునందు దాహార్థ ప్రయోగములైనవి. విశ్వంభరుండైన శ్రీరామమూర్తివారిని వారివారిసంస్కారమున కను

రూపముగను భక్తులు భజించియును, కవులువర్ణించియును, గాయకులు సంకీర్తించియును ప్రజలుసేవించియును కృతార్థులైరి. భగవద్గీతయందు దెలిపినటులు

శ్లో॥ యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహం।
మమవర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః॥

శ్రీరామమూర్తి రామభక్తుల ననుగ్రహించిన విధమును రామలీలలు విశదముచేయుచున్నవి. శ్రీరామమూర్తి యాంధ్రుల హృదయేశ్వరుఁడు. ఆంధ్రదేశమునందు వ్యాపకముగఁ గల రామమందిరములు రామభజనలు రామకీర్తనలు రామకృతులు రామకోటులు రామదండులు ప్రజలకుఁగలయపార రామభక్తిని విశదము చేయుచున్నవి. భాగవతుల నృసింహశర్మ కృతమైన తులసీదాస రామాయణాంధ్రీకరణమునైత మాంధ్ర హృదయస్థమైనరామభక్తిని విశదము చేయుచున్నది.

రామకావ్యములు, కృతులు:--రామతారకమంత్రము, నీక్రింది విధమున శంకరుఁడు పార్వతి కుపదేశించినవిధము పురాణ ప్రసిద్ధము.

శ్లో॥ శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే॥

వాల్మీకి యుత్తమోత్తమమైన రామాయణ కావ్యమును రచియించి శాశ్వత ప్రతిష్ఠను బడసెను. ఆంధ్రమునందు భాస్కర రామాయణము, మొల్లరామాయణము, అధ్యాత్మరామాయణము, సంక్షేపరామాయణము, గోపినాథరామాయణము మున్నగు సుప్రసిద్ధాంధ్రకావ్యములుగలవు. శ్రీయుత వావిలికొలను సుబ్బరాయకవి గారు పద్యమైదేండ్లకుఁబూర్వ మాంధ్ర వాల్మీకి రామాయణమును రచియించిరి. గతసంవత్సరమునందు శ్రీయుత జనమంచి శేషాద్రి శర్మగారు విశేషాంధ్రవాల్మీకిరామాయణమును రచియించిరి. ఆంద్రి

భాషయందు శ్రీరామచరితామృతమును ప్రసాదించెడి మనోహర కావ్యములు, నాటకములు, శతకములు పెక్కులుగలవు. ఆంధ్రభాషయందుఁగల 600 శతకములందు రామభక్తిపరములైన శతకములు నూరు కలవు. రామదాసుకీర్తనలు త్యాగరాజకృతులు తరంగములు లాలిపాటలు జోలపాటలు పెండ్లిపాటలు రామకోటు లాంధ్రహృదయామృతమైన రామచరితామృతాస్వాదనాభిలాషను విశదము చేయుచున్నవి. అఖండమైన శ్రీరామావతార మహిమను ఖండరూపముల నెందఱుకవులు వర్ణించినను చిత్రకారులు చిత్రించినను గాయకులు కీర్తించినను భక్తులు భజించినను నూతనరచనలు పురుషార్థసిద్ధికి సాధనంబు లగుచున్నవి. శ్రీరామభక్తిభరితమైన తులసీదాస రామాయణమాంధ్రవాఙ్మయమునకలంకారమై రామభక్తులకు బ్రహ్మానందమును గలుగఁజేయఁ గలదు.

తులసీదాసు:—తులసీదాసు రాజపూరుజిల్లాయందలి బాందాపురమునందు ౧౫౫౪ సంవత్సరము మూలానక్షత్రము ప్రథమపాదమునందు జననమొందెను. జన్మనక్షత్రము గండ నక్షత్రము. తలిదండ్రులు వెంటనే తులసీదాసును విడనాడిరి. సరయూతీరవాసియైన సాధు నరసింహదాసు తులసీదాసును స్వీకరించి సూకరక్షేత్రమునందుఁ బెంచి పెద్దవానిని జేసెను. నరసింహదాసు సన్నిధిని బాల్యమునందుసయితము తులసీదాసు రామకథామృతమును భక్తిశ్రద్ధలతోఁ గ్రోలుచుండెను. దీనబంధుపాఠకుఁడు గోస్వామికిఁ దన కూతును రత్నావళినిచ్చి పెండ్లిచేసెను. భార్య కాఁపురమునకు వచ్చిన తరువాత మోహపరవశుఁడై యొకదినమైనను జాయావియోగమును సహింపఁ జాలకుండెను.

అత్తమామలెన్ని వర్తమానముల నంపినను భార్యను బంపకుండెను. మామ స్వయముగవచ్చిపిలిచినను ప్రయోజనము లేకుండెను.

తులసీదాసు బజారునకుఁ బోయినసమయమున భార్య సోదరునితోఁ గూడి పుట్టినింటికిఁ జెప్పక వెడలిపోయెను. గోస్వామి యిరుగు పొరుగు వారినుండి, యీవృత్తాంతమును గ్రహించి వెంటనే యత్త వారింటికిఁబోయి చేరెను. భార్య పుట్టినింట నిరుగు పొరుగు వార లతోఁ గుశల ప్రశ్నలను ముగింపక మునుపే, భర్తప్రత్యక్షమగుటను జూచి రత్నావళి కోపగించి, ధిక్కరించి, యిటులు పరిహాసించెను:-

"లాజనలాగత్ ఆపుకో ద్వారె ఊ ఆయెసాత్
ధిక్ ధిక్ వెసే ప్రేమకో కహా కహా హుం నాథ
అసి చర్మమయ దేహ మమతా మేం జైసీ ప్రీతి
తైసీజో శ్రీరామ మహహోత్ నతౌ భవభీతి.

ఈవాక్యములు ప్రేమసంపన్నమైన గోస్వామి హృదయము నందు వైరాగ్యమునుగలుగఁజేసెను. వెంటనే గోస్వామి మరలిపోయి కాశీనగరమును జేరెను. అయోధ్యా మధురా మాయా ప్రయాగాది క్షేత్రములను సందర్శించి భక్తిజ్ఞాన వైరాగ్యములనుబడసి కృతార్థుఁ డయ్యెను. ఆంజనేయుని యనుగ్రహమువలన నతఁడు చిత్రకూటము నందు శ్రీరాముని సందర్శించినటులు గాథలు గలవు. మహాభక్తుల జీవితములందుఁ బ్రత్యక్షమయ్యెడి యద్భుతములు గోస్వామి జీవి తము నందును గనుపట్టుచున్నవి. చచ్చిన వానిని బ్రతికించుట, అగ్బరు చక్రవర్తి గోస్వామిని ఖైదుచేయుట, వానరసేనలు కోటను ముట్టడించుట మొదలగు నద్భుత గాథ లనేకములు గలవు. గోస్వా మికి నక్బరు చక్రవర్తి మంత్రి ఖాన్ ఖాన్ మిత్రుఁడుగ నుండెను. ఆకాలపుఁ బండితులతోను సాధువులతోను భక్తులతోను ఇష్టగోష్ఠిని గాలముగడుపుచు ౯౨-వ యేట క్రీ. శ. 1623 సం॥ నందు గోస్వామి తులసీదాసు పరమపదమును జేరెను.

# 6

# తులసీ రామాయణము



ఇది ప్రపంచమునందుఁ గల యుత్తమ గ్రంథములం దొక యుత్తమ గ్రంథముగ నున్నది. తులసీ రామాయణము వాల్మీకి రామాయణమునకు భాషాంతరీకరణము గాక యొక స్వతంత్ర కావ్యముగనున్నది. హిందీ భాషయందుఁగల గ్రంథము లందుఁ దులసీ రామాయణ మగ్రస్థానము నలంకరించుచున్నది. భాషయందును, భావములందును, రచనా విధానమునందును, వ్యాపకము నందును, హిందీభాషయందుఁ దులసీరామాయణమునకు సాటియైన గ్రంథము వేరొకటిలేదు. హిందూస్థానీభాషను మాటాడెడివారు, తులసీ రామాయణము పారాయణ చేసి కృతార్థులగుచున్నారు. నాల్గణాలు మొదలు నలువది రూప్యముల వఱకును విలువగల రామాయణ ప్రతులు గలవు. ప్రతియేటను వేలకొలఁది ప్రతులు విక్రయింపఁ బడుచున్నవి. ఒక దోహాయైనను రాని హిందూస్థాని యుండఁడు. తులసీ రామాయణము పండిత పామరుల కాదరణీయమై పూజింపఁ బడుచున్నది.

తులసీదాసు భాషారామాయణమును రచించినపుడు పండితు లాక్షేపించి, తిరస్కరించిరి. ఆతఁడు వారితిరస్కారములను లక్ష్యము సేయక, దీనినిరచించి ధన్యవాదములను బడసెను. ఆకాలమందు మహాపండితుఁడుగఁ బరిగణింపఁబడిన మధుసూదన సరస్వతి తులసీ రామాయణము నిటులు ప్రశంసించెను :—

శ్లో॥ పరమానంద పాత్రోఽయం జంగమస్తులసీతరుః।
కవితామంజరీయస్య రామ భ్రమరభూషితః।

తులసీదాసు రామాయణమును స్వతంత్రకావ్యముగ రచించెను. వాల్మీకిరామాయణమునందు లేనిసందర్భములను జేర్చియును

ఉన్న వానిని విడిచియును, స్వతంత్ర కావ్యమును జేసెను. సీతాస్వయం వరమునకుఁ బూర్వము సీతారాములకు నుద్యానవనమునందు గౌరీ పూజారూపమునను సమావేశమును గలిగించి, ప్రేమప్రకర్షణమును మనోహరముగ వర్ణించెను. గ్రంథమునఁ గొన్ని సందర్భములందు సోరఠ, చౌపాయీ, ఛందావృత్తములు వాడఁబడినను సామాన్య ముగఁ బాటకనుకూలమై, మధురమైన "దోహా" "చౌపాయి" వృత్తములే పాడఁబడినవి. గోస్వామి నలువదెనిమిదవ యేటను బరి పక్వ దశయందు రామాయణమును రచియించి జీవించి యుండెడి సమయమునందే మహాప్రతిభను గడించెను. ఆ ప్రతిభ కాలక్రమ మున వికసించి, తులసీ రామాయణ మమూల్య గ్రంథరాజముగ వెలయు చున్నది. శ్రీరామ చరిత్రమునం దానందదాయకములైన భక్తి శృంగార వీరకరుణారసంబు లద్భుతరీతిని సమ్మేళనమునొంది, యేకరసమువలె సమ్మోహమును గలుగఁ జేయుచున్నవి. విశ్వ సమ్మోహ జనకమయిన శ్రీ రామచరిత్రమును అద్భుతరీతిని రామా యణమునందుఁ బ్రత్యక్షముఁ జేసి, యానంద రసోదయమును గలుగఁ జేయఁగలిగిన గోస్వామి "తులసీదాసు" ధన్యుఁడయ్యెను. తులసీ రామాయణము సర్వజన సమాదరణీయము.

## ఆంధ్ర తులసీ రామాయణము

ప్రపంచావృతమైన నవ జీవనోజ్జీవనమున కుదార భావభరిత ములైన గ్రంథములు సాధనములు. ఉదార భావ వికాసమునకు నూతన రచనలవలె భాషాంతరీకరణములు సాధనములై యున్నవి. ఆంధ్రవాఙ్మయాభివృద్ధికి నూతన రచనలు నిర్మింపఁబడు చున్నవి. భాషాంతరీకరణములు చేయఁబడు చున్నవి. ఆ ప్రయత్నము లం దాంధ్ర తులసీరామాయణము వర్తమాన కాలమునందుఁ బ్రయో

జనకరమై, యాంధ్రహృదయమున కానందము గలుగఁజేయఁగలదు. దేశమందంతటను హిందీభాషాప్రచారము జరుగుచున్నది. ఆంధ్రయువకులు పరమోత్సాహముతో హిందీభాష నభ్యసించుచున్నారు. ఆంధ్రహృదయేశ్వరుఁడైన శ్రీరాముని చరితామృతమును గ్రోలుటకును, హిందీ సాహిత్య పరిచయమును బొందుటకును, తులసీరామాయణము వినియోగపడఁ గలదు. భాషాంతరీకరణము దుష్కర కార్యము. రసభరితములైన కావ్యముల నాంధ్రీకరించుట దుష్కరతర కార్యము. ఆంధ్రీకరణమునం దాంధ్రహృదయసంస్కారమును, కవిచిత్తసంస్కారమును సహజముగఁ బ్రత్యక్షము లగుచు మూలగ్రంథానువాదమునకు భంగము గలుగుచుండును. ముక్కకు ముక్క ననువదించుట నిరుపయోగమైనను, మూలగ్రంథ భావమును బరిస్ఫుటముచేయుట యను వాదమునకుఁ బ్రయోజనము. మూలగ్రంథమందు లేని సందర్భములును, గల్పనలును, భావములును, భాషాంతరీకరణ గ్రంథమున కలంకారములైనను, మూలగ్రంథ స్వరూపము మార్చుచున్నవి. కవిహృదయమును, భాషాహృదయమును, భాషాంతరీకరణమునకు నూతనాకారము నొసంగుట సహజమైనను, మూలస్వరూపమును బ్రత్యక్షముచేయుట ముఖ్యధర్మము.

ఆంధ్రవాఙ్మయమునకుఁ దులసీరామాయణకృతిని సమర్పించిన శ్రీయుత భాగవతుల నరసింహశర్మగారు ధన్యాత్ములు. కవిత్వము ధారాళమై, సరళమై, రసవంతముగ నున్నది. పద్యము లడ్డులేక చక్కఁగ నడుచుచు నాంధ్రవాణీ స్వరూపమును విశదము చేయుచున్నవి. భాషాంతరీకరణమునందుఁ గవి కొన్ని సందర్భములందు మూలము ననుసరించినను, కొన్ని సందర్భములందు స్వేచ్ఛానుసారముగ భాషాంతరీకరించిన విధమును గ్రంథము విశదము చేయుచున్నది. ఆరంభమునందు సుజన దుర్జనప్రశంసయందుఁ గొన్ని గంభీర భావము

లధికముగఁ జేర్పఁబడినవి. మూలమునందలి భావము నీపద్యము హృద్యముగఁ దెలుపుచున్నది.

గీ. నీరసంబయ్యు గుణములన్ విస్తరిల్లి
యన్యగుహ్యావనంబున కఖిల కీర్తి
ములకు నోర్చిన కార్పాస ఫలముఁ బోలు
సాధుచరితంబు సత్కృతి సన్నుతంబు.

అహల్యా శాపవిమోచన సందర్భమున మూలగ్రంథమునందు లేని భావము లీగ్రంథమునందుఁ జేర్పఁబడినవి. గంగావతరణ వృత్తాంతము, మూలమునందు లేనిది, దీనియందుఁ జక్కఁగ వర్ణింపఁ బడినది. మూలమునందుఁ గల మిథిలానగర వర్ణనము దీనియందుఁ గనఁ బడదు. జనకుని రామలక్ష్మణుల వర్ణనయందు మూలమునకును భాషాంతరీకరణమునకును భేదము గలదు.

జనవరకులపాలకులో?
మునికులతిలకులో? యెటులుంగఁ బోలదె చెప్పుమా! ॥

(ప. 906)

"బ్రహ్మజో నిగమ నేతికహి గావా ఉభయ వేధలిసో ఈకి ఆహా"

వేదములందు "నేతి" యని వర్ణింపఁబడిన బ్రహ్మ ముభయ రూపములఁ దాల్చివచ్చినది." అని మూలమునం దుండగా భాషాంతరీకరణము నందు వేఱైయున్నది.

ఉద్యాన వనమునందు సీతా రాముల యన్యోన్యావలోకన సందర్భమునందలి వర్ణనమునందును భేదము గలదు. శ్రీరాముల వర్ణనము నందుఁ దులసీ రామాయణమునందు గల మాధుర్యము పోయి యాంధ్రప్రబంధ వర్ణనలు గోచరమగుచున్నవి. తులసీదాసు సీతకుఁ బుష్పదామమును గౌరీదేవి యొసంగినట్లు వ్రాసియుండెను.

భాషాంతరీకరణమునందు ధాత్రియొసంగినట్లులు గలవు. మూలము నం దీసందర్భమున సూర్యాస్తమయ వర్ణన లేదు. ఆంధ్రీకరణము నందు సూర్యాస్తమయవర్ణన కలదు.

ఆంధ్ర తులసీ రామాయణమునం దీవిధముగ మూలమున లేని కొన్ని విషయములు చేర్చుటయును, ఉన్న విషయములను విడుచుట యును, నూతన భావములను జేర్చుటయును, సంభవించిన విధము గ్రంథపరిశీలనము విశదము చేయుచున్నది. సుప్రసిద్ధమైన తులసీ రామాయణమును మూలానుసారముగ భాషాంతరీకరించుట, ఆంధ్ర వాఙ్మయమునకును, హిందీ ప్రచారమునకును, నధికతర ప్రయోజ నము నొడఁగూర్చును. కాని, యాంధ్రవ్యక్తిత్వము, భాషా సాం ప్రదాయము, కావ్యరచనా సాంప్రదాయము, కవి సంస్కారము, ఆంధ్రతులసీరామాయణమునకు, నూతనాకారమును గలుగఁజేసెనవి.

భాషాంతరీకరణమునందు భేదములున్నను శైలి రసవంతమై పద్యములు ధారాళముగ నడచుచు, గ్రంథము మనోహరముగ నున్నది.

భాగవతుల నరసింహశర్మగారు రచియించిన యాంధ్ర తులసీ రామాయణ మాంధ్రుల యాదరణమునకుఁ బాత్రమగుగాత! కృతి కర్త శేషించిన గ్రంథమును బూర్తి జేసి ప్రచురించుటకుఁ బరమేశ్వ రుఁడును ప్రజలును దోడ్పడుదురు గాత !

ఈగ్రంథమునకుఁ బీఠికను వ్రాయు గౌరవమును నాకొసంగి నందులకు శ్రీయుత భాగవతుల నరసింహ శర్మగారికిఁ గృతజ్ఞుఁడను.

కా. నాగేశ్వరరావు.

వేగుంజుక్క గ్రంథమాల, బరంపురం, (గంజాంజిల్లా)

# శ్రీ తులసీరామాయణము

## మహాత్మా గాంధిగారి యభిప్రాయము:—

ఈ రామాయణము గూర్చి శ్రీగాంధిమహాత్ముడు "యంగ్ ఇండియా" పత్రికలో నిట్లు వ్రాసెను:—

"మాయింట ప్రతిదినము నీరామాయణమును లాధా మహారాజను బ్రాహ్మణుండు చదువుచుండెను. ఆతండు కుష్ఠురోగి. ఈరామాయణ పఠనమువలనం దనరోగము నివర్తించు నని విశ్వసించి పఠించుచుండెను. నిజముగ, ఆతండారోగమునుండి విముక్తిం గాంచెను."

*Mahatmaji Writes in Young India Dated April 27, 1921.*

"The Ramayana was used to be regularly read in our family. A Brahmin called Ladha Maharaj used to read it. He was striken with leprosy, and he was confident that a regular reading of the Ramayana would cure him of leprosy, and indeed he was cured of it."..................

(శ్రీ గాంధిమహాత్ముఁడు శ్రీరామనవమి నాడు సబర్మతి ఆశ్రమములో నుపన్యసించుచు (శ్రీ) తులసీదాసు రామాయణముం గూర్చి తన యభిప్రాయ మిట్లు పేర్కొనెను.)

"..................తులసీదాసు రామాయణము నాకత్యంత ప్రియమగు గ్రంథము. నేను దానిని అద్వితీయ గ్రంథమని తలంచెదను-మఱియు నొకపర్యాయము చదువ నారంభించిన విసుగు జెందను.

భగవద్గీతను ఒక అధ్యాత్మిక శబ్దకోశమని తలంచెదను. అట్టి విషయమే తులసీదాసు మనకొక సుందర కావ్యరూపముగా నుపదేశించెను."

The Christian Literature Society వారి గ్రంథ ప్రాశస్త్యమును, "Divine incarnation as taught by Ramayana of Tulasi Dass" అని యొక ప్రత్యేక గ్రంథరూపమున వెల్లడించినారు. "The Ramayana of Tulasi Das" అని ఈ రామాయణమును F. S. Growse, B.C.S.M.A., Ozon; C.I.E;

(Fellow of the Calcutta University.) గారిచే ఆంగ్లేయ భాషకు ననువదింపఁబడినది.

ఇమ్మహాగ్రంథ మింతవఱకుఁ బూర్ణముగ మన యాంధ్ర భాషలోలేదు. ఇప్పుడు "శ్రీమదాంధ్ర తులసీరామాయణము"ను పేర, వేగుఁజుక్క గ్రంథమాలనుండి యొక్కొక్క కాండము చొప్పున వెలువడుచున్నది. ఇప్పటికి, బాల, అయోధ్య [రెండు భాగములు], ఆరణ్య కిష్కింధాకాండములు వెలువడినవి. సుందరకాండము ముద్రణములో నున్నది. విలువ ఒక్కొక్క భాగము 1 రూ॥ మాత్రమే (ఖర్చులుగాక). కిష్కింధాకాండము 0-12-0. [ఖర్చులుగాక]. భాషాభిమానులు, భక్తులు ప్రోత్సహింపవలెనని ప్రార్థించుచున్నాము.

చ. ఎవఁడు హృదంతరాళమున । నెత్తఱి రాముని వాని నామమున్
దివిరి స్మరించు వానికి న । ధీనము జ్ఞానము; భక్తియుక్తుఁడై
శివమని రామనామము భ । జించుచు తత్ఫలమున్ భుజించుచున్
భవముఁ ద్యజింపుచున్నతఁడు । భవ్యదముక్తిఁ సృజింపుఁ డెల్లయున్"

శ్రీమదాంధ్ర తులసీరామాయణము.

| పేరు | విలువ | | పేరు | విలువ | |
|---|---|---|---|---|---|
| 1 ఉగ్రభైరవము | రూ 1 | 0 | 13 లీలాకుమారి (2 parts) | 2 | 0 |
| 2 *సర్వమంగళ | 1 | 0 | 14 మిస్ మోర్గన్ | 1 | 0 |
| 3 పద్మరాగము | 1 | 0 | 15 లోకభయంకరుఁడు | 2 | 0 |
| 4 చపల | 1 | 0 | 16 బాలకాండము | 1 | 8 |
| 5 విషమరహస్యము | 1 | 0 | 17 *అయోధ్యా ,, 2 భా॥ | 1 | 8 |
| 6 కాశీఘట్టరహస్యము | 1 | 0 | 18 *ఆరణ్యకాండము | 1 | 0 |
| 7 *ప్రణయసామ్రాజ్యము | 1 | 0 | 19 *కిష్కింధాకాండము | 0 | 12 |
| 8 *ఉత్తమవంచకుఁడు | 0 | 10 | 20 *అభినవభర్తృహరి | 0 | 10 |
| (*The Righteous Rogue*) | | | 21 *శృంగారసంధ్య | 1 | 0 |
| 9 కాంతాపహరణము | 1 | 0 | 22 విజయవిజయము | 0 | 12 |
| 10 దుర్గాదాస్ *Historical* | 1 | 0 | 23 విచిత్రవీరబొబ్బిలి | 0 | 12 |
| 11 మురళీధ్వని | 0 | 4 | 24 ప్రతిజ్ఞాచాణక్యము | 1 | 0 |
| 12 *భానుమతి | 1 | 0 | 25 రసపుత్రజీవనసంధ్య | 1 | 0 |

** Approved by the Text Book Committee, Madras.*
*(Vide Fort. St. George Gazette-dated 8th April 1930)*

# విషయసూచిక



ప్రథమ ముద్రణము

## మనవి

ఇంతకుం బూర్వము నేను రచించి ప్రచురించిన గ్రంథములం బఠించి, తగినంత ప్రోత్సాహ మొసంగిన యాంధ్రపాఠక మహాశయులకు నే నెంతయుం గృతజ్ఞుండను. తులసీరామాయణము నాంధ్రీకరింపవలెనను నభిలాష నన్నుం జాల కాలము నుండియుం బీడించుచుండెను. ఇట్లుండ నొకనాఁడు విజాపురపు వేంకటరావుగారు, తాము జయపురములో నుద్యోగులై యుండు కాలమున బరంపురమునకు విచ్చేసిరి. మ॥ రా॥ శ్రీ దేవరాజు శ్రీకృష్ణారావుగారి గృహమున వారుండగా నేను దర్శింపం గలిగితిని. అపుడు వీరిరువురి ప్రోత్సాహబలమునం నెట్లయిన నేతద్గ్రంథము నాంధ్రీకరించి యాంధ్రభాషాయోషామణికి సమర్పింపవలెనను సంకల్పము నా హృదయంబున నంకురించి క్రమక్రమముగ పైకెత్తి యిపుడీ గ్రంథరూపమున ఫలోన్ముఖతకు వచ్చినది. ఈ గ్రంథముంగూర్చి నే నేమియు వ్రాయనక్కఱ లేదు. ఆంధ్ర దేశోద్ధారక బిరుదము సార్థకముం జేయుచున్న మ॥ రా॥ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారి పీఠికం బఠించిం మంచి చెడ్డల విమర్శింపవలసిన బాధ్యత, పాఠకమహాశయులయందేయున్నది. నే నీసందర్భమున నొక చిన్న యంశము మనవిచేయక తప్పదు. అచ్చటచ్చట నించుకంత మార్పు చేయవలసి వచ్చినది. కథాసందర్భముం బట్టియు, నాంధ్రదేశీయుల రుచులం బట్టియు నట్లు చేయక తప్పినది కాదు. తప్పో, యొప్పో నిర్ణయించువాఁడను నేను గాను. గుణగ్రహణ పారీణులగు పండితులపైం గవులపై నా భారమున్నది. ఆంధ్రలోకము సంపూర్ణ ప్రోత్సాహ మొసంగెనేని, మిగిలిన భాగము నచిరకాలములో నే యాంధ్రీకరింపంగలవాఁడ నని మాత్రము వినయపూర్వకముగ మనవి చేయుచున్నాను.

## కృతజ్ఞత

నే నాంధ్రీకరించిన యీ బాలకాండము, మిక్కిలి మెలఁకువతోం దానిముట్టం జదివి, పీఠిక వ్రాసి యొసంగిన, సార్థక బిరుదాంకితులగు

మ॥ రా॥ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారి కాయురారోగ్య భాగ్యములఁ బ్రసాదింప శ్రీరామచంద్రుని మనః పూర్వకముగఁ బ్రార్థించుచున్నాను. ఏతత్తులసీరామాయణ బాలకాండ రచనా సందర్భమున, నాకనేక విధములఁ దోడ్పడిన బ్ర॥ శ్రీ॥ ఆదిభట్ల తరిణయ్య సిద్ధాంతిగారికి ననేకాభివందనముల సమర్పించుచున్నాను.

హిందీ తులసీ రామాయణముఁ జెప్పించి, ప్రతిదినము నాకుఁ దగినంత ప్రోత్సాహ మొసంగు చుండెడు జామి కాశీవిశ్వనాథ శాస్త్రి గారికి నా యాశీర్వచనములు. ఈగ్రంథముఁ బ్రకటింప నియ్యకొనిన వేగుఁజుక్క గ్రంథమండలి దినదినాభి వృద్ధిఁబొంది యాంధ్ర మహా జనుల ప్రోత్సాహముఁ బడయుఁ గాక.

బరంపురము (గంజాం)

ఇట్లు,
సర్వజన విధేయుఁడు,
భాగవతుల నృసింహశర్మ,
గ్రంథకర్త.

# ద్వితీయ ముద్రణము



ఆంధ్ర సోదరు లాదరించుటఁ బట్టి, శ్రీమదాంధ్ర తులసీ రామాయణము క్రమక్రమముగ వ్యాప్తిఁ జెందినది. అచిరకాలము లోనే బాలకాండము పునర్ముద్రణ భాగ్యముఁ బొందినది. శ్రీరామ నామామృతాస్వాదన తత్పరులగు పాఠకుల ప్రోత్సాహమునను సుందరకాండము పర్యంతము భాగములుగ ముద్రించినారము. సాధ్యమైనంత శీఘ్రముగనే పూర్తిఁ జేసి, యాంధ్రుల మన్ననలఁ బడయగలను.

ఇట్లు,
గ్రంథకర్త





శ్రీరామాయ నమః

అవిఘ్నమస్తు

# శ్రీ తులసీరామాయణము

## బాలకాండము.



### ఇష్టదేవతాస్తుతి

"శ్రీ రామాశ్రితమూర్తి కొండఱ యశ । శ్శ్రీధుర్యులం జేసె, నో
గౌరీ! పావననామవర్ణములసం । ఖ్యాతంబుగన్ భక్తులన్,
ఘోరాఘాంబుధినుండి ప్రోచె"నని భ । ర్గుండున్ బ్రశంసించుసం
సారోగ్రానలకృష్ణమేఘమును రా । మబ్రహ్మమున్ గొల్చెదన్.

### జానకీస్తుతి.

చ. వనితలకెల్ల రత్నమయి । భాసిలు నేసతిఁ గాంచినంతనే
తనరెను రత్నగర్భయన । ధారుణి, యేలలితాంగిఁ బెంచుటన్
జనకమహర్షికిన్ జనక । నామము సార్థకమయ్యె; నట్టి సా
ధ్విని, రఘురామభూవిభుని । దేవిని, నెంచి నమస్కరించెదన్.

### శ్రీ విష్ణు స్తుతి.

మ. సిరితో ముచ్చటలాడు వేళ నయినన్ । జేజేలు, మౌనీంద్రులున్
"నరసింహా" యని సన్నుతించునపుడైన్ । నన్ దన్నుఁ బ్రార్థించినన్
గరుణన్ వేఁ జని మెట్టి ప్రాణిసయినన్ । గాపాడు వేల్పున్ సురా
సుర సంపూజితు, జిష్ణు, విశ్వమయు, విష్ణున్ గృష్ణుఁ బ్రార్థించెదన్.

### లక్ష్మీ స్తుతి.

ఉ. మత్సరమూని కౌస్తుభము । మాటికి భాసల నుత్సహించు శ్రీ
వత్సము పెంపణంచి నిజ । ఫాలకళంకము తేజరిల్ల, నే
త్రోత్సవమై రహించి, కమ । లోదరు పేరురమాక్రమించి, యా
పత్సమయంబునన్ దనదు । భక్తులఁ బ్రోచెడు లక్ష్మిఁ గొల్చెదన్.

### మహేశ్వర స్తుతి.

చ. తనయుర మేచుఁ బార్వతి స్వ । తంత్రతఁ గైకొని కౌఁగిలింపఁగన్
దనిసి, కుమారు గర్భమునఁ । దాల్చినయంతఁ దదర్థ భారమున్
గొని, ప్రసవించువేళఁ బడు । నొప్పులలోఁ దన కెట్టివాలు లే
దనుచు విచారమొంది సగ । మైన మహేశ్వరు సన్నుతించెదన్.

### పార్వతీ స్తుతి.

సీ. ముద్వేల్పులకు ముందు । పూజలం గొనెడు పె
ద్దమ్మ యయ్యును బాల । యనఁగ నొప్పెఁ
గడుభీతిఁ గొలిపెడు । కాళి నాఁ బరఁగియుఁ
ద్రిపురసుందరి నాఁగఁ । దేజరిల్లె,
నాది భిక్షుకునిఁ బెం । డ్లాడినయట్టి య
పర్ణయయ్యు సదాన్న । పూర్ణయయ్యెఁ,
గాత్యాయనీ ఖ్యాతిఁ । గలిగియుఁ గడువార
ననుగుబిడ్డలఁగన్న । యార్యయయ్యె,

గీ. భూమిధర సార్వభౌముని । పుత్త్రియయ్యుఁ
[illegible]ము నారాయణి యనంగ । నలరె, నట్టి
సతిని, సుగుణవతిని, శుభా । కృతినిఁ జారు
మతిని, వీరసంతతిని, నా । మతిని గొలుతు.

కుమారస్తుతి

చ. యమనియమాదియోగకలి । తాత్ముని భర్గునిఁ బెండ్లియాడి, యా
యమ యుమయై రహించి, కపు । పారఁగ నెవ్వనిఁగాంచె, వాసవా
ద్యమరులఁ బ్రోచె నేయలఘుఁ । డాతనిఁ గొల్చెద సింహవిక్రమ
క్రమజిత తారకాసురునిఁ, । గ్రౌంచవిభేదను, వైరిసూదనున్.

గణేశస్తుతి

చ. "కనుఁగొనఁ జంద్రరేఖయును । గంగయు రాజిలె, ఫాలనేత్రమా
యినుఁడనవచ్చుఁ జుక్కలు ర । హింపవుగా" యని తుండమెత్తి ఖే
లనముగ గాంగశీకరము । లన్ బయిపై వెదఁజల్లి నేఁడు నా
జనకుఁడు వ్యోమకేశుఁడని । సమ్ముదమందు గజాస్యుఁ గొల్చెదన్.

విధాతృస్తుతి

ఉ. "జే"యని సన్మునీంద్రులు భ । జింప, సరస్వతి ముచ్చటింప, నా
మ్నాయపయోధి నంచయను । నావపయిన్ విహరించు సత్కథా
శ్రేయుని, సాత్త్వికోదయు, వి । రించను, విశ్వసృజున్ విధాత, ధీ
ధ్యాయు ప్రశీయునీయఁగల । యానలుమోముల వేల్పుఁ గొల్చెదన్.

సరస్వతీస్తుతి

మ. "జననీ"యంచు నుతించు సత్కవుల య । జ్ఞానాంధకారంబుఁ ద్రా
గనులంగాటుకఁగా, శిరంబున కలం । కారంబుఁబోల్ కొప్పుఁగాఁ
గొని, విజ్ఞానశరీరయై, సుకవితా । కోటీరయై, సాహితీ
వనిలోఁ బాటలఁ బాడుచున్ మెలఁగు న । వ్వాణిం బ్రశంసించెదన్.

హ ను మ ద్వా ల్మీ కి స్తు తి

సీ. వాల్మీకిరామ సుగుణ ప్రసూన జనిత
ఘనయశోగంధభృజ్జగ ద్వనమునందు
సాహితీగాన ఫలరసా స్వాదనమున
వెలుగు సత్కవీశ్వరుఁ గపీ శ్వరునుతింతు.

వ్యా స మ హా ము ని స్తు తి

ఉ. వ్యాసుఁ, గవీంద్రచిత్తగృహ వాసు, జగన్నుత భారతాగమో
ల్లాసుఁ, బవిత్రవాఙ్మయవి లాసు, మునిస్తవనీయ చిత్కళా
భ్యాసుఁ, బురాణరత్నచయ భాసు, శ్రుతిస్మృతిమార్గపాదవి
న్యాసు, నుతించెదన్ సతము హస్తములెత్తి నమస్కరించెదన్.

శ ం క రా ది మ త గు రు స్తు తి

ఉ. ప్రాకట తత్త్వవేత్తలయి పామరకోటిఁ దరింపఁజేయ లో
కైక మతప్రచారమున కై భువిఁ గారణజన్ములైన సు
శ్లోకుల, శంకరాది మత సూరుల ధీరులఁ, గొల్చెదన్ సమో
వాకముఁ బల్కెదన్ సకల పండిత పామర సమ్మతంబుగన్.

శ్రీ గాం ధి స్తు తి

ఉ. గాంధికి, లోకసన్నుత యుగంధరమంత్రి సమానదివ్య ధీ
కంధికి, వాఙ్మి శాతశర కాండవిఖండిత శత్రురాడ్గళ
గ్రంధికి, సంధివర్జితప రస్పరరంధికి, సర్వదేశ సం
బంధికి, భక్తిపూర్వక నమస్కృతు లిచ్చెద నిష్టసిద్ధికిన్.

స ద్భ క్త ప్ర శం స

చ. కొనలిడుభక్తి రాఘవునిఁ గొల్చి భుజింపఁగఁబో, క్షుధాగ్ని చేఁ
గనగనలాడు నొక్కశున కంబు గృహంబునుజొచ్చి, భక్ష్యముం
గొనిపరువెత్తఁగన్,'ఘృతముఁ గొమ్మనుజా'యనియాజ్యపాత్రితో
వెనుకొను ధీరు నెన్నెదఁ గబీరుని భూతదయానుసారునిన్.

సీ. శతకోటిమార్తాండ । సంకాశకాంతి నా
వ్యామోహతమసంబు । నణఁచుఁ గాదె ?
ఘనసార కస్తూరి । ఘనవాసనల మీఱి
మలినవాసనలను । దొలఁచు గాదె ?
దేవవైద్యప్రాప్త । దివ్యౌషధ మనంగ
భవరోగ బాధలఁ । బాపుఁ గాదె ?
ఫాలాక్షతనులిప్త । భస్మధూళిం బోలి
కామాగ్నికీలలఁ । గప్పుఁ గాదె ?
గీ. అమృతమూలికా సారమై । యోగ్యజనుల
హృదయదర్పణమలము హ । రించుఁ గాదె ?
భక్తజనపాదరజము, దే । వతల కుజము
ఎల్లజనులకు నూహింప । నిదియె నిజము.

ఉ. అన్నవనీశచోరుని క । థామృతధారలఁ గ్రోలినట్టి పో
తన్నను గొల్చి, రాము సుగు । ణౌఘము లెన్నిన రామదాసు గో
పన్నను మెచ్చి, రాముచరి । తాంబుధి నీదిన గోపినాథ వేం
కన్నను, సుబ్బరాయ కవి । కాంతుని నెంచి, నమస్కరించెదన్.

సీ. అన్నకు నఖిల పి । తార్జిత మర్పించి,
రామ పీఠంబు మా । త్రము గ్రహించి,
రఘురామభక్తి, సా । మ్రాజ్యమంచు భజించి,
భోగభాగ్యవిలాస । ములఁ ద్యజించి,
ఏడిండ్లలో బిచ్చ । మెత్తి తృప్తిం గాంచి,
నృపులిచ్చు కల్మిఁ దృ । ణీకరించి,
హృద్యానవద్యస । త్కృతులను విరచించి,
కలియుగ నారద । ఖ్యాతి మించి,

గీ. గాయకశ్రేష్ఠులకు నగ్రి । గామియైన
యకులశాంతాననాంభోజు । యతిబిడౌజుఁ;
ద్యాగవిజితాంగరాజు, శ్రీ । త్యాగరాజు,
భక్తిధిక్కృత కపిరాజుఁ । బ్రస్తుతింతు.

చ. ఎవనిస్మరింప, జ్ఞాన ముద । యించి నిజాత్మ గృహస్థ దీప మై
రవి యనఁగ్రాలు, మోహమయ । రాత్రిసమస్తమున స్తమించు, లోఁ
బ్రవిమలదివ్యనేత్రము వి । రాజిలు, రామచరిత్రరత్న వై
భవము లభించు, నట్టి హరి । భక్తునకిచ్చెద మన్నమస్కృతుల్.

స త్పు రు ష ప్ర శం స

గీ. మోహజనితసందేహసం । దోహతమస
మెవరి నఖకాంతికిఁ నశి । యించు నందు
రట్టి గుణమణిఖను లగు । నార్యజనుల
సాధుచరితంబు నెన్నెద । సంతతంబు.

గీ. నీరసంబయ్యు గుణములన్ । విస్తరిల్లి,
యన్యగుహ్యావనంబున । కఖిల కష్ట
ములకు నోర్చిన కార్పాస । ఫలముఁ బోలు
సాధుచరితంబు సత్కవి । సన్నుతంబు.

గీ. మంగళానందకరరూప । మహిత మగుచు
నలరు సాధుసత్పురుష స । మాగమంబు,
పతితపావన విఖ్యాతిఁ । బరిఢవించు
జంగమాకార తీర్థరా । జంబు గాదె ?

గీ. సత్పురుషనామ తీర్థరా । జంబునందు
రామభక్తియె గాంగని । ర్ఝరిణిఁ బోలు;
బ్రహ్మజిజ్ఞాసయే సర । స్వతినిఁ బోలు;
హరికథాసుధాలహరియె । యమునఁ బోలు.

గీ. సాధుసజ్జనతీర్థరా । జంబునందు
విమలవిశ్వాసమే వట । వృక్ష మగును;
ఆత్మధర్మంబె యూహింప । నచలభావ;
మఖిలజనగమ్య మయ్యది । యవనియందు.

గీ. అందు సేవించి సుస్నాతు । లైనవారు
వరచతుర్వర్గఫలసిద్ధిఁ । బడయఁ గలరు
సాధుసజ్జన తీర్థరా । జ ప్రసిద్ధి
ఇట్టిదని చెప్ప శక్యంబె । యెవరికైన.

గీ. సాధుజంగమ తీర్థరా । జంబు నందు
సంచరించినఁ గాక్కెర । యంచ యగును;
కాకియున్ గోకిలంబయి । ఘనతఁ గాంచుఁ;
దత్ప్రభావంబు వర్ణింపఁ । దరమె మనకు.

మ. మునువాల్మీకియు, నారదుండు, ఘటసం।భూతుండు, నూహింప స
జ్జనసాంగత్యము కారణంబుగను ప్ర।జ్ఞాధుర్యులై, భూతలం
బున రాగిల్లరె? భూజలాంబరచరం।బుల్, చేతనంబుల్ విచే
తనముల్ ధన్యతఁగాంచవే? యతుల స।త్సాంగత్యయోగంబునన్.

గీ. స్థలజలాంబరచరములు, । స్థావరములుఁ
జేతనంబులు, నను పంచ । జీవములును
మతి, యశో, గతి, భూతి, స । న్మాననీయ
వర్తనములొందె సుజనసం । పర్కమునను.

గీ. మంగళానందనామక । త్మ్రజమునకుఁ
బురుషవరుల సత్సంగతి । మూలమంత్రము;
జపతపస్సాధనములు పు । ష్పంబు లండ్రు;
కార్యసిద్ధియే ఫలమందు । రార్యజనులు.

గీ. శఠుఁడు సుజనసాంగత్య నం । సర్గమహిమఁ,
బారసముఁ బొందు లోహంబు । వలె రహించు ;
ఘనుఁడు దుర్జన సాంగత్య । మొనసె నేనిఁ ?
బాము చందాన గుణమణిం । బాయకుండు.

చ. సరసిజగర్భుఁడున్ హరియు । శర్వుఁడు వాణియుఁ బండితోత్తముల్
సరసకవీంద్రులున్ బుధుల । సత్తములన్ గొనియాడుచుందు రా
సరణిని వారి నేఁ బొగడఁ । జాలుదునొక్కొ ? యనర్ఘరత్న భా
స్వరసుగుణోత్కరంబులను । శాకవణిక్కు గ్రహింపవచ్చునే ?

చ. పరనిజభేదహీన సమ । భావులు, పుష్పసమానులైన స
త్పురుషుల కేను సంతతము । మ్రొక్కెద హస్తయుగంబు తద్యశః
పరిమళవంతమై యెసఁగ ; । బాలుర సుద్దులఁ బోలు మద్వచ
స్సరణిని వీనులార విని । సంతస మొందెద రంచు నెంచుచున్.

దుర్జన ప్రశంస

చ. ఖలులగువార లాత్మహిత । కాంక్ష రవంతయు లేనివార ల
న్యులకు హితంబుఁ జేయరు, జ । నోత్తమ గేహ వినాశ నాభి లా
షులు, గృహసుస్థిరత్వమును । జూడరు, నెమ్మది మంచి చేష్టలం
దలఁపరు, వారికేను సత । తంబును మ్రొక్కెదఁ గార్యసిద్ధికై.

చ. హరిహరసచ్చరిత్రముల । నారయువేళల, విఘ్నమాచరిం
తురు, పరసద్యశోవిధు వి । ధుంతుదు లౌర! సహస్రబాహు భీ
కరులు, సహస్రనేత్రు లప । కారమొనర్పఁగ, దోషపుంజముల్
పరిపరి సంప్రతింప ; ఖలు । లన్ బహు భాషల సన్నుతించెదన్.

గీ. ఖలుల కోపంబు మహిష రా । క్షస నిభంబు ;
వారి తేజంబు ప్రజ్వల । ద్వహ్ని సమము ;
ఉదయమూహింప ధూమకే । తూప మితము ;
హితము కుంభకర్ణుని నిద్ర । వితము దలఁప.

గీ. "చచ్చి సాధించు" నను సామ్య । మిచ్చగించు
దానవులు దుర్జనులు; వారి । మానసములు
ఒరుల సుఖసస్యములకు హి । మోపలములు
సజ్జనహితాజ్య మక్షికా । సంచయములు.

గీ. అన్యదోషంబు వర్ణింప । నాలకింప
ఫణికులేశులు, పృథుచక్రి । వర్తులనుచు
ననిశము సురానుకూలురై । యలరు నట్టి
యమర విభులంచు ఖలుల నే । నభినుతింతు.

గీ. హితము నహితము నొకరీతి । నెదఁ దలంచు,
శాత్రవుని, నుదాసీనుని । మిత్రవరుని
నేకరీతిగ భావించు । నెద ఖలుండు;
వానినైజంబు వినుతింప । వలయుఁ గాదె ?

గీ. ఎలమిఁ బ్రేమించు శిష్టుని । చెలిమిఁ గనక
దౌష్ట్యముం జూపు దుష్టుఁడౌ । ధౌర్త్యమునను ;
పాయసముఁ బాసి యతినీచ । పలల ఖండ
మాత్రమున కాతఁ డలరుఁ బో । మానసమున.

చ. హితమొనరించి స్నేహమున । కెంతయు సంతసమొందు సజ్జనుం
డతుల వియోగదుఃఖము నొ । కప్పుడు గూర్చు; నసజ్జనుండు సం
గతముఁ దిరస్కరించు, నుప । కారమొనర్చెడు, సేగిఁగూర్చు; నే
సతతము నేకరీతి సద । సజ్జనులం గని సన్నుతించెదన్.

చ. జలజజలూకముల్ సలిల । సంభవముల్, సుధయున్ విషాగ్నియున్
జలనిధిఁ బుట్టె; నట్లు, సద । సజ్జను లొక్కెడ సంభవించినన్
దలఁపగ మంచిచెడ్డల వి । ధంబునఁ గీర్త్యపకీర్తులం బలెన్
బొలుచును వారివారి గుణ । ముల్ జనలోక శుభాశుభంబులై.

గీ. అమృతరాశియుఁ జంద్రుండు, । నమరనదియు
సజ్జనోపమానంబులు । జగతియందు ;
నగ్నియున్, దుష్టకలియును, । హాలహాలము,
నహహ దుష్టోపమానంబు । లండ్రు బుధులు.

గీ. మంచి చెష్టల లో విత । ర్కించుకొనుచు
సంచరింతురు సజ్జనుల్ । జగతియందు ;
దాము గావించునదియ సి । ద్ధాంత మనుచుఁ
గష్టముల సంఘటింతురు । దుష్టజనులు.

గీ. మంచిఁ గావించి విఖ్యాతిఁ । గాంచె ఘనుఁడు,
ఎల్లజనులఁ బీడింప వ । ర్థిల్లె ఖలుఁడు,
అమృత మమరత్వమునను వి । ఖ్యాతిఁ బొందె ;
విష మపాయంబుఁ గావింపఁ । బ్రఖ్య వెలసె.

గీ. స్వర్గ నరకంబులనుబోలి, । బ్రాహ్మణ శ్వ
పచుల చందానఁ, బుణ్య పా । పముల భంగిఁ,
గలిమి లేములట్లమర రా । క్షసుల కరణి
జగతి వర్థిలు సుజన దు । ర్జనుల సరణి.

గీ. చేతనాచేతనంబుల । సృష్టిఁ జేసి
మంచిచెడ్డల బ్రహ్మ క । ల్పించుఁ గాక ;
దోషవిష రాశి సద్గుణ । దుగ్ధరాశి
నంచవలె సజ్జనుండేర్ప । రించుఁ గాదె ?

గీ. విధివశంబున జ్ఞాన మా । విర్భవింప
దోషముఁ ద్యజించి జనుఁడు స । ద్గుణముఁ బడయుఁ ;
గాల నైజ కర్మంబుల । కారణమున
మాయకుం జిక్కి వర్జించు । మంచితనము.

చ. వ్రణమును మించుదుష్టుని స్వ । భావము మాన్పఁగశక్యమౌనె? స
ద్గుణయుతులైన సజ్జనుల । కూటమిచే నొక దుర్జనుండు స
ద్గుణుఁడగుఁగాక, నైజమగు । దోషముమాత్రముఁ బాయఁ డెన్నఁడున్
ఫణిమణిధారణంబునను । బాయునొకో కుటిలప్రచారమున్.

గీ. జలము, పవనంబు, గ్రహము లో । షధులు, వస్త్ర
ములును, సాంగత్య కారణం । బునను గాదె
మంచి చెడ్డలఁ గావించు । మానవులకు ;
నరయఁ దగుఁ జూవె సాంగత్య । మనఁగ నేమొ ?

గీ. అంధకారప్రకాశంబు । లాక్రమించి
యొకటి చంద్రుఁ బోషించు, నిం । కొకటి యణఁచు ;
నక్షత్రంబున నీరెండు । నవనియందు
జనుల కీర్త్యపకీర్తుల । సామ్యమొందె.



గీ. సృష్టిఁ బెంపొందు చేతనా । చేతనముల
యందు నేకరీతిగఁ బర । మాత్ముఁ డైన
రాముఁ డాత్మనై సతతంబుఁ । గ్రాలుఁగాన
నెల్లపుడు మ్రొక్కులర్పింతు । నెల్లరకును.



కవిప్రశంస

సీ. భాససత్కవి పాద । పద్మ సౌరభ మాని,
కాళిదాసుని దివ్య । కవిత కెలఁగి,
బాణుని యసమాన । వాగ్వైభవము నెంచి,
పండితా ఖండలు । దండిఁ దలఁచి,
భవభూతి సుకవిత్వ । పటిమను గొనియాడి,
జయదేవు విమల వా । ఙ్మయముఁ బొగడి,

బిల్హణు సుకవితా । కల్హారమును మెచ్చి,
మల్హణు వాగ్జాల । మహిమ మరసి,

గీ. భారవికి నర్థగౌరవ । పద మొసంగి,
సరస మేఘుని మాఘుని । సన్నుతించి,
ఉరుగదాహిమయూరు మ । యూరుఁ గొల్చి,
యాంధ్రకవిపుంగవశ్రేణి । నభినుతింతు.

గీ. రావణుని కారణంబున । రాఘవునకు
సద్యశశ్రీ లభించిన । చందమునను,
కుకవిచేఁ గాదె సత్కవి । కొనురు మిగులుఁ
గుకవి నేరీతి దూషించుఁ । గోవిదుండు.

స్వ విష య ప్ర స్తా వ న

శా. "వ్యాసోచ్ఛిష్టమయుంజగ" త్తనిబుధుల్ । భాషింపనాలించియున్
నీసంబో యటుగీసమో కలచి ని । ర్వేదంబునంబొక, యు
ల్లాసంబూని ప్రబంధకంధిజ యశో । లక్ష్మీవిలాసంబునన్
భాసిల్లన్ గమకింతు రాత్మగత ని । శ్వాసంబునన్ మాదృశుల్.

చ. తలఁపులు స్వల్పముల్ సుకవి । తా గరిమంబిసుమంత లేదు, పూ
ర్వులవలెఁ గీర్తిం బడయఁ । బూనితి రామకథన్ రచింపఁగన్ ;
దలఁపఁగఁ గుంటివాఁడు రత । నంబులఁగోరి యగాధమైన యు
జ్జలనిధిలోనికిన్ దుముకు । చందమునన్ విబుధుల్ హసింపఁగన్.

ఉ. మాయలఁబన్ను దానవుల । మాపి, జగంబులఁ బ్రోవ నాదినా
రాయణుఁడర్కవంశమున । రాముఁడనంగ జనించి నిత్యపా
రాయణ యోగ్యమైన యభి । రామయశంబు గణించెఁగాన రా
మాయణ దివ్యగాథఁ గొని । యాదరఁ బండితు లాదరింపరే ?

ఉ. ఆదరణీయ సారకవి । తాధికులైన మహాకవీంద్రులా
మోదమునన్ రఘూద్వహు న । మోఘచరిత్ర సుధాబ్ధి మగ్నులై
యాదిరచించి ; రేనును ద । దంబుధి దోఁగి భవాబ్ధి దాటినన్
గాదనువారె ? యట్టియధి । కారము లేదను వారలుందురే?

ఉ. రాతిని నాతిఁజేసె రఘు । రాముని పాదసరోజధూళి; నా
కాతని సత్కటాక్షగళి । తామృతవృష్టి లభించెనేని, మ
చ్చేతమునం దమోఘముగ । జీవకళా కవితాస్రవంతి సం
జాతముగాక యున్నె ? యఘ । సంచయవృక్షము పెల్లగిల్లగన్,

చ. ఎనని కృపాదృగంచల మొ । కించుకయంత లభించినంతఁ బం
గువు వనపర్వతాంబునిధి । కోటుల దాటఁగనోపు, మూఁగయున్
గవనముఁజెప్పు, నట్టి హరి । నామము సంతతమున్ స్మరించు స
త్కవులకు లోపముండదను । ధైర్యమునన్ విరచింపఁ బూనితిన్.

శా. పీయూషంబును ధిక్కరించు కవితా । విస్ఫూర్తి లేకున్న, సు
శ్లేషాంశంబులఁజొన్పి, పాఠకులు హ । ర్షింపంగఁ, గ్లిష్టార్థమున్
బాయంజేసి, శిరీషపుష్పమృదువా । క్ప్రాగల్భ్యమేపార నే
వ్రాయంజొచ్చితి నిచ్చమెచ్చి తులసీ । రామాయణగ్రంథమున్.

మ. తులసీదాసుఁడు భక్తితత్పరత, సం । తుష్టాంతరంగంబునన్
బలుకన్ సర్వదిగంతరంబుల ధ్వనిం । పన్ గర్ణపర్వంబుగాన్ ;
గలనాదంబని సామగానమని వి । జ్ఞానుల్ ప్రశంసింతు రే
యలఘుగ్రంథము; నట్టిగ్రంథమును నే । నాంధ్రీకరింతున్ దగన్.

మ. తులసీదాస కృతప్రబంధ మతి ని । ర్దుష్టంబు; స్పష్టంబుగన్
దెలుగుంబాసనువ్రాయఁగాదొడఁగితిన్, । శ్రీరాము సేవింప, నా
తులసీదాసుని గౌరవింప, విబుధ । స్తోమంబు మద్గ్రంథ వా
క్కుల సారస్యము సంగ్రహించి, సభలన్ । గొండాడ కెగ్గాడునే?

గీ. రాముఁ డభిరాముఁ డాడినా । రాయణుండు ;
తులసి, తత్కథాలహరికి । నలరి పలికె ;
నట్టి పలుకులఁ బలికెద । నాంధ్రమునను ;
సంతసింపని ప్రాజ్ఞులీ । జగతిఁ గలరె ?

ఉ. ఏమొక నన్నపార్యగతి । నేగఁగఁ బొండితి లేదు, భారతా
మ్నాయ విరించి తిక్కకవి । నాథుని శక్తి యలభ్యయోగ మా
హా ! మొల్లనాదిసత్కవుల । యట్లు రచింపఁగఁ జేవ లేదు, రా
మాయణ సత్కథారచన । మాటలపైఁ గొనసాగునట్టిదే.

ఉ. పంతముఁబూని కావ్యమున । పద్యముగా విరచింపనౌనె ? ధీ
మంతున కేని దోషము ప్ర । మాదవశంబున నుండు నందురే
నెంతటివాఁడఁ? దప్పుఘటి । యిల్లిన నయ్యది యక్కజంబె ? యా
వంత కృపాకటాక్షమున । నారయుఁడీ కవులార మ్రొక్కెదన్.

ఉ. శ్రుత్యవపథ్యశబ్దములఁ । జొన్పను, క్లిష్టసమాస దుష్ట సాం
గత్యముఁ గూర్ప, భావరస । గౌరవమున్ విడనాడ, శైలి నా
గ్రత్యముఁ జూప, వ్యస్తపద । కాండముఁ బ్రాసములన్ ఘటింప, సా
హత్యము గోరు పాఠకుఁ । కివ్విధ మెంతయు నింపు నింపదే ?

శా. కారాగారమునందుఁ జిక్కి హరిభ । క్తప్రోక్తమార్గంబునన్
హా రామా సుగుణాభిరామయనుచున్ । ధ్యానింపగన్ మ్లేచ్ఛు ని
స్సారున్ తుష్టునిఁ జేసి భక్తునకు స్వే । చ్ఛం గూర్చి రక్షించు సీ
తారామున్ గొనియాడువేళ సుకవి । త్వస్ఫూర్తి ప్రాప్తింపదే ?

ఉ. వీనులకింపుఁ బెంప, సుక । విప్రకరప్రమదప్రధాన మై
తానముతోడి గానము వి । ధానమునన్ గడుసొంపు నింప, వి
జ్ఞానము పల్లవింప, జన । సంఘము మేలని యాలకించి యౌరా
నౌనని సంతసింపఁ గవి । తామృతధారలఁ గుమ్మరించెదన్.

చ. సురనదికైవడిన్ విషము । జొబ్బిల, వక్రపథప్రచారమున్
బొరసిన నేమి ? రాఘవునిఁ । బొందిన మత్కవితా ప్రవాహ మి
ద్ధరణిఁ బవిత్రమై బుధను । తంబగుఁగాదె ? శ్మశానభూతి యీ
శ్వరతనులిప్తమై పరమ । పావనమయ్యె జగన్నుతంబుగన్.

చ. హరిహరపాదపద్మముల । యందనురక్తిఁ గలట్టివాఁడు మ
ద్విరచిత కావ్యఫక్కి విని । వేమఱు సంతసిలున్; కుతర్కమున్
మఱఁగి యసూయచే దురభి । మానముచే సదసద్వివేక వి
స్మరణమునన్ మెలంగుమతి । మంతున కీకృతి యింపు నింపునే.

చ. తనకయితంబు రమ్యమయి, । తాను పఠించిన యంత రుచ్యమై,
ఘనమయి, పూవుఁదేనియల । కైవడి దియ్యముగాఁగ దోఁచు; నే
యనఘుఁడు నిర్మలాత్ముఁడయి । యన్యసుభాషితముల్ పఠించునో,
విని ముదమందునో, యతఁడె । విజ్ఞుఁడనందగు నెల్లభంగులన్.

గీ. భావరసపుష్టి, ఛందోని । బంధనంబుఁ
బద చమత్కృతి మత్కృతి । త్వఁబునందు
నించుకంతయుఁ గనుపట్ట । దెంచి చూడ
రామకథ యని సజ్జనుల్ । ప్రస్తుతింతుర్.

గీ. భాగ్యమత్యల్ప మాశ య । పారవార్ధి,
అల్పుఁ డపహాసముం జేయు । నని తలంప;
సజ్జనుఁడు సంతసించినఁ । జాల దోఁకొ
య నెడు విశ్వాసమొందు నా । యాత్మఁ గలుగు.

గీ. కాకి, కలకంఠముల కంఠ । గరిమఁ గేరు;
బకము, హంస నిస్వనమును । బరిహసించుఁ;
గప్ప, చాతక స్వరమును । గాకు సేయు;
నీచుఁడు సుభాషితంబులన్ । ధిక్కరించు.

ఉ. నల్లనియావు, త్రావెడు జ । నంబులకున్ గుణదాయకంబుగన్
తెల్లని పాలొసంగు కర । ణిన్ బరికింప మదీయ పుస్తకం
బెల్లవిధంబులన్ మిగుల । హేయముగన్ గనుపట్టుఁ గాక, యా
నల్లని వేల్పుఁ జెందుకత । నన్ రసవంతము గాక యుండునే.

మ. ఫణిభోగంబున, నద్రిపై, గజశిరో । భాగంబునన్ బుట్టియున్
మణి, మాణిక్యము, మౌక్తికంబు, దలఁపన్ । త్మొపాలుమాళిన్ బ్రతి
క్షణమున్ గాంతులఁ గ్రాలురీతి, నొకచో । జన్మించి, వేరొక్కచో
బ్రణుతిన్ గాంచి రహించు సత్కవికృత । గ్రంథంబమందంబుగన్.

చ. హృదయసముద్రసీమను ర । హించెడు మామక భావశుక్తియన్
సదనమునందు, వాణియను । స్వాతిసమాగమ మైన వేళ, ధీ
ప్రదసువిచార వర్షజల । పాతమునన్ సుకవిత్వమౌక్తికం
బొదవదె? రామనామరుచి । నున్నతిగాంచదె కావ్యమాలలన్.

ఉ. పుట్టను బుట్టినట్టి ముని । పుంగవుఁ డాదిని రామగాథకుం
బట్టముఁ గట్టఁగాదె? సుగ । మంబగు నాకిఁకఁ గష్టముండునే?
గట్టిగ భూధవుం డెలమిఁ । గట్టఁగఁ గట్టినయట్టి సేతువున్
బట్టి పిపీలికంబు నది । పారముఁ జేరదె యశ్రమంబుగన్.

చ. కలిమిఁ గలట్టివారలకు । గ్రంథములిచ్చిన లాభమేమి యి
య్యిలఁ గల యెల్లలన్ విడిచి । యీకృతి రామునినాశ్రయించు, స
మ్మలయధరాశ్రియంబుఁ గల । మార్గికుల; వెండి, పసిండి వెండికొం
డలఁ గల మార్గికులం గనిన । నానుడి చందము తెల్లమయ్యెడిన్.

ఉ. సత్యముఁ దప్పనట్టి యభి । జాతుఁడు, సద్గుణవంతుఁ డంచుఁ బా
శ్చాత్యులు సైతమేఘునని । శాశ్వత సత్కథ లాలకింతు రా
నిత్యునిఁ, గీర్తిసాంద్రు, ధర । ణీరమణేంద్రుని, రామచంద్రునిన్
గృత్యధినాథుఁ జేసి నివ । రింతుఁ దదీయ కథావిశేషమున్.

చ. కవివరులెల్లఱున్ సరస । కావ్యములెన్ని రచింప, ఱబ్బువిన్
అవిదితకావ్యముల్ ఖిలము । లైనవియెన్నియొ, సూర్యరశ్మియున్
దవులనివెన్నియుండ వయి । నన్ భవతారకహేతువంచు రా
ఘువునకు భక్తినంకితము । గా విరచించెదఁ దచ్చరిత్రమున్.

గీ. వరకవిప్రోక్త సత్కావ్య । వైభవంబు
హేయమగుఁగాదె? రాముని । నెనయకున్న;
నత్యలంకార భూషిత । యయ్యుఁ జంద్ర
వదన దూషిత యగును వి । వస్త్రయైన?

కృతికన్యాదానము

ఉ. శ్రేష్ఠము నీదునామనుతి । జెందిన గ్రంథము; శబ్దసౌష్ఠ వా
ధిష్ఠితమై, వరిష్ఠమయి, । దీర్ఘసమాసపటిష్ఠమై, రస
ప్రేష్ఠము నయ్యు నీదునుతి । పెంపువహింపని యట్టిగ్రంథ ము
ల్నిష్ఠము, పండితుల్ భళి భ । ళీ యని మెచ్చరు జానకీపతీ.

ఉ. పండితులైనవారలు ప్ర । బంధములోలి నరాంకితంబు గా
కుండ రచించి నీకొసఁగి । యుండిరి, వారలకుండునట్టి స
త్పాండితి లేకయుండిన, భ । వత్పద భక్తిసుధారసాన్వితా
త్ముండను గావునన్ పలుకఁ । బూనితి నీకృతి జానకీపతీ!

చ. సరళపదాన్వితన్, సుజన । సన్నుతవృత్త సువర్ణవిగ్రహన్
సరసగుణాలవాలఁ, గవి । సంచయలక్షితలక్షణాఢ్య, సుం
దర గజయానఁ, జారుతర । నర్తన, భూషిత చంపకోత్పలో
త్కరఁ, గృతికన్యకన్ గరుణఁ । గల్గి గ్రహింపుము జానకీపతీ.

మిత్రప్రశంస

మ. గురువర్యుండు మదీయబాంధవుఁడు, నా । కుం జాలయిష్టుండు, భూ
సురలోకోన్నతుఁడార్యపూజితుఁడు, సు । శ్లోకుండు, దాంతుండు, స

చ్చరితుండూర్జిత ధీవిశారదుఁడు, సుస్వాంతుండు, శాంతుండు నా
తరిణయ్యన్ వినుతించెదన్ సకలవిద్వాంసుల్ ప్రశంసింపగన్

గీ. ఆదిభట్ల జోగయ్య మహాశయుండు,
జ్యోతిషగ్రంథజలధి ఘటోద్భవుండు,
సకల వైదిక మార్గనిష్ఠాగరిష్ఠుఁ
డతని పుత్రుండు తరిణయ్య యను ఘనుండు;

గీ. సంస్కృతాంధ్ర భాషాక్షీర జలధిజాత
దివ్య పీయూషముం గ్రోలి తేజరిల్లు
పండితాఖండలుండు, మత్ప్రాణహితుఁడు,
సకలబుధసన్నుతాజాత శాత్రవుండు.

గీ. అతని ప్రోత్సాహమునను సాహాయ్యమునను
ఇమ్మహాగ్రంథరాజంబు నెట్టులైన
సాంతరింపఁ దలంచితి; సంతసించి
పండితులు నన్ను మన్నింప వలయుఁ గాదె ?

### రామనామమహిమాభివర్ణనము

గీ. అహాహా!! రామాయణామ్నాయ మనఁగ నేమొ
యెఱుఁగ శక్యంబె ? వాల్మీకి యెఱుఁగుఁ గాక ;
జనులకున్ గోమలంబగు సక్షరమయ్యు
దూషణాన్విత మయ్యు నిర్దుష్ట మగును.

గీ. జలతరంగంబులంబోలి కలసి మెలసి,
అతులవాగర్థముల భంగి నుతికి నెక్కు,
జానకీరామచంద్రుల సన్నుతించి,
వారి పదపద్మదాసులఁ బ్రస్తుతింతు.

చ. భరతునిఁగొల్చి, లక్ష్మణుని । వాసిసహోదరుఁబ్రస్తుతించి, దా
శరథిని గన్న దంపతుల । సంపదలన్ గొనియాడి, జానకీ
పరిణయకర్తయౌ జనకు । ప్రాభవమున్ వినుతించి, దైత్య వా
నరులను, జాంబవంతుఁ, గపి । నాథుఁ దదన్యుల సన్నుతించెదన్.

చ. అనఘము, సూర్యచంద్రులకు । నగ్నికిఁ గారణభూత, మావిరిం
చనునకు, శూలికిన్, హరికి, । స్థానము; నిర్గుణ,మాగమాలయం
బనుపమ మాద్య, మచ్యుత మ । నంత శుభప్రదమంత్రరాజ మే
ననిశముఁ బ్రస్తుతింతునుగు । ణామృతధామము, రామనామమున్.

చ. సతతము మంత్రరాజమని । శాశ్వతమంచు నమోఘమంచుఁ, బా
ర్వతిహృదయంబునన్ గొలుచు । రాముని నామము తత్త్వభావమున్
మతినిగ్రహించిశూలి తన । మైసగమున్ సతికిచ్చె; లోక స
మ్మతముగ రామనామమహి । మం గొనియాడి భజించు భక్తుఁడై.

గీ. హరి సహస్రనామములకుఁ । బ్రాణమైన
రామనామమంత్రంబును । బ్రస్తుతించి
ఆదికవియైన వాల్మీకి । యనఘుఁడయ్యెఁ;
దత్ప్రభావంబు వర్ణింపఁ । దరమె మనకు.

గీ. భక్తులకు మోక్షకామినీ । భూషణములు
ముక్తి వినువారికిన్ గర్ణ । భూషణములు
అక్షరంబులు రామనా । మాక్షరములు
తత్ప్రభావంబు భావింపఁ । దరమె మనకు

ఉ. ఆయతమోక్షవృక్ష కుసు । మాపచయంబును గోరు పూరుషుల్
"రా"యని యుచ్చరించినఁ బు । రాకృతపాపము లేగు, నాపయిన్
"మా"యనినంత నేమగిడి । మానసగేహముఁ జేరజాలవా
మ్నాయనిధానమంచు రఘు । నాథుని నామము సంస్మరింపరో.

చ. కొలువఁగ నేర్చు భక్తులకుఁ । గొంగుపసిండిగ నుండు, మోక్షమున్
చెలువను దెచ్చియిచ్చు; విభ । జించి భజింపఁగ రాదు, శైత్యమున్
సలిలమునుండి వేర్పఱుప । శక్యమె? జీవముతోడి బ్రహ్మ మ
ట్లలరెడు రామనామ మధు । రాక్షరముల్ భవవార్ధిపోతముల్.

గీ. అద్వయంబైన రామాక్ష । రద్వయంబు
మోక్షనామక పీయూష । మునకు, మధుర
తృప్తిసమములై, భూమి భ । రింపఁ జాలు
కమఠశేషతుల్యంబులై । ఘనతఁ గాంచె.

చ. అరయఁగ నామరూపముల । యందు రవంతయు భేదమున్నె? స
త్పురుషులు భేదభావమును । బొందరు, తద్గుణమున్ గ్రహించు సు
స్థిరమతిమంతు; లాఖ్యకు న । ధీనము రూపము; నామ మొండు సం
స్మరణముఁ జేసినంతనె, ని । జంబగు నాకృతిఁ దోఁచు, గంటికిన్.

చ. సుకరమె నామరూపముల । చొప్పిదియంచు నెఱుంగఁజేయ? రెం
టికి సగుణంబు నిర్గుణము । నిక్కువమైన ప్రమాణ, మెవ్వఁడీ
సకలము రామశబ్దమున । సమ్మిళితంబని యాత్మ నెంచు, నా
యకలుషితాత్ముఁడే చతురుఁ । డంచు వచింపఁగనొప్పు నిభ్భువిన్.

మ. వదనద్వారము రామనామమణి దీ । పవ్యాప్తమై వ్రాలుసేన్,
హృది, బాహ్యంబున, నంధకారమనఁగన్ । రేకస్తు వ్యామోహాంబు
భ్యుదయంబొందదు రామనామవరమం । త్రోచ్చారణన్ యోగిమో
హదకామాంధ్యముఁ బాసి సంతతము బ్ర । హ్మానందముం బొందెడున్.

గీ. జ్ఞాని, యార్తుఁడు, నర్థార్థి, జి । జ్ఞాసు వెలమి
నామజప వైభవంబునన్ । వఱలుచుండ్రి;
సంకటముఁ బాపి శాశ్వత । సౌఖ్యమిచ్చు
రామనామంబు కైవల్య । ధామ మరయ.

గీ. ఇలఁ జతుర్విధ పురుషార్థ । హీనుఁడయ్యు
జనుఁడు రామనామసుధా ర । సంబుఁ గ్రోలి
పాపభూయిష్ఠ సంసార । వార్ధినుండి
పారముంజేరు నందురు । భక్తవరులు.

గీ. సగుణ నిర్గుణములు కష్ట । సాధ్యము లగు
రామనామంబుచే నవి । ప్రాప్తము లగు;
బ్రహ్మమును నిర్గుణంబని । ప్రస్తుతింతు
సగుణమని రామనామమున్ । సన్నుతింతు.

చ. ఇల నల రాఘవుండు జని । యించెను లోకహితంబుఁ బొంటెఁ, దా
నెలమిని సంకటంబుల స । హించెఁ, దృజించె సుఖంబుఁ, బేదసా
దుల సుఖయింపఁ జేసెఁ, గల । దుష్టుల నెల్లఁ సంహరించె, నే
యల ఘుఁడు రామనామమహి । మాతిశయంబు నుతింపకుండునో.

ఉ. రాముఁడు దుష్టదానవుల । ప్రాణములన్ గొనుటేమి వింత? త
న్నామము దోషదుఃఖము ల । ణంచి దురాశను సంహరించు; శ్రీ
రాముఁడు శూలివిల్లు సుక । రంబుగఁ ద్రుంచుట యక్కజంబె? త
న్నామము సాధుభక్తసుజ । నంబుల పాపముఁ ద్రుంచు వేల్మిడిన్.

ఉ. రాముఁడు దండకాటవిఁ గ । రంబుఁ బవిత్రముఁ జేయుఁగాక, త
న్నామ మనేక భక్తుల మ । నః పరిశుద్ధికి హేతువయ్యె; శ్రీ
రాముఁడు లోకకంటకుని । రావణునిం దునుమాడుఁగాక, త
న్నామము లోకమందుఁ గలి । నాశనముం బొనరించు నెంతయున్.

ఉ. రాముఁడు తన్నుఁ గొల్చు కపి । రాజని నాజిని బ్రోచెనట త
న్నామ మనేక దీనుల ఘ । నంబుగఁ బ్రోచెె; జగన్నుతంబు గన్
రాముఁడు సేతుబంధనము । నన్ గపిసేనఁ దరింపఁజేసెఁ, ద
న్నామము భక్తసంఘ భవ । నారకవార్ధికి సేతు విభ్యువిన్.

చ. ఎవఁడు హృదంతరాళమున । నెత్తఱి రాముని వానినామమున్
దివిరి స్మరించువానికి న । ధీనము జ్ఞానము; భక్తియుక్తులై
శివ మని రామనామము భ । జింపుచు తత్ఫలమున్ భుజింపుఁ డీ
భవముఁ ద్యజింపుఁ డున్నత శు । భప్రదముక్తిసృజింపుఁ డెల్లఱున్

గీ. నిర్గుణంబగు బ్రహ్మంబు । నేఁ దలంతు,
సగుణమగు రామచంద్రుని । సన్నుతింతు,
రామనామ మీరెంటికి । ధామ మనుచుఁ
బ్రస్తుతించెద మది నేక । భావమునను.

చ. సనకసనందనాది ముని । చంద్రులు, యోగులు, రామనామమున్
మనమున సంస్మరించు కత । నన్ భువి ధన్యతఁగాంచి, రీశ్వరుం
డనయము రామనామ మహి । మాతిశయంబు భజించి రుద్రుఁడై
య్యనుశివుఁడయ్యె, లోకమున । యోగివరుండననొప్పె నెంతయున్

మ. భగవన్నామము నెంచి సంతతము సం । భావింపగా నేరికే
నగుఁబో మేలు; గజేంద్రుఁడున్ ధ్రువుఁడుఁ బ్ర । హ్లాదుండజామీళుఁడున్
జగతిన్ ఖ్యాతికి నెక్కి మోక్షపదమున్ । సాధించిరట్టుండె; నె
న్నఁగ వీక్షింపఁగరాని వేశ్యయుఁ గనెన్ । వైకుంఠముత్కంఠయై.

గీ. ధ్యాన సవన పూజాది వి । ధానములను
మూఁడుయుగముల భక్తులు । ముక్తిఁ గనిరి;
హీన భవపాప భూయిష్ఠ । మైన కలిని
నామ ముచ్చరించినఁ జాలు । క్షేమ మొదవు.

గీ. జ్ఞాన భక్తి కర్మములకు । స్థలము లేని
కలిని, రామనామంబునం । గలుగు ముక్తి;
కపట ఖలుషిత కలికాల । కాలనేమి
యంత మొందు సద్బుద్ధియన్ । హనుమువలన,

గీ. రామనామ మమోఘ మ । ప్రతిహతంబు;
నారసింహంబు శ్రీరామ । నామ మహిమ,
మరయఁ గలికాలమే దాన । వాధిపుండు,
భక్తవరుఁడు ప్రహ్లాదుఁడో । ప్రాజ్ఞులార.

క. పగనేన్, వగనేన్, గల నె
వ్వగనేన్, బొగరెక్కి యలస । భావంబుననేన్
భగవన్నామముఁ దలఁచిన
ఖగవాహనుఁ డోమునండ్రు । కలిఁ దత్త్వజ్ఞుల్.

గీ. శిలల సలిలంబులం దేల్చి । జలధి దాఁటెఁ,
గపుల సుమతుల మంత్రులఁ । గా నొనర్చె,
నహహా! శ్రీరాము మహిమంబు । నరయవశమె?
కుమతి గల నన్నుఁ నుత్తమో । త్తమునిఁ జేయు.

మ. తొలుతన్ గాకభుశుండిచెప్ప విని, ని । ర్దుష్టంబుగా దేవికిన్
దెలిపెన్ శంకరుఁ డీ చరిత్రమును భ । క్తిజ్ఞాన తేజోమహో
జ్జ్వలుఁడై; పిమ్మటయాజ్ఞవల్క్యముని సంభాషింప నాలించెఁ జి
త్కళ దీపింప మునీశ్వరుండగు భర । ద్వాజుండు మోదాఢ్యుఁడై

గీ. అమరవినుత రామాయణ । మమర నదియ
అమల చిత్తంబు చిత్రకూ । టాచలంబ
భక్తియమునది యుద్యాన । వన సమాన
మగును జానకీ రఘురాము । లలరుచుండ్రు.

సీ. విజ్ఞాన వైరాగ్య । విజ్ఞాపనంబున
శ్రోతకు లోకసు । శ్లోక గురువు
సంసార నామక । సంకటంబు లణంగ
వెరవు సంబోధించు । వేల్పువెజ్జు

నిష్ఠఁగలవారు విజ్ఞాన । నేత్రములను
తెఱచి చూచినఁ గనుపట్టుఁ । దెల్లముగను.

సీ. సుందర వృత్తార । వింద సందోహ ని
ష్యందభావమరంద । సంయుతంబు
విద్వజ్జనవ్రాత । వినుత భవ్యకవిత్వ
సౌరభప్రావృతా । శాతటంబు
లలిత మనోహ రా । లంకార విరచిత
భూరిశబ్దపరాగ । భూషితంబు
ధ్వనిరీతి గుణగణ । వ్యంగ్యశయ్యారస
మత్స్యసందోహ సం । శ్రయగృహంబు

గీ. పరమపావన భక్త బం । భరకులంబు
ఆర్యసన్నుత పరమ హం । సాన్వితంబు
జ్ఞాన వైరాగ్య జప తపో । జలచరంబు
మహిత రామాయణామ్నాయ । మానసంబు.

గీ. మానసము సమీపంబున । మల్లడించు
రమ్య సజ్జన సంచయా । రామసీమ;
శ్రద్ధ యనునట్టి యతుల వ । సంతవేళఁ
బుణ్యజన సత్కవిశ్రేణి । పొదలు మెదలు.

గీ. భక్తిరస పూరిత జ్ఞాన । ఫలముతోడ
యమ నియమ ధారణాది పు । ష్పములతోడ
సత్య శౌచ క్షమా దయా । శ్రద్ధలనెడు
కుజ లతాంత సంతతియందుఁ । గొమరుమిగులు.

గీ. రామసత్కథా కథన సం । శ్రవణమునను
పులకితాంగంబై యూహింపఁ । బుష్పవనము

నేత్రఘటములతో భక్తి । నీరమూని
హృదయ వనపాలకుండందు । మెదలుచుండు.

సీ. సంసార సంపర్క । సంఘర్షణంబుచే
నిమ్నోన్నతపథంబు । నెగడు కతన
దుర్జన దుర్వాక్య । దుష్ట సింహ వ్యాఘ్ర
దందశూక శ్రేణి । తనరు కతన
ఇషణత్రయోన్నత । పృథ్వీధర వ్యాప్తి
ననిశంబు దుర్గమం । బయిన కతన
మద మోహ లోభ కా । మ క్రోధ మాత్సర్య
భీకరాటవులచే । వెలయు కతన

గీ. శ్రద్ధ యను శంబలము లేక, । శుద్ధమైన
ఘనుల స్నేహంబు లేక, రా । ఘవుని కరుణ
లేక యేరుం జేరగ లేరు । లోక వినుత
మహిత రామాయణామ్నాయ । మానసమును.

గీ. క్రూర పాషండ కాముక । కుటిల కుజన
కాక బక ఘూక శంబూక । భేకములకు
మహిత రామాయణామ్నాయ । మానసంబు
దప్రగాహుండు నందుఁ స । త్యము వినుండు.

గీ. మాయ యను మంచు మొదుగ । మలయు కతన
మించి మాహాత్మ్య శైత్యంబు బా । ధించు కతన
హీనుఁడగు పూరుషుండేగఁ । డేగుఁగాక
స్నాన మొనరింపఁ జాలఁ డి । మ్మానసమున.

గీ. రామ పాదారవింద మ । రంద పాన
మత్తచిత్తులు భక్తు లి । మ్మానసమున

స్నానముం జేసినంతన । క్షణములోన
భయద తాపత్రయానల । జ్వాలలణఁగు.

చ. అలరులఁ దేనెయూరినటు । లాశుగతిన్ వరశబ్దధాటితో
నులియుచు మత్కవిత్వసర । యూనది రామచరిత్ర మానసో
జ్జ్వల సలిలంబులం బొడమి । సర్వదిగంతము లంటి పాఱుచున్
గలిమలమున్ హరించుచు జ । గన్నుతకీర్తి గణించు నిబ్భువిన్.

మ. త్రివిధశ్రోతలు మత్కవిత్వ సరయూ । తీరస్థసద్గ్రామముల్
అవగాహాగత సత్సమాజమె యయో । ధ్యా పట్టణంబారయన్
భువి నీ యాపగ పాపభూరుహము ని । ర్మూలంబుగాఁ జేసి, స
త్కవులన్ లోఁగొని భక్తకోటికొసఁగున్ । గైవల్యకళ్యాణమున్.

సీ. శిష్టుః రక్షించు । శ్రీరాముని విలాస
గాథలు వర తరం । గములు గాగ
భరతాది సోదర । వరుల సద్భావముల్
సచ్చరిత్రము లంబు । జములు గాగ
వర పురోహిత హిత । పరివార మాన్యగాఁ
గల జనున్ జలచరం । బులును గాఁగ
శ్రీరామసముపేత । సీతా స్వయంవర
శోభ నదీనైజ । శోభ గాగ

గీ. ప్రశ్నలు తరంపఁ జేయు నా । వలును గాగ
సకలముం జెప్పు బుధులు నా । వికులు గాగ
బరశురాముని రాద్రింబు । వఱద గాగ
వసుధ నీసరయూనది । ప్రణుతికెక్కు.

గీ. రామ రావణ ఘోర సం । గ్రామమునను
సద్యశశ్శ్రోణి నదమొందు । సంభవించె

రామభక్తియన్ దేవ ని । ర్ఝరిణియందు
సరసులుప్పొంగ నీనదుల్ । సంగమించు.

గీ. సృష్టిఁగల దుష్ట సంసార । తృష్ణఁ దీర్చు
నిన్నదీతోయములఁ గ్రోల । కున్న జీవి
ఎండమావుల వీక్షించి । యేగి, మరలి
తృష్ణచేఁ దల్లడిల్లెడు । మృగముఁ బోలు.

## ముని సంవాదము

### రామాయణ ప్రశంస

మ. ప్రణుతింపందగువాల్మికీయమును శ్రీ । రామాయణాఖ్యాయమున్
ఘనవిద్యా సముదాయమున్ సకలలో । క శ్రేయమున్ జాంబవ
ద్ధనుమద్జ్ఞేయముఁ గీర్తనీయమును పా । పాపాయమున్ ధ్యేయమున్
దినపారాయణగేయమున్ విబుధ పా । నీయామృత ప్రాయమున్.

### ప్రయాగ క్షేత్రము

ఉ. రాగ విహీన యోగిజన । రంజితయాగము, భక్తలోక సం
యోగము, దుర్జనవ్రజ వి । యోగము, తైర్థిక బృంద కల్మష
త్యాగము, మోహనిర్ఝర ని । దాఘము, సన్మునివేష్టితాష్ట ది
గ్భాగము, పుణ్యసంచయ వి । భాగముపొల్చుఁ బ్రయాగమిభ్భువిన్.

మ. నిరతింబూని త్రివేణిఁ గ్రుంకులిడి, వే । ణీ మాధవుంగొల్చి, త
చ్ఛ్రీణాబ్జంబుల నంబుజంబులను పూ । జంజేసి, ధ్యానించి, దు
స్తర పాపక్షయ హేతువైన వట వృ । క్షచ్ఛాయఁ గైవల్య త
త్పరులై భక్తులు విశ్రమింతురు ప్రయా । గ క్షేత్రరాజంబునన్.

గీ. ఇట్టి తీర్థరాజంబున । నెల్ల మునులు
మాధవుని దివ్య పాద ప । ద్మములఁ గొల్చి.

జ్ఞాన వైరాగ్య దమ్ములైన । శాస్త్రములను
చదివి బోధించుచుందురు । సజ్జనులకు

గీ. అచటఁగల భరద్వాజుని । యాశ్రమమున
సాంఖ్య కర్మ వేదాంతాది । శాస్త్రములను
శారికా కీర సమితియుఁ । జదువుచుండు
నితర ముని పుంగవులచొప్పు । నెఱుఁగ వలెనె?

మ. ఒకనాఁడంతట యాజ్ఞవల్క్యముని వ । ర్యుండాత్మ శిష్యాళికిన్
సకలామ్నాయ రహస్యమున్ దెలుపుచున్ । సర్వజ్ఞుఁడై; వేకువన్
నకలంకంబుగ స్నానమాడి, శుచియై । యమ్మాధపుంగాచి, యా
త్మకుటీరంబున కేగుచుండఁగ భర । ద్వాజుండు సద్భాగ్యుఁడై

చ. ఎదురుగఁబోయి, మ్రొక్కి తన । యుంటికిఁదోడ్కొనియాదరించి త
త్పద కమలంబులన్ గడిగి । "ధన్యుఁడనైతిఁ బవిత్రమయ్యె మ
త్సదనము యాజ్ఞవల్క్యముని । సత్తమ" యంచు వచించియాసనం
బిడె గొనుఁడంచు నిచ్చి, మును । లెల్లఱు మేలని సన్నుతింపఁగన్.

చ. "రాజతశైలవాసమున । రాజిలు యోగివరుండు భర్గుఁడ
వ్యాజ కృపాకటాక్షమున । నారయు వేలుపు భక్త కల్ప ధా
త్రీజము రామచంద్రుని స్మ । రించునె యంచుఁదలంచి యాభర
ద్వాజుఁడు యాజ్ఞవల్క్యముని । వర్యున కిట్లను సంశయాత్ముఁడై

చ. ధరణి సమస్తధర్మముల । తత్త్వమెఱింగి యెఱుంగఁ జేయు స
ద్గురువుల పాదసేవ యెదఁ । గూరిన మాయఁ దొలంగఁజేయు నీ
చరణ సమాశ్రయంబునను । సంశయదోష మణంగునో మునీ
శ్వర! యెఱిఁగింపవే సకల । శాస్త్ర పురాణ రహస్య వేదివై.

ఉ. శ్రీరఘురామునిన్ మది భ । జించి తదీయ పదాబ్జ భాసుధా
ధారలఁ గ్రోలి క్రోలి భువి । ధన్యతఁ గాంచిన యోగివాహు నీ

వారసి చెప్పలేని యొక । యంశము లేదని నమ్మి నెమ్మదిన్
జేరిన సంశయాంశమును । జెప్పెదఁ గూరిమి నాలకింపవే ?

గీ. అచ్యుతుండు శివుండు క । ల్యాణమూర్తి
జ్ఞానగుణరాశి వ్యామోహ । హీనుఁ డజుఁడు
అతఁడు నివసించు కాశియం । దంతరించు
జీవి శాశ్వత మోక్షంబుఁ । జెందునందు.

ఉ. దివ్యగుణాభి రాముఁడని । ధీరతముండని రామచంద్రునిన్
శ్రావ్యముగా నుతించెదరు । సన్మను లెల్లరు; "బ్రాహ్మణో నహం
తవ్య" యనంగనొప్పెసఁగు । ధర్మముఁదప్పి సతీవియోగియై
అవ్యయమైన క్రోధమున । నాదశకంధరు సంహరింపఁడే ?

మ. షడరాతిన్ గోల్పడి కామమోహమదలో । భక్రోధ మాత్సర్య దు
ర్గుణుఁడై రావణు సంహరించె నమరుల్ । కొండాడి రాసేతకున్
బ్రణుతింపఁదగునో కో రాముని చరి । త్రంబున్? సతీనాయకుం
డశేషాద్భుతగుణాన్వితుండు, కరుణా । స్వాంతుండు చర్చింపగన్.

గీ. అలికనేత్రుఁడా రాముని । నభినుతింప
నేమి హేతువో యొక్కింత । యెఱుఁగవలదె ?
ఈ వెఱుఁగని యంశ మెం । దేనిఁ గలదె ?
యాజ్ఞవల్క్యమునీశ్వర । యానతిమ్ము.

చ. అనవుడు మౌనమూని దర । హాసము మోమునఁ జెంగలింపగన్
గనుఁగవ మోడ్చి జ్ఞానదయ । నంబున రామునిఁ జూచి యీశ్వరున్
మనమున సంస్మరించి సుర । మానవ దానవ సమ్మతంబుగా
ననఘుఁడు యాజ్ఞవల్క్యముని । యాముని సోమునిఁ జూచి యిట్లనున్

గీ. సాధు వత్స భరద్వాజ । శంకితాత్మ
ఈ వెఱుంగవె రాముని ? । నేవచింప

వలెనె? పామర కోటికి౯ । దెలియఁ గోరి
అజ్ఞఁబలె నన్నుఁ బ్రశ్నించె । వైన వినుము.

గీ. కర్మయుగమున రాముని । కథ తలంపఁ
గామ మోహాసురులఁ జంపు । కాళి చూవె;
తత్కథాసుధారసధారఁ । దనివిదీఱ
నాస్వదింపుము సందేహ । మంతరించు.

గీ. సరసరామాయణామృతా । స్వాదనమున
సజ్జనామర సంతతి । సంతసించు
సతికిఁ బూర్వ మొకప్పుడీ । శంకదోఁచె
దానిఁ దొలఁగించెఁ జూవె యం । ధక విరోధి.

గీ. అనఘ దాక్షాయణీదేవి । యనుసరింపఁ
గాలకంఠుఁ డగస్త్యుని । కడకు నేగె;
నమ్ముని యొసంగు రామాయ । ణామృతంబుఁ
గ్రోలి రాము ధ్యానించుచు । శూలి వెడలె.

చ. వినుము మునీంద్ర! పూర్వ మొక । వేళ మహేశుఁడు రామచంద్రుద
ర్శనమును గోరి, రావణునిఁ । జంపఁగ విష్ణువు మానవాకృతి౯
ఇనకులమందు బుట్టెనని । యెంచి, విరించను పల్కు కల్లగా
దని తఱి వేచియుండ జల । జాక్షుఁడు పుట్టె ధరావనార్థమై.

చ. మునివరుఁడైన గాధిసుతుఁ । బ్రోచి, యహల్యకుఁ బ్రాణమిచ్చి యా
జనకజఁ బెండ్లియాడి బుధ । సంఘము మేలని సన్నుతింపగ౯
జనకుని వాక్యమెంచి యను । జన్మునకు౯ గల రాజ్యమిచ్చి తా
వనమున కేగె రాఘవుఁడు । భార్యయుఁ దమ్ముఁడుఁ గొల్చియుండగ౯

గీ. నీచు మారీచుఁ బంపి సం । కోచముడిగి
కపట వేషంబున౯ బంక్తి । కంఠుఁడు

అకట! సీత జగన్మాత । నపహరించి
శంక యొకింతయున్ లేక । లంక కేగె.

గీ. ఘనుఁడు రాముఁడు మాయా మృ । గంబుఁ గూల్చి
సానుజుండయి యేతెంచి । యతివ లేని
పర్ణశాల విలోకించి । వనరి వనరి
నరుని చందాన విరహ సం । తాపమొందె.

గీ. రాఘవుని తత్త్వము గ్రహింప । రాదు చూవె
మునులకైనను బ్రహ్మాది । ఘనులకైనఁ
గామి యాలించెనేనిఁ బ్ర । కామియగును
భక్తుఁ డాలించెనేనిఁ గై । వల్యమొందు.

ఉ. భార్యను దొంగిలించి చను । వాని నెఱుంగని యట్లు కానలో
ధైర్యరమన్ త్యజించి తన । తమ్మునితోఁ దిరుగాడు రాము గాం
భీర్యముఁ జూచి, మెచ్చి, తటి । మించిన దిత్తటిఁ జేరఁ బోలదం
చార్యవరుండు శూలి ముద । మందుచుఁ బోయె సతీసమేతుఁడై.

ఉ. పాయనిభ! శ్రీ రామ నర । పాలుని నాత్మ భజించు సన్మని
ధ్యేయుని శూలిఁ జూచి "జగ । దీశుఁడనంతుఁ డితండు పావనా
మ్నాయపథప్రవర్తి, యొక । మానవుఁ గొల్వఁగ నేటికంచు దా
క్షాయని యేవగించి తన । స్వాంతమునందుఁ దలంచె నివ్విధిన్.

గీ. "అజ మనంత పరబ్రహ్మ । మచ్యుతంబు
కాలముంబట్టి చేష్టలఁ । గాంచునొక్కొ ?
మాయచే నావృతంబయి । మనుజ రూప
ధారణంబున నొంగునే । ధరణియందు ?

ఉ. ధీరుఁడు విష్ణుమూర్తి హరి । దేవహితార్థము కోరి మానవా
కారముఁ దాల్చుఁగాక శితి । కంఠునకుం బ్రియుఁడంగ నొప్పు ల

క్ష్మారమణుండు మూఢుఁడయి। స్త్రీవలెనేడ్చుచు దిక్కులేక యీ
తీరునఁ గాంతకై యడవిఁ। దిప్పలఁ దుప్పల సంచరించునే.

గీ. భర్గుఁ డజ్ఞాని యగునె? స। ర్వజ్ఞుఁ డండ్రు
ఆతనివాక్యంబసత్యంబె? । వ్యర్థమగునె?
రాముఁ డూహింప నిందిరా । రమణుఁ డగునె?
జ్ఞానమభివృద్ధిఁ బొందునే । సంశయమున.

గీ. అనుచుఁ దలపోయు, నాథునిఁ । గని హసించు
నడుగ నుంకించు శంకించు । నాకళించు
నామె చిత్తంబు గ్రహియించి । యలికనేత్రుఁ
డిట్టులనియె నుత్సాహంబు । నెట్టుకొనఁగ.

చ. వనితలు సంశయాత్మలు భ్ర। మంబు గ్రహింపఁగలేని ముగ్ధలే
ఘనుని కథాసుధాంబుధి న। గస్త్యుఁడు గ్రోలెమునుల్ నుతింప నే
యనఘుని నామమున్ దలఁచి। నంతనె ముక్తిలభించు; నట్టి రా
ముని సుగుణాభిరామునిఁ బ్ర। బుద్ధుని నెంచితె కర్మబద్ధుఁగా?

ఉ. వ్యాస పరాశరాది ముని । వర్యులు యోగులు సిద్ధులైన స
న్యాసులు నేమహాత్ముని న। హర్నిశమున్ భజియింతురెవ్వనిన్
వేసరకెల్లశాస్త్రములు । వేదములున్ వినుతించువాని మా
యా సముదంచితాత్మునిగ । నాత్మఁ దలంచితివే తలోదరీ.

శా. మాయాతీతము, నిష్కళంకమును రా । మబ్రహ్మమున్ సన్మని
ధ్యేయంబున్ భజియింపు మాత్మగలసం। దేహంబు నిశ్శేషమున్
జేయంగోరెదవేని నెమ్మెయిఁ బరీ। క్షింపం దగున్; సృష్టికిన్
శ్రేయంబున్ ఘటియింప నచ్యుతుఁడు ధా। త్రిం బుట్టె నిఁకేటికిన్.

మ. భగవన్మాయ నెఱుంగఁజాల రకటా । బ్రహ్మాదులుంజాల, రా
జగతీనాథుని రామచంద్రుఁ గనినన్ । సర్వంబు నవ్యక్తంబగున్;

ఇగురుఁబోణి! తొలంగు మచ్చటికి, నీ । వేతెంచునందాక నా
సగుణున్ గొల్చుచు నీసమీపవటవృ । క్షచ్ఛాయఁ గూర్చుండెదన్.

చ. అనవుడు లెస్సయంచు దర । హాసము మోమున నంకురింప న
వ్వనిత "మహేశ! రాముని స్వ । భావము నేఁ బరికించుదాన నె
మ్మనమున సంశయంబఱఁగు । మార్గముఁ జూపితి" వంచుఁ దత్క్షణం
బునఁ జనియెన్ రఘూద్వహుఁడు । పొన్గుచు సంచరియించు కానకున్.

ఉ. దండక కాననాంతమునఁ । దమ్మునితో విహరించు దివ్య కో
దండుని రామచంద్రుఁగని । తన్మహిమన్ బరికింప నెంచి య
య్యండజయాన యజ్జనక । జాకృతిఁ దాల్చి సమీపమార్గమం
దుండఁగఁ జూచి రాముని స । హోదరుఁ డెంతయు సంభ్రమించుచున్.

ఉ. "ఈవనిఁ గాంతుఁ బాసి చరి । యించునె జానకి? యెంతవింత యం
చా వనితాకృతిం గని మ । హాత్ముని రామునిఁ జూచి యెంతయున్
భావనఁ జేసి యాతని ప్ర । భావమెఱింగిన లక్ష్మణుండు లోఁ
జేవఁ బొఱంగక య్యువిద । చెయ్వులఁ జూచుచునుండె నత్తఱిన్.

మ. అహహా! సృష్టి సమస్తజీవములలో । వ్యాపించి శ్రీవిష్ణువై,
మహిజన్మించిన రామచంద్రుఁ డొకఁడా । మర్త్యుండె? యజ్ఞుండె? త
న్మహిమంబున్ బరికింప దేవతలకున్ । శక్యంబె? సర్వజ్ఞుఁ డ
క్కుహనాసీతను జూచి డీల్పడు నె? సం । కోచంబునన్ దుర్భ్రమున్.

ఉ. మోసమెఱింగి రాఘవుఁడు । మోమున లేనగ వంకురింపఁగా
నాసతిఁ జూచి "యొంటిమెయి । నక్కట వచ్చితివో వృషధ్వజుం
బాసి? రఘూద్వహుండ నిదె । వందనముంగొను" మన్న దీర్ఘ ని
శ్వాసముఁ బుచ్చి యాతని ప్ర । భావము మెచ్చుచు లోన నొచ్చుచున్.

ఉ. కోమలి యా రఘూద్వహుని । కోమలవాక్కుల నాలకించి నె
మ్మోము నటింపవాంచి దైన్యమునఁ । బొక్కి వివేకము దక్కి, భీతిచే

స్థేమము లేక సంకుచిత । చిత్తమునం గడు సుక్కి వెక్కి, యె
ట్లేమనుదాన; శంకరున । కేమని చెప్పెడిదాన నింతకున్".

మ. అని చింతించుచు శంకరుం దెగడి మా । యాతీతు శ్రీరామునిన్
గని వంచింపఁ దలంచి బేల నయితిన్ । జ్ఞానంబు న్యూనంబుగా;
ననపాయంబుగనుండ కిట్లయితినా । హా" యంచు దుఃఖించుచున్
జనుచుండెన్ గలహంసయానమునఁ బ । శ్చాత్తాప సంతప్తయై.

గీ. సతిమతి గ్రహించి రామ భూ । పతియు నంతఁ
దన ప్రతాపంబు దీపింపఁ । దరుణితోడ
సోదరునితోడఁ గనుపట్టెఁ । జోద్యముగను;
దృష్టినిగిడించి యాసతి । తెలివిఁ దప్పి;

గీ. అంతకంతకు మునులతో । హరునితోడ
వనజభవుతోడ దిక్పాల । వరులతోడఁ
బృథ్వితోడఁ జరాచర । వితతితోడ
నలరు శ్రీరాము నీక్షించె । నఘవిరాము.

క. గడగడ వడఁకుచు నడుఁగులు
దడఁబడఁ బుడమిం బడంతి । దబ్బునఁ బడియెన్
వడినడిఁ గనుఁగవ మోడ్చెన్
బుడబుడ నుప్పొంగు వనటఁ । బొక్కుచు నేడ్చెన్.

గీ. కడకు లజ్జించి మది వివే । కంబుఁ గాంచి,
ఆత్మదుఃఖించి మఱియు స్థై । ర్యము వహించి,
మగని ధ్యానించి యెలమి న । మస్కరించి,
రాఘవుని దివ్య మహిమంబుఁ । బ్రస్తుతించి.

శా. రామా! కీర్త్యభిరామ! యర్కకుల పా । రావారసోమా! బలో
ద్దామా! సంగరభీమ! భూధవసుధా! । ధామా! నవాంభోధర

శ్యామా! నిర్జితరామ! దివ్యగుణపు । ష్పారామ! దైత్యాద్రి సు
త్రామా! దుఃఖవిరామ! భక్తినత భ । క్తస్తోమ! రక్షింపుమా !

గీ. అనుచు దాక్షాయణీదేవి । కనుల విచ్చి
దిక్కులం జూచినంతనె । యక్కజముగఁ
గాంచినది కానరాకుండెఁ । గానలోన
మ్రానుపడి డీలుపడి యేగె । మగని కడకు.

మ. తరుణిన్ రాజమరాళ మందగమనన్ । దాక్షాయణిం జూచి యా
హరుఁ డజ్ఞానతమోహరుండు "వనితా । యారాము విజ్ఞానమున్
బరికింపం జని యేమి చూచితి"వనన్ । "స్వామీ పరీక్షింపఁగాఁ
దరమా" యంచు వచించి యిట్లనియె ను । ద్యద్ధైర్యగాంభీర్యయై.

గీ. "చెప్పుటకు నేమియున్నది । చిత్తగింపు
మనఘ! నినునమ్మి రాముచం । ద్రునకు మ్రొక్కి,
సన్నుతించితి" ననవుడు । జ్ఞానదృష్టి
జరిగిన యుదంతమంతయు । సంగ్రహించి.

గీ. వనిత యొనరించి నట్టివం । చన నెఱింగి,
హరుఁడు పరితాపముం బొంది! । యాగ్రహించి,
"మోహవశమున నూఁకొన్న । మోస" మనుచు
వెలఁది నీక్షింప నోపక । విముఖుఁ డగుచు.

ఉ. "ప్రేమకు మేరయున్నదె? వ । రించినయట్టి లతాంగిఁ బాసినన్
క్షేమమె" యంచుఁ గ్రేళ్ళుఱుకు । కింకకు నుల్లము తల్లడిల్ల శ్రీ
రాముని సంస్మరించి "యప । రాధ మొనర్చిన కాంత నక్కటా
కాముకుఁ డేలుగాక" యని । గాసిలి కన్నులు జేవుఱింపగన్.

గీ. "ఈ శరీరంబుతో నింక । నీలతాంగి
నెనయ నిది నిశ్చయంబు"చు । సేవగించి

శంకరుఁ డేగుచుండఁగ । "జయము జయము
భక్తవర" యంచు నాకాశ । వాణి పలికె.

గీ. చదలుపలుకుల నాలించి । సంభ్రమించి,
ఉన్మీలించుచు నించుక । సొమ్మసిల్లి
పొక్కి, తాలిమిఁదక్కి, యు । ప్పొంగి పొరలు
దుఃఖమును మ్రింగి, క్రుంగి య । త్తోయజాక్షి.

ఉ. "హా" యని "నన్నుఁ బాయఁదగు । నా" యని "నిన్నెడనాడఁ జాల నా
థా" యని "భక్తలోకవర । దా" యని "తప్పిదమున్ క్షమింపరా
దా" యని "శాంతమ్ముండవు । దా" యని "మోహమొకించుకంత లే
దా" యని "యింతవింతగల । దా" యని వెక్కుచు సొక్కి సోలుచున్

ఉ. "సార విచార ధీర గుణ । శాలి, ప్రసిద్ధ విశుద్ధ భావ గం
భీరుఁ డెఱింగె నాదు నవి । వేకము సర్వము; ఘోర దుష్కృతం
బేరికినైన నోర్వఁదగు । నే? విభుఁ డక్కట నన్నుఁ బాయునే?
నాతులు మోసమున్ గపట । నైజముఁ బాయని వార లక్కటా!

గీ. చెలిమి దీపించు దుగ్ధాంబు । వులను బోలి
కపట తక్ర సంపర్కంబు । గలిగెనేని
భిన్నమగుఁగాదె? యక్కటా । వెరవు గలదె
మఱుఁడఁ జెలికారముం గూర్ప । మానసముల?"

మ. అని చింతించుచు వెక్కిళ్లేఁటుకొనుచున్ । "హా యంచు రక్షింపుమా
అనఘా" యంచుఁ దపించు నాత్మసతి దీ । నాలాపమాలించియున్
గనఁ డొక్కించుక తాల్మిఁ బూనఁడకటా । కైలాసనామాద్రికిన్
జని శంభుం డనుయాయులం గని మతిన్ । స్థైర్యంబు దీపింపఁగన్.

గీ. మగిడి మౌనియై తొలుతటి । మఱ్ఱి నీడ
సుస్థిరుండయి పద్మాస । నస్థుఁ డగుచు

నెలమిఁ బవనంబు బంధించి । చలనముడిగి
ధీరుఁడై యోగ పద్ధతిఁ । గూరుచుండె.

చ. హరుఁడు దొసంగు సైపఁడిసు । మంతయు నింతకు వాని నెమ్మనం
బెఱియగ నేవగింపు జని । యీ పగఁ జేసితి నన్నుఁ గాంచి యి
గ్గిఁ విడనాడెఁగా; యతని । కేవకు నేగిన లాభముండునే?
విరహిణిఁబోలి నే ననుభ । వించెదఁగాక కృతాపరాధమున్.

మ. అవమానించితి నిన్నుఁ గల్మషవిరా । మా! రామ! నిష్కామ! ఘో
ర వియోగంబు సహింపనోపుదునె భ । ర్తం బాసి? సీతా వియో
గ విచారంబున నున్న నిన్ను వికలుం । గావింప భావింప, న
య్యవివేకంబున కక్కటా ఫలము ప్రా । ప్యంబయ్యె సాదృశ్యమై.

మ. వనజాక్షా! రఘురామ! యీశ్వరమనో । వాక్కాయకర్మంబులన్
గని సేవించెడుదాననేని విను మీ । కాయంబు హేయంబు, నా
శనముం బొందునుగాక యశ్రమముగన్; । సైరింపగా నేనె? యి
వ్వనటం దూలితి బైసిమాలితిని దే । వా! దేవచూడామణీ!

ఉ. కాయము పాయముం బొరయుఁ । గాక; యనాథయనంగ నాథు నిం
దాయఁగ నేనె? యీతనువు । భారము నాకు భరింపశక్యమే?
హేయముగాదె! మత్కపట । వృత్తికి శిక్ష ఘటించితీవు; నీ
మాయ లహా! యెఱుంగఁ దర । మా సుర మానవ దానవాళికిన్.

చ. ఇటులు వియోగసాగరము । నీఁదుచు రాముని సంస్మరించుచున్
"గటకట జాలి దూలి నిజ । కాంతుని కింకరుఁ జిక్కి కంటిఁ బో
అటమటకున్ ఫలంబ"నుచు । నాత్మఁ గడుంగడు నుమ్మలించుచున్
కుటిల శిరోజ యవ్వనిత । కొండనయుండె ననేక వర్షముల్.

గీ. ఓర్మిఁ బెక్కేండ్లు వెచ్చించి । యోపలేక
ఒక్క నాఁడు మగఁడుండు । చక్కికేగి

మేలుకొనుదాకఁ దటి వేచి । మెలఁత నిలువ
నాసన మొసంగి కూర్చుండ । నానతిచ్చి.

గీ. హరుఁడు శ్రీరాము గుణ ధాము । సభి నుతించి
మగువ నీక్షించి, "రాముని । మాయ లెఱుఁగ
నగునె? నీబోటి కాలింపు" । మనుచుఁ జెప్పెఁ
బెక్కు కతలను భక్తిపెం । పెక్కునట్లు.

గీ. ఆగ్రహముఁ బాసి యెంతయు । నాదరించి,
అలికనేత్రుండు సర్వజ్ఞుఁ । డా హరుండు
శ్రీరఘూద్వహు మహిమంబుఁ । జెప్పుచుండ
నువిద వినుచుండె; నంతట । నొక్కనాఁడు.

ఉ. సారససంభవుండు ముని । సంఘముతో సభదీర్చి సార వి
స్తార తపోధనాఢ్యులఁ బ్ర । జాపతులన్ గుణరత్నసంచయుం
బేరిచి యాధిపత్యము వ । హింపఁగ దక్షుఁడు దక్షుఁడంచు లో
నారసి పెద్దఁజేసె సుర । లందఱు నౌనని సమ్మతింపఁగన్.

గీ. దక్షుఁడాలించె నెంతయు । ధన్యతముఁడ
నంచుఁ జింతించె గర్వించె । నతిశయించెఁ
అఖిల సృష్టికి నేఁ గర్త । నని తలంచె
నౌర! యధికారమొక రోగ । మనినఁ దగదె?

గీ. కల ప్రజాపతి సమితికి । ఘనుఁడననుచుఁ
జెలఁగి దక్షప్రజాపతి । సిద్ధ సాధ్య
గరుడ గంధర్వ యక్ష రా । క్షసుల నసుర
కిన్నరులఁ బిల్చి గావించె । జన్నమొకటి.

గీ. అతిశయించిన దక్షుని । యజ్ఞమునకు
విష్ణువు హసించె, శంభుండు । వెడలకుండె;

నఖిల జనకోటి యచ్చోటి । కరిగి రమరు
తెలమి యజ్ఞ హవిర్భాగ । ములను గొనిరి.

చ. జనకుని యాగవార్త విని, । సన్మునిసంఘము వోవుచుండఁగన్
మనమునఁ బొంగి, సుందర వి । మాన వితానము నంబరంబునన్
గని సురకామినీ మధుర । గానములన్ విని సంతసించి ద
క్షునిసుతయమ్మహోత్సవము । సొంపుఁగమంగొననిచ్ఛగించుచున్.

గీ. "దక్ష కల్పిత యజ్ఞ సం । దర్శనార్థ
మాత్మ కోర్కి దాటుచు నున్న । దతిశయించి,
అలిక నేత్రుని విడనాడి । యరుగరాదు
మనము నరికట్టి యిచ్చోట । మసలరాదు."

గీ. అనుచుఁ జింతించి జనకుని । గనఁ దలంచి,
నిలుకడం దక్కి పతిక్రేన । నిలచి మ్రొక్కి
"ఓ కృపానిధి! దక్షాధ్వ । రోత్సవమున
కేగి వచ్చెద నీవాన । తిచ్చెదేని.

గీ. తల్లి దండ్రుల నఖిల బాం । ధవుల సఖులఁ
దోఁడఁబుట్టుల నెల్లఱఁ । జూడవలదె?
సన్మునీంద్రుల దర్శింప । సమయ మిదియ
ఆనతిమ్ము కృపానిధి" । యనిన హరుఁడు.

శా. ఆ నారీమణి సంభ్రమంబును బ్రియా । ణాపేక్ష వీక్షించి, త
ద్దీనాలాపము లాలకించి "హృదయా । క్షేపకంబు వారింపఁగా
నౌనే? యంచుఁ దలంచి రాఁగల దోసం । గాత్మన్ విచారించుచున్
లేనవ్వాననసీమఁదోప ననియెన్ । గ్నపార్థ వాగ్ధోరణిన్.

ఉ. "ఓలలనామతల్లి! విన । వో యొకనాడు విరించనుండు పే
రోలగముండెఁ గిన్నరులు । యోగులు, సిద్ధులుసాధ్యులున్ మునుల్

వేలుపులున్ దనుంగొలువ; । విష్ణువు నేనును బోయియుంటి మ
వ్వేళఁ బొసంగెఁ జూవె యొక । వింత; భవజ్జనకుండు దక్షుఁడున్

గీ. ఇంచుక విలంబముగ వచ్చె । నెల్ల మునులు
వేలుపులు లేచి మ్రొక్కిరి; । విష్ణు వేను
మిన్నకుంటిమి నవ్వుచు; । నన్నుఁ జూచి
మొగముఁ జిట్లించుకొనెఁ జూవె । మ్రొక్కకునికి.

గీ. అంతతోఁ బోవునే వాని । యాగ్రహంబు ?
అల్లుఁడవె యంచు రోషించి । యౌడు కఱచి
పటపటధ్వనిఁ జేయుచుఁ । బ్రహ్మ కొఱకి
చిట్ట తుదిఁదాకె నసఁగఁగ । న్నొట్టుఁ జేసి.

గీ. యాగముల హవిర్భాగము । లనుభవింప
కుండ శపియించె నెల్లఱు । నుస్సురనఁగ;
నంతతోఁబోక తరుణ మి । య్యదియ యంచు
జన్నమొండు కల్పించె నేఁ । జిన్నఁ బోవ.

గీ. ఘనుల నెల్లఱ రావించి । గౌరవించి
మనల నొప్పరికించునే । మఱువ చెపుమ ?
నిన్ను నవమానితం జేయ । నిశ్చయించు
చెనఁటి పజ్జకు నేగుదే ? । సిగ్గులేక.

క. పిలువని పేరంట్రంబని
అలఁతిగ నినుఁగాంచి పేర । టాండ్రు హసింపన్
జెలులన్ జుట్టములం గన
వెలఁదీ మర్యాద యేద । వెసలం దగునే ?

ఉ. ఏ నెఱవాదియైనను, మృ । గేక్షణ! యుత్సవ దర్శనార్థ మా
హ్వానము లేక యేగిన ధ్రు । వంబుగఁ బొందు నగౌరవంబు; స్వ

స్థానముఁ బాసి పిల్వనిదె । తల్లినిఁ దండ్రినిఁ దోఁడబుట్టులన్
చానలు చూడఁబోఁడగదు; । చాన? యెఱుంగ వెయీరహస్యమున్.

గీ. ఇయ్యదిట్లుండె; నేచాయ । కేఁగినంతఁ
బోరు ప్రాప్తించు నను శంక । బుద్ధిఁ దోఁచు
నచటి కేఁగిన నెవ్వాని । కైనఁ గాని
హాని చేకూరునని యందు । రార్యవరులు.

ఉ. నాఁపుడు నిన్నుఁబోయి లల । నామణి కన్నుల నీరము రాలు, "నేఁ
బోవక నిల్వనోపుదునె? । పుట్టిన యిండ్లకుఁ గాంత లేగరో ?
ఏవిధి గౌరవంబు నశి । యించు? నశించిన హానియేమి? సం
భావన కేను లాఁతినె? స్వ । భావ విరుద్ధము లీ విచారముల్.

మ. అకటా, తండ్రికి బిడ్డ వేఁగగునె? నా । థా! ముద్దుఁ జెల్లింపుమీ
వికటాలాపము లేటికన్న విని ని । ర్వేదంబునన్ రోసి "మూ
ఢక వాక్కుల్ వికటంబులే" యనుచు సం । భావించి సర్వజ్ఞుఁ "డిం
తకు రానున్నది రాక మాన"దని కాం । తం బుచ్చెఁ బుట్టింటికిన్.

మ. చని వీక్షించె సతీమతల్లి జ్వలన । జ్వాలా వ్రజా వేగమున్,
జనకోత్పాదిత హోమధూమ లతికా । సంఛన్న భూభాగమున్
మనుజాశ్వాస్య సురాసుర ప్రముఖ నా । నా సేవకా భోగమున్
వనజాతోద్భవ మంత్రతంత్రహత స । ర్వచ్ఛాగమున్ యాగమున్.

మ. తనయన్, సద్గుణ రత్న భారవినయన్ । దక్షుండు లక్షింపఁ డా
వన మొక్కించుం యెత్తి "వచ్చితివె నీ । నాథుండు రాఁడా యెఁగా
అని మర్యాదకునైనఁ బల్కఁడకటా । యక్కాంత కన్నీరు తాఁ
గనులన్ గ్రుక్కుచుఁ జిన్నఁబోయి నిలిచెన్ । కంపించు మైదీవతోఁ.

క. గుస గుసలు వోవు వారిని
విస విసఁ దనుఁ జూచి నవ్వి । వెడలెడు వారిన్

విసువుచు మసలెదు వారిన్
"గసి దీజ నె తండ్రి" కంచుఁ । గామిని చూచెన్.

గీ. పలుకరింపని దక్షుని । వరుసఁ జూచి
ఈశ్వరుని యజ్ఞభాగ ము । దెందు లేమి
హృదయ మెరియఁగఁ గోపించి, । యినుమడించి
పొంగి పొరలెడు దుఃఖంబు । గ్రింగి మ్రింగి.

గీ. "వెఱ్ఱిబాగులదాన యా । వేమ రేటి"
కనుచుఁ దల్లి తోఁబుట్టువు । లనునయింప
నించుకయు బుద్ధిఁ జొరనీక । యేనగించి,
అరుణ దృక్కులు దిక్కుల । నావరింప.

ఉ. జ్ఞానముఁదక్కి యీశ్వరుఁడొ । నర్చిన బోధ నిరాకరించి యా
హ్వానము లేని స్థానమున । కక్కట వచ్చితి సిగ్గులేక స
న్మానము లేక, న్యూనతకు । మానస మోర్చునె" యంచు నేడ్చె న
మ్మానిని; హీనమైన యవ । మానము మించిన హానియున్నదే?

ఉ. హీనులు మానులంచు వచి । యించి నిరీశ్వరులంచుఁ దిట్టి యా
చానల నెల్లఱం గసరి, । సారస సంభవు నీరసించి, యి
గ్లానతి యిచ్చెదేవి, "త్రిపు । రారిని శౌరిని ధిక్కరించినన్
హాని ఘటిల్లకుండునె? య । హంకృతి చెల్లునె! యెట్టివానికిన్.

గీ. వినుఁడు మునులార ఘనులార । వేల్పులార
లోకవందితు విశ్వేశుఁ । గాకుసేసి
అక్కటక్కటా నాతండ్రి । యతిశయించె
నిస్పురాత్ముని కూతునై । యెట్లు మనెద.

మ. అనుచున్ క్రోధముఁరూపుఁదాల్చినటులా । యఖ్యాక్షి యత్యుగ్రమై
తన కందోయి యకాల సంజనిత సం । ధ్యాకాలనుఁంబోలు, నా

సనమాభీల లయార్క బింబ మనఁగన్ । రాజిల్ల, నొక్కుమ్మడిన్
దనువుం బాయఁదలంచె; నేరమును కాం।తల్ సైఁపరొక్కింతయున్.

గీ. "తండ్రి వెళ్లాడు వాకార । దక్ష" యనుచు
దశ దిశలఁగాంచి తనదు దు । ర్దశఁ దలంచి,
అవయవంబుల భేదించి । యాలతాంగి
యోగమార్గాను పద్ధతి । నుసుఱు విడిచె.

గీ. తనదు నిల్లాలు మరణించె । ననెడు వార్త
వినిన యంత నె రుద్రుండు । వీర భద్రుఁ
గాంచి దక్షాధ్వరధ్వంస । కార్యమునకు
నరుగుమని యానతిచ్చిన । యంత నతఁడు.

ఉ. దక్షుని, యాగకర్మచయ । దక్షుని, వందిత సర్వదేవతా
ధ్యక్షునిఁ, గల్పితోరుసవ । నాగ్ని సముద్గత ధూమ శోణితో
గ్రాక్షుని, యక్ష కిన్నర సు । రాసుర గర్హిత వాక్య దూషిత
త్ర్యక్షునిఁ ధిక్కృతాంబుజ ద । ళాక్షునిఁ బీన విశాల వక్షునిన్.

మ. కని కల్పాంతమహాగ్నిహోత్రుఁడన ను।గ్రజ్వాలలం గ్రక్కుచున్
గనులన్ నిప్పుక లుప్పతిల్ల బుధులం । గారించి యజ్ఞాధ్వరం
బును విధ్వంసముఁ జేయుచుండఁగని యం।భోజాసనుండున్ ఋషుల్
మునులున్ బాఱిరి దక్షుఁడున్ బసవిడెన్ । బుద్ధిన్ విచారించుచున్.

గీ. అధ్వరంబును సర్వ శూ । న్యముగఁ జేసి
వెడలి శూలికి నెఱిఁగించె । వీరభద్రుఁ
డతివ మరణించినంతఁ ద । దంతరాత్మ
అఖిల గిరికాంతు హిమవంతు । నాశ్రయించె.

మ. జనియించెన్ గిరిసార్వభౌమునకు యో।షారత్న మొక్కర్తు తూ
ర్పునఁ జంద్రోదయమైన చాడ్పున సుధాం । భోరాశికిన్ లక్ష్మిరీ

తిని సుకీర్తిన్ వరమౌక్తికంబు కరణిన్, । దేజంబు వ్యాపింప, శ్రీ
లను వర్ణింపఁగ సర్వలోకములకున్ । లావణ్యమే పారఁగన్.

మ. నగరాజున్ ఫణధార్యమాణ విలస । న్మాణిక్య దీపాగ్ర ప
న్నగరాజున్ మృగ శోణితారుణిత నా । నా కందరా సంచర
న్మృగరాజున్ గరుదాహతాఖిల కుజో । న్నిద్రాహిసం ఘోత్పతత్
ఖగరాజున్ వినుతింపరే సురలు లో । క ఖ్యాతి వర్ధిల్లఁగన్.

సీ. కుంభవృష్టిగ వాన । కురిసిన పిమ్మట
జల జలఁ బుష్ప వ । ర్షంబుఁ గురిసె
నజ్ఞాన మనునది । యణఁగినట్టుల నింగిఁ
బ్రబ్బిన మబ్బుల । యుబ్బణంగె
మునుల సుజ్ఞానాస్య । ములఁబోలి యఖిల ది
క్తటములు నిర్మల । కాంతిఁ గ్రాలెఁ
దమ్మి నెత్తమ్ముల । కమ్మతావిం బూని
కమ్మని తెమ్మెరల్ । కదల వీచె

గీ. నఖిల దివ్యాంగనామణు । లాడి పాడ
నంబరస్థలి దివ్య వా । ద్యములు మ్రోఁగె
మ్రోడులైయున్న మ్రాఁకులు । మొగ్గ తొడిగె
నా సతీదేవి పార్వతి । యై జనింప.

మ. సతి జన్మించినయంత నద్రిపతికై । శ్వర్యంబు లుప్పొంగ భా
రతి సంగీతము మేరమీఱె మునులున్ । రంజిల్లి దివ్యాశ్రమ
ప్రతతిన్ దద్గిరి సార్వభౌముని సమీ । పంబందు నిర్మించి రు
న్నతవృక్షంబుల రాజిలెన్ ఫలములున్ । నానాప్రసూనంబులున్.

గీ. పావనంబయ్యె నద నదీ । జీవనంబు
జంతు పక్షి నికాయంబు । సంతసించె

నాత్మ వైరంబులను బాసి । యఖిల జీవ
రాశి యలరె నన్యోన్యాను । రాగమునను.

గీ. మునుల తోడను నవరత్న । ఖనులతోడ
హరులతోడను గిరులఁబోల్ । కరుల తోడ
నముల తోడను సకల సం । పదల తోడఁ
బొదలె మలజేని వాడ పూఁ । బొదల తోడ.

ఉ. అప్పుడు మేనకాసహితుఁ । డప్పతి యప్పతి ధిక్కరించుచున్
గుప్పలుగా నొసంగె ముని । కోటికిఁ గోవుల నంబరంబులన్
దెప్పలుగా నొసంగె నవ । నీసురకోటికి రత్నసంచయం
బెప్పుడు నెవ్వరున్ జనుః । కివ్విధి నీయరనంగ దేవతల్.

ఉ. ఆ లలనామశిం గనిన । యంతనె యేమనవచ్చు నార! యా
శైల విభుం డొసంగె నని । శంబును మస్త్యఁడు రామభక్తిచేఁ
గాలినమాడ్కి; నాశ్రీమ ని । కాయము చూడఁగ సర్వమంగళా
వాలమనంగ నొప్పె ముని । వర్యులకుం బ్రమదంబు నిండగన్.

ఉ. భారమణంగ భూసతికిఁ । బార్వతిఁగాంచె గిరీంద్రుఁడన్ సమా
చారము నాలకించి మొద । సంతస మొందుచు సంభ్రమించి యా
నారదుఁ డేగుదెంచి గిరి । నాథు సపర్యలఁ గాంచి "నీదు సం
సారము పారవంతమని । సన్నుతులీయఁగ నాతఁడ త్తఱిన్.

ఉ. దారయుఁ దాను సంయమి ప । దంబులకున్ బ్రణమిల్లి పుత్త్రికన్
గూరిమిఁ దెచ్చి చూపి "కనుఁ । గొంటివె పుత్త్రిఁ ద్రికాలవేది వో
సారవిచార! యీ వెలఁగఁ । జాలని యంశము లెందు లేవు, నీ
యోరపుదృష్టి యెట్టిగుణ । దోషములన్ బరికింపఁ జాలుఁగా.

చ. అరసి మునీంద్ర నాదు తన । యన్గని దోషములన్ గుణంబులన్
గరుణ వచింపవే" యనిన । నవ్వుచు నారదుఁ డప్పుడిట్లనున్

"గిరివర! నీకుమారిఁ బరికింపఁగ శక్యమె? లోకమాత, భూ
భరము వహించు నంబికభవాని యుమాసతి, యింత యేటికిన్.

గీ. సర్వమంగళ, సర్వలక్షణగుణాఢ్య
పితృయశోదాయిని యనంగ వెలయు వనిత
ఈమె సేవించు సర్వమునీంద్ర తతికి
సర్వ కామసంధానయౌ హిమధరేంద్ర.

ఉ. మానము లేని భిక్షుకుఁడ మంగళుఁడైన దిగంబరుం డుదా
సీనుఁ డకామదేహి జటి చిన్మయుఁడైన విరాగి యోగి యీ
చానకు భర్తయౌ నిది నిజంబు ధరాధర సార్వభౌమ! యీ
వైనము జ్ఞానదృష్టిఁ గని పల్కితి దేవ రహస్య మారయన్.

చ. అన విని దెల్లఁబోయి హృదయంబున బెంగ జనింప నాతఁడో
"వనజభవాత్మ సంభవ! యపాయము లేని యుపాయమున్నదే"
అనవుడు "ఫాలభాగలిఖితాక్షరముల్ తొలఁగింపఁజాలునే
వనరుహనేత్రుఁడైన గిరివర్య వచించెద నీకుపాయమున్.

గీ. ఏను బలికిన వన్నియు నీశునందుఁ
దోచుచున్నవి చూవె నిర్దుష్టచరిత!
ఈ కుమారిక విశ్వేశు నెనయు నేని
దోషములు దివ్య గుణ రత్న భూషలగును.

గీ. రవికి నగ్నికి గంగకు శివున కహహ
దోషమనునది యున్నదే? తుహినధామ!
జీవమీశ్వరు నెనసినఁ బావనమగు
నేకముగనున్న దోష భూయిష్ఠమగును.

గీ. మలము విమలమౌ గంగతోఁ గలసె నేని
అగ్నిచే గంగ నిర్దుష్టమై రహించు

భాస్కరునిఁ గూడి యయ్యగ్ని । ప్రజ్వలించు
భర్గునకు జ్ఞాననేత్రంబు । భాస్కరుండు.

గీ. తనకు జ్ఞానంబు గలదని । తలఁచి యెవఁడు
దేవతల లోపముల నెంచి । ధిక్కరించు
వాఁడు నరక కూపంబునఁ । బడును బాపై
ఎన్నటికిఁ గాని మోక్షంబు । నెనయ లేఁడు.

గీ. క్లేశములకోర్చి జపతపో । లీలఁ జేర్చి
సతముఁ గొలిచినఁ గరుణించి । శంకరుండు
నీకుమారికఁ బెండ్లాడు; । లోకములకు
నీవివాహంబు నిత్యంబు । భావుకంబు.

మ. వరమండా ర్తి వినాశకుండురు కృపా । పాథోధి విశ్వేశ్వరుం
డరయన్ భక్తులకున్ బ్రసన్నుఁడయి యా । ప్తార్థంబులం గూర్చు శం
కరుఁ బూజింపక కోటియోగములచేఁ । గైవల్యముం బొందరే జా
లరు యోగీశ్వరులున్ మునీశ్వరులు శ్రీ । లంగ్రాలు కోటీశులున్.

గీ. వార్ధి వేష్టిత బ్రహ్మాండ । భాండమునను
వరులు లేరనఁ బోల దో । గిరికులేంద్ర
తలఁప నీమెకు నాతండ । తగిన వరుఁడు;
శంకరుఁడు శంకర్తుఁడు భక్త । కింకరుండు.

గీ. అనుచు వచియించి లేచి సం । యమి వరుండు
"తనయ శర్వాణి" [illegible] నిద్ది । తథ్యమనుచు
పార్వతిం జూచి మెరమి నా । శీర్వదించి
వీణ మ్రోఁగించి హరి నెంచి । వీడుకొనియె.

ఉ. మేనక యాలకించి కథ । మెల్లఁగ నాథునిఁ జేరి "నాథ యీ
మాని మహామహుం డితని । మాటల నాఁకొనవచ్చుఁ గాక యా

నా నసరాము కట్టుకొన । నక్కటట బట్టయు లేని వానికిన్
జ్ఞానికి మానికిన్ గుసుమ । సాయక వైరికిఁ బెండ్లియేటికిన్.

ఆ. వె. ఉండఁ గొంప లేక । పండ మంచము లేక
వండఁ గుండ లేక । వలువ లేక
ఎండ వాన యనక । మొండికెత్తి మెలంగు
బండవాని కెవఁడు । బాల నిచ్చు ?

గీ. తగిన వరుఁ జూచి ముద్దారఁ । దనయ నిమ్ము
వెడఁగు బైరాగి పలుకుల । విశ్వసించి
అకట బైరాగికీనానె ? । యంతకంటెఁ
గన్యకాత్వంబె యూహింప । ఘనతరంబు.

గీ. అనిన సతిఁ జూచి హిమవంతుఁ । డనియె నిట్టు
లతివ! రాకానిశాకరు । నందు వహ్ని
పుట్టినంబుట్టఁగాక యీ । పుణ్య తపసి
ఆనతిచ్చినయుపదేశ । మనృతమగునె ?

శా. కాంతా! యింతకు నింతవంత తగునే? । కానున్న కార్యంబు లే
పొంతన్ డాఁగినఁ గాకయున్నె?యకటా? । మోహాంధకారావృత
స్వాంతం బన్యముఁ జూడనిచ్చునె? మదిన్ । భావించి సేవింపు మ
శ్శాంతంబున్ బరమాత్ము; నాతనికృపన్ । సంకల్పమీడేఱెడున్.

గీ. నారమని పల్కఁ గల్లయ । నంగరాదు
ఎలమి దేవరహస్యంబుఁ । దెలియఁ జేసె
శంకరు నెఱుఁగఁ దరమె? క । శంక రహితుఁ
డింక శంక నీ కేటికిఁ । బంకజాక్షి !

గీ. జప తపో ధ్యాన నిరతిని । సంస్మరించు
ననఘులకు శంకరుండు ప్ర । త్యక్ష మగును;

తపముఁ గావించి నీకన్య । ధన్య యగును
ఇంక నీ కన్యసంతాప । మేల బేల ?

చ. పతియనురాగమేర్పడఁగఁ । బల్కిన పల్కుల నాలకించి యా
సతి తన ముద్దుపట్టిఁగని । సంతస మొందుచుఁ గౌఁగిలించి య
ప్రతిహత మంబుజాసనుఁడు । వ్రాసిన వ్రాలని ముద్దులాడఁ బా
ర్వతి జనయిత్రిఁ జూచి మృదు । భాషలఁ దేనియలూఱ నిట్లనున్.

మ. “కలఁగంటిన్ గలఁగంటి రేయి జననీ! । గౌరాంగుఁడొక్కండు భూ
తల దేవుండుపదేష్టయై యొనరిచెన్ । దత్త్వోపదేశంబు” స
త్ఫలమున్ గోరినదానవేన్ జపతపో । ధ్యానంబునన్ జేకురున్
నెలఁతా స్థైర్యమునన్ దపింపు మడవిన్ । నిష్ఠాగరిష్ఠాత్మవై.

చ. తపమున సృష్టికర్త యయి । ధాత సృజించె సమస్తలోకముల్
దపమున సర్వభూస్థితికిఁ । ద్రాత యనంగ రహించె శౌరియున్
దపమున శూలి సృష్టికినిఁ । దత్స్థితికిన్ విలయంబుఁ గూర్చె, స
త్తపమునఁగాని దొందు గల । దా? గిరిరాజతనూజ! చెప్పుమా.

గీ. తపమువకు సర్వసృష్టియుఁ । దల్లడిల్లుఁ;
దపముఁగావింపు మబల స । త్ఫలముఁ బడయు”
మనుచు నంతలో నవ్విప్రుఁ । డంతరించె;”
ననిన విని తల్లియుం దండ్రి । యలరి రపుడు.

గీ. తల్లిదండ్రులామోదించి । వల్లె యనఁగఁ
దపముఁ గావింపనెంచి కాం । తారమునకుఁ
జనియె నక్కాంత; తపియింపఁ । జాలునొక్కొ ?
మోదుగుం బూవుఁ బోలిన । ముగుద మేను.

చ. ఫలములఁ గందమూలములఁ । బల్లవసంతతిఁ బండుటాకులన్,
అలములఁ గమ్మతెమ్మెరల । నంబువులం గొని, యాతపంబునన్,

బలపల వేఁగి వేఁగి యుప । వాసములన్ గృశియించి, వానలన్
బొలుపఱ నాని నాని హిమ । భూధరపుత్త్రి తపించెఁ గానలన్.

గీ. పృథ్వీధర సార్వభౌము పు । త్త్రిక తపింప
ఘన తపోవహ్ని సకలలో । కములఁ బ్రాకె;
నుగ్రముల నగ్రికొను భీతిఁ । దల్లడిల్లి
రెల్లమునులును యోగులుఁ । బల్లటిల్లి.

ఉ. "పర్వతరాజపుత్త్రిక! భ । వత్తపము౦ గని సంతసించు నా
శర్వుఁ దనుగ్రహించి; ముని । చంద్రులు యోగులు నెల్లవేల్పులున్
బూర్వము చూచియుండని య । మోఘతపంబని మెచ్చిరమ్మ! దృ
క్పర్వముగా సుపర్వులు ని । వాహ మొనర్చెద రింత యేటికిన్.

గీ. అనుచుఁ జదలాడు పలుకుల । నాలకించి
పార్వతి రహించెఁ గనుల బా । ష్పములు జాఱ,
నంతకంతకు నుత్సాహ । మాక్రమించె
వదన ముత్ఫుల్లమయ్యె శ్రీ । సదన మనఁగ.

మ. తన యర్ధాంగి సతీమతల్లి యకటా । దాక్షాయణీదేవి జీ
వనము౦ బాసినయంత శూలి జటిలుండై । వైరాగ్యము౦బూని రా
ముని నామంబు జపించుచున్ మునులకున్ । బోధించుచున్ సత్తపో
ఖనియై చూడ దిగంబరుండయి మెలం । గంజొచ్చె ఘోరాటవిన్.

మ. అరిషడ్వర్గమహాగ్నికీలలను శాం । తాంభోధిఁ జల్లార్చి, దు
స్తర సంతాపముఁ బాసి సన్మునులకున్ । జ్ఞానప్రదుండై, రమే
శ్వరు రామున్ గుణధాములోఁ గొలుచుచున్ । జైతన్యరూపంబునన్
స్థిరచిత్తంబునఁ గానలన్ మెలఁగుచుం । డెన్ శూలి వైరాగియై.

గీ. దినము దినమును దనరామ । దివ్య మహిమ
నిస్తులంబుగ భర్గుండు । ప్రస్తుతింప

నతని భక్తికి మెచ్చి యే । కాంతముగను
ఆరఘూద్వహుఁడిట్లని । యానతిచ్చె.

చ. "సతి మరణించినన్ విరహ । సంకటమొందక యోగివైతివో
వ్రతనియమంబునందు ముని । వర్యులు నీసరిగారు; నాదు నా
సతి వినువాఁడవేని, గిరి । నాథునిపజ్జకు నిర్గమించి పా
ర్వతినిఁక పెండ్లియాడుము భ । వత్తపమంతయు సార్థకంబగున్."

చ. అన విని రాముఁజూచి యలి । కాక్షుఁడు చిర్నగవంకురింప నో
యనఘ! సునామ! రామ! భవ । దాజ్ఞకు బద్ధుఁడ, నీవు చెప్పిన
ట్లొనరుచువాఁడజూవె విను । మొజ్జయుఁదండ్రియుఁ దల్లియున్ వచిం
చిన విధి నెట్టివాఁ డయినఁ । జేయక మాననె మూఢచిత్తుఁడై.

గీ. విమల విజ్ఞాన భక్తిధ । ర్మములతోడ
నలరు నాతని వాక్కుల । నాలకించి
సంతసించుచు మిగులఁ బ్రి । సన్నుఁడగుచు
క్షేమ మగుఁగాక యని పల్కె । రాముఁ డరిఁగె.

చ. పిదప మహర్షులేడ్వురు వి । వేకనిధుల్ తనుఁ జూడరాగ స
మ్మదమునఁ బాద్యమిచ్చి వర । పూజల నెంతయు గౌరవించి యిం
పొదవగ శూలి యిట్లనియె; । "నో సురవందితులార! పార్వతీ
హృదిఁగలరాగ మెట్టిదో యె । ఱింగి గిరీంద్రునిఁజూడఁ బొం"డనన్.

చ. వడివడి నమ్మహర్షు లల । పార్వతి పజ్జకు నేగి "తల్లి! యి
వ్వడుపున నుగ్ర దుర్భర త । పంబొనరింపఁగ హేతువేమి? యి
య్యడవి మనోజ్ఞపుష్పవన । మంచుఁ దలంచితొ? చన్నబాలుఁ దా
వెదు పసికూన వోర్వఁగల । వే? తలిదండ్రులు సమ్మతించిరే?"

చ. అనవిని యాపె యిట్లనె; "మ । హాత్ములు మీర లెఱుంగరొక్కొ? యే
మని వచియించుదాన? నక । టా! వచియించిన నాదుమౌర్ఖ్యమున్.

విని హసియింతు రేమొ? యవి । వేకినియంచు; మదీయబుద్ధి యొ
య్యనఁ దపియింప నియ్యకొనె । నన్యుల బోధకు సమ్మతించునే?

గీ. బ్రహ్మమానసపుత్త్రుండు । పలికినట్టి
పలుకులను విశ్వసించి, త । పంబొనర్ప
నియ్యకొంటిని ముక్కంటి । నెయ్యమునకు
నాదు నజ్ఞానమునకీరు । నవ్వవచ్చు.

గీ. అనిన విని యమ్మహర్షు లా । వనితఁ గాంచి
మందహాసంబుఁ గావించి । "కుందరదన!
పర్వతోద్భూత నిజదేహ । వల్లి యిట్టి
ఉగ్రతపమున కోర్చిన । నోర్పుఁగాక !

గీ. బ్రహ్మమానస పుత్త్రుండు । పలికి నట్టి
వాక్యములకును బయలాడు । పలుకులకును
భేద మావంతయును లేదు । వెలఁది వినుము
వాని విశ్వసించినవారు । బాగుపడిరె ?

ఉ. మానవులైన వెండియు న । మర్త్యులునైన (దదీయదంభ వి
జ్ఞాన హితోపదేశము ని । జంబని నమ్మినఁ గీడుమూడు నో
మానిని! మున్ను వానివెడ । మాటలనూఁకొని యెంద రెందఱో
దానవులుక్కుఁదక్కి తుది । దాక నశించిరి చెప్పనేటికిన్.

క. జడదారి యాడు మాటకు
బెడదారిం బట్టితీవు । వెర వెఱుఁగక యో
పడఁతీ! కపటం బుడుగని
యెకఁదంగలవాని నమ్మి । యేటికిఁ జెడఁగన్.

క. తనవలె నెల్లఱ జోగులఁ
బొనరుప నూహించుఁ గపట । భూయిష్ఠుఁడహో

వనితా నీవాతని తి,
య్యని వాకున కియ్యకొంటి । వనివార్యముగాన్.

క. కులహీను, శ్రీవిహీనున్
స్థలహీనున్ వస్త్రహీను, । సద్గుణ హీనున్;
బలహీను, నుదాసీనున్
భళి భళి!! కాంక్షించితీవు । పశుపతిఁ బతిఁగా.

ఉ. పాడిఁదలంపఁజాలని క । పాలి దిగంబరు, బిచ్చగానిఁ బెం
డ్లాడి సుఖింపవచ్చునని । యాత్మఁదలంచితె? దక్షుపుత్రిఁ బెం
డ్లాడఁడొ? యాపెచావుఁ గను । లారగఁజూడఁడొ యట్టివాని నీ
వోడక యిచ్ఛగించితివ । యో భవసాగరమెట్లు లీఁదెదో ?

గీ. కట్టుకొన బట్టలేకుండు । టట్టులుండె;
నెలమి నాలింపఁదియ్యని । పలుకు లేదు,
చూచి మోదమొందఁజల్లని । చూపు లేదు
ఉల్లమొల్లదు; వానిల్లు । వల్లకాడు.

ఉ. శౌచములేనివాఁడు బుధ । సంఘవిగర్హిత వర్తనుండు, పై
శౌచ గుణానుభావుఁడు, శ్మ । శాన విహారరతుండు, సాత్త్వికా
లోచన లేనివాఁడలిక । లోచను నెవ్విధిఁ బెండ్లియాడ సం
కోచముఁదక్కి బేలవయి । ఘోరతపంబున కియ్యకొంటివో ?

ఉ. కోపముసంహరింపు; సుమ । కోమలివయ్యు మహాతపంబునం
దోపిక నీవొనర్చిన మ । హోగ్రతపంబాక బిచ్చగానితోఁ
గాపుర ముండఁగాదె? యల । కాపురనాథుని మిత్రుఁడంచు నే
లోపము నుండరాదనుచు । లోలవిలోచన లోఁదలంచితో ?

ఉ. చెప్పెద నొక్కమాట, సర । సీరుహపత్రి విశాలనేత్రి! నీ
విప్పుగిదిన్ దపింపఁదగు । నే వనిలో, నొక పాటివానికై;

ఒప్పరికింపవేని వరుఁ । డొక్కఁడు నీకనుకూలుఁడైన వాఁ
డప్పరమాత్ముఁడందమున । కందమొసంగెడువాఁడు లేఁడొకో ?

గీ. అఖిల సద్గుణ రత్న ర । త్నాకరుండు
దోషరహితుండు, కేయూర । భూషణుండు
శ్రీమనోహరుండు, వికుంఠ । ధాముఁడుండ
బోఁటి వలచుటె పాడి పూ । బోఁడి చెపుము.

చ. అన విని మందహాస కలి । తానన బింబము వంచి యాపసి యి
ట్లనియె "సహోమహార్షివరు । లానతి యిచ్చినరీతి నామనం
బనిశము మేలు కోర్పరయ । దక్కట యేమికతంబొ? చెప్పఁడా
కనకము నగ్నికుండమునఁ । గాల్చిన నైజగుణంబుఁ బాయునే ?.

ఉ. నారదుఁ డానతిచ్చినది । నచ్చిన దెంతయు నాకు, ఘోర కాం
తారములందుఁగాక, గగ । నంబునమూర్గ్యాను కొండలందుఁ గా
కీరములందుఁగాక, మఱి । యెందు మెలంగిన నెట్టి కీడు లే
దారసి యొజ్జ పల్కినది । యానని నమ్మిన వారి కెన్నఁడున్.

ఉ. సోముఁడుమూఁకతోఁ మెలఁగు । శూలధరుం డొకయూర జోగియౌఁ
గాక, వికుంఠధాముఁడల । కాపుర నాథుని ధిక్కరించుఁ గా
కేఁకటఁదూలియాహృదయ । మేహృదయంబున సంగమించి లో
కైకసుఖంబుఁగాంచు నది । యే పరమామృత మింత యేటికిన్.

చ. మునివరులార! నారదుని । మ్రోఁదలికన్ గొని విశ్వసించి యా
తని గురువర్యుఁగా దలఁచి । ధ్యానమొనర్చి తపించుచుంటి, నా
మనము రమించు శంకరుని । మానసమందెవ రెన్ని చెప్పినన్
దనియదు; నిక్కమింక గుణ । దోష వివాద వినోదమేటికిన్.

ఉ. మాటికి మాటి కొక్కఁడను । మాలినవాఁడని శూలిఁ దిట్టఁగా
నేటికి ? నెన్ని చెప్పిన ని । వేఁగద మాటలు మానులార! నేఁ

గోటిభవంబులెత్తి యిలఁ । గూలిన, నెన్నటికేని శూలి నా
మేటి మగండు; గానియెడ । మేలని కన్యకనై తపించెదన్.

చ. అలయక మీర లిందనుక । నానతియిచ్చినదెల్ల లెస్సగాఁ
దెలిసెను; చాలదవ్వరుగు । దెంచితిరక్కట చాలు మీగృహం
బుల కిఁకఁబొండు, లేఁడు శివ । పూజకుఁబోఁదటి తప్పనన్న వా
రలు విని పల్కిరిట్లు గిరి । రాజ తనూజక దృక్సరోజకున్.

గీ. సద్గుణ కదంబ జగదంబ! । జయము, జయము,
ఈవు మాయా స్వరూపిణి । వీశ్వరుండు
తలఁప భగవంతు డీరలు । తల్లి దండ్రు
లింటి కేగుము కోర్కె లీ । డేరునమ్మ.

చ. అని వినుతించి పిమ్మట మ । హర్షులు శంభుని పాలికేగి, య
వ్వనిత సతీమతల్లి యని । పల్కి తదీయ మనోనురాగమున్
ఘనముగఁ జెప్పినంత శితి । కంధరుఁ డెంతయు మెచ్చి వారలం
జనుఁడనిపల్కి రాఘవునిఁ । జాల నుతించుచునుండె నెమ్మదిన్.

## తారకాసుర వృత్తాంతము

ఉ. అత్తఱిఁ దారకాసురుఁ డ । హంకృతిఁ బేరిచి బాహు విక్రమో
ద్వృత్తి సురేంద్రునిం గెలిచి । వేల్పుల నెల్లఱఁ గాకుసేసి, త
న్మత్తగజేంద్రగాములను । మానధనంబులఁ గొల్లలాడి లో
కోత్తర వీరుఁడై వరబ । లోన్నతిఁ గైకొనె నాకలోకమున్.

గీ. దర్పితారాతి హృదయ వి । దారకుండు,
ఘోర దోర్బల భీత బృం । దారకుండు,
మారకుఁడు జగద్విప్లవ । కారకుండు,
తారకుఁడు సౌఖ్యవారాశి । తారకుండు.

గీ. జరయు మృతియును లేనట్టి । సత్వశాలిఁ
ధారకుని నెవ్వరుం ద్రుంపఁ । దలఁచి తలఁచి !
ఎల్లఱుంగూడి పోరాడి । పల్లటిల్లిరి
వేలుపులు జీవముల రోసి । పెంపు వాసి.

గీ. సారవంతంబులైన యౌ । షధము లెల్ల
సన్నిపాతంబుపైఁ బోలె । జంభవైరి
కెరలి యాక్రూరుపైఁ బ్రయో । గించినట్టి
సార శస్త్రాస్త్ర సమితి ని । స్సారమయ్యె.

గీ. పాశుపతమును మించిన । శ్రీశు చక్ర
ధారను సహించి చావని । వారు గలరె ?
అక్కటక్కట యట్టి చ । క్రాయుధంబు
వాని యురమున దీపించెఁ । బతక మనఁగ.

ఉ. అంతట నొక్కనాఁడు సుర । లందఱు నింద్రుఁ బురస్కరించి, దు
ర్దాంత వరప్రసాదమున । దైత్యులతోడఁ బరాక్రమించు దు
స్స్వాంతునిఁ దారకున్ దునుము । నట్టియుపాయమెఱుంగ భారతీ
కాంతుని కాళ్ళపైఁ బడిరి । కన్నుల నశ్రులు జాలువాఱఁగన్.

చ. వనజభవుండు వేల్పుల య । వస్థకు మిక్కిలి తల్లడిల్లి యి
ట్లనియెను:-"వేల్పులార సమ । యంబు లభించినయంతదాఁక నో
పిన శుభమౌ, మహేశ్వరుని । వీర్యమునన్ జనియించు వీరుఁడొ
క్కరుఁడ వలంతి యియ్యసుర । గర్వమణంపఁగ సంహరింపఁగన్.

చ. పలికెద నాలకింపుఁ డన । పాయముగాఁగ నుపాయమొండు, నా
డల సతి దక్షయాగ సమ । యంబున దేహముఁ బాసి, వెంటనే
చలిమలకున్ జనించెఁ గద । శంకరుఁ బెండిలియాడఁగోరి, య
వ్వెలఁది యొకర్తుకే శివుని । వీర్యభరంబు భరింప నోపెడున్.

ఉ. ఆలలనాశిరోమణి, య । హర్నిశమున్ దపమాచరించు నో
వేలుపులార! శంకరునిఁ । బెండిలియాడఁగ నిశ్చయించి; యా
శూలి విరాగియై జగముఁ । జూడఁగ లేక సమాధినుండె, నే
లీలల వానిచిత్తము చ । లించు,? స్మరున్ స్మరియింపుఁడెల్లరున్.

గీ. రుద్రుఁడీ నిద్రనుండి యు । న్నిద్రుఁడైన
క్షేమ మగు మీకు వెండియు । హైమవతికి;"
ననిన విని వేల్పు లెల్లఱు । నంగభవుని
నపుడు ధ్యానించి రతఁడు ప్ర । త్యక్ష మయ్యె.

గీ. అతఁడు ప్రత్యక్షమైనంత । నమరులెల్ల
జయము జయమంచుఁ బలికి రు । త్సాహమునను;
వేయికన్నులఁ గన్నీరు । వెడల నింద్రుఁ
డతని దరికేగి చేసాచి । యాదరించి.

ఉ. ఔర కుమార! నీవెఱుఁగ । వా? సురలోకము పెంపడంగె; నా
తారకు సంహరింపఁ గల । దక్షుఁడెవండొ యెఱుంగఁ జేసె నీ
సారస సంభవుండు; నిను । సాయముఁ జేయగఁ గోరువార మే
తీరున మమ్ముఁ బ్రోచెదవొ? । తియ్యని వింటను పోటుబంటవై.

గీ. అనిన విని పుష్పసాయకుఁ । డనియె నిట్టు
"లున్నది నశింపఁ జేయుట । కున్నవారు
వీరవరులెంద ఱేనియు, । వృద్ధికొఱకుఁ
బాటుపడు పోటు బంటు క । న్పట్టఁ డెందు.

ఉ, ఖండన కార్యపద్ధతి జ । గల్లయ హేతువు చెప్పకేమి? యా
ఖండల! యోగియైన శితి । కంధరునేని మదీయ పుష్పకో
దండ విముక్త పుష్పశర । తండమునన్ గరఁగింతునన్న న
న్యుండొకఁడెవ్వఁడేన్ నిలువ । నోపునె యెంతయు నిశ్చలాత్ముఁడై

గీ. ఇంత యేటికి దేవతా । హితము కొఱకు
దేహముఁ ద్యజించువాఁడ-సం । దేహ మేటి"
కనిన నౌఁగాక, యనుచు న- । య్యమర విభుఁడు
నలువ పలికిన పలుకులఁ । దెలియఁ జేసె.

శా. "ఏమేమీ శిశు నే జయింపవలెనో? । యేపాటి యీ మేటి ? ని
ష్కామిన్ భర్గుని గామినీ సహచరుం । గావించెదం గాక; యో
స్వామీ! యన్యహితార్థమే ఘనుఁడు స్వ । ప్రాణంబు లర్పించు న
ద్ధీమంతుండు యశశ్శరీరియయి ధా । త్రిం గ్రాలు నెక్కాలమున్.

చ. "మునివరు లాశ్రితావన స । మానమహాధర్మ" యనంగ వింటినో
అనఘ! పరోపకారమున । కై తనకాయముఁ బాయుటొప్పదే ?
తన ప్రజ సౌఖ్యమొందఁ బర । దాస్యమునుండి విముక్తిఁ జెందఁగాఁ
దనువుఁ ద్యజించు సజ్జనుఁడు । ధన్యుఁడు మాన్యుఁడ గణ్యపుణ్యుఁడున్.

ఉ. వేఁడినవార లల్పులొకొ ? । వేల్పులు; వేడిన కార్యమల్పమే ?
మూఁడు జగంబులన్ మెలఁగు । ప్రోడలఁ బ్రోచెదునట్టి దింతకుం
బాడిదలంప నెంతయు శు । భప్రద; మియ్యది సాధ్యమా నె; నా
వాఁడికిఁ బూవుఁదూపులకుఁ । బచ్చనివింటి కసాధ్యమున్నదే?

చ. తెలియక యుండునే". యని య । ధిజ్య శరాసనుఁడై మరుండు నె
చ్చెలియగు మాధవుండు తన । చెంగటనుండఁగఁ జూచి లేచి తా
"సెలవని" యింద్రుతోఁ బలికి । చిల్కలు నంచలు గోరువంకలున్
గలకలరావముల్ సలుపఁ । గాఁ జనెఁ గమ్మని తావి గ్రమ్మఁగన్.

చ. ఎఱుఁగఁడె మారుఁడా హరుని । యెఱ్ఱని చూడ్కికి నగ్గమైన బెం
పఱ మరణంబు వచ్చునని । యక్కట! యయ్యమరావనార్థమై
అఱిముఱిఁ బచ్చవిల్తుఁడయి । యచ్చటికిం జనెఁ; నాగ్రహించి తా
నఱవఱ సేయునేని జగ । మంతయు నెంతయుఁ దల్లడిల్లదే.

గీ. ఆర్య సన్నుత బ్రహ్మచ । ర్య వ్రతంబు
నిష్ఠ నిరతియు నింద్రియ । నిగ్రహంబు
వైదికంబు సదాచార । వర్తనంబు
స్మరుని నిరసించి యెదిరింపఁ । జాలు నొక్కొ ?

శా. కుంభీభూత మనస్కులై మునులు యో । గుల్ రాగులై వేఁగ, వై
కుంఠుండిందిరఁ గౌఁగిలింప జలధుల్ । ఘోషించి యుప్పొంగగా
ఠంఠంనాదము మారు మ్రోఁగగ ధను । ష్టంకారమున్ మారుఁడు
త్కంఠం జేసె నకుంఠితాత్ముఁడగు శ్రీ । కంఠుండు శుంఠుండుగాన్.

వసంతఋతు వర్ణనము

గీ. ఉత్తరాయణ మేతెంచె । నో యనంగ
సకల వల్లీమతల్లులు । భూమిరుహంబు
లలరి యలరుల నఱపులఁ । బొలుపుఁ గాంచె
గంధములఁ దెచ్చి వెదఁజల్లె । గంధవహుఁడు.

గీ. సుందరీ పాదతాడన । మొందకుండ
భువి నశోకంబు రాజిల్లెఁ । బుష్పములను
ఉవిద తన్నవలోకింప । కున్న నేమి ?
వకుళము రహించె నత్యంత । వైభవమున.

గీ. సరస సంపదలంబొంది । జడ పదార్థ
సంచయంబెంతయుఁ జలించె । జగతియందు;
గామవాంఛకులోఁగి వి । కారమొందు
చేతనంబుల చొప్పు నేఁ । జెప్పవలెనె ?

చ. సమయముఁజూడకుండ సర । సంబు లభించినఁ జాలునంచు సం
యమియు లతాంగికైతహత । హన్ దిరుగాడుచు వేఁగుచుండె నే

కమలముఖిం గనుంగొనినఁ । గాంతునిఁ బాయని ఛాయఁబోలె లో
కము విచలించె; నమ్మృగ ఖ । గంబుల చందముఁ జెప్ప నేటికిన్.

గీ. సిద్ధులెల్లలు సురత ప్ర । సిద్ధులైరి
సాధ్యులెల్లలు స్త్రీలకా । రాధ్యులైరి
భక్తులెల్లలుఁ గాంతాను । రక్తులైరి
యోగులనురాగులై విప్ర । యోగులైరి.

గీ. బ్రహ్మమయమైన సకల ప్ర । పంచ సృష్టి
స్త్రీ మయంబని పురుషులు । కాములైరి;
సతులు పురుష మయంబని । జారలైరి;
మీనకేతుని మహిమంబు । మేర మీఱె.

గీ. ప్రమదవనములు వనములుఁ । బర్వతములుఁ
బల్వలంబులు సరసులు । వాపికలును
ఎట్టులుండునో? యూహింపు । మింత యేటి
కధమ మరుభూమి యలరె రా । గాంకురమున.

గీ. చెలువలు నుతించి రెలమిఁ జెం । గలువ చెలువుఁ
బొదల నలరించెఁ బొదలు తు । మ్మెదలు పొదల
మారుతమ్ములు తమ్ముల । మహిమఁ జొగడె
స్థాణువు చలించె నింక నా । శ్చర్యమేల ?

గీ. పద్మినీ సక్త సరసుల । వైభవమును
మధుప సంతతి కొనియాడె । మగువ లలర;
మలయమారుత సందీప్త । మన్మథాగ్ని
భాతి రాజిల్లెఁ గింశుక । ప్రసవ చయము ?

గీ. కీర శారికా హంస కో । కిల రవంబు
దేవ గానంబు దిక్కుల । నావరించె;

నంబరంబున దివ్య వా । ద్యములు మ్రోఁగఁ
బంచబాణుండు చెలరేఁగె । భర్గుఁ జూచి.

ఉ. చచ్చిననేమి? యీతను వ । శాశ్వతమంచుఁ దెగించి యేపునై
వచ్చినవాఁడు మన్మథుఁడు । పచ్చని విల్తుఁడు; పూవుటమ్ములం
దిచ్చినవాఁడు మాధవుఁడ । హీన బలుండగు నింద్రుఁడెంతయున్
మెచ్చినవాఁడు; భర్గుఁడిఁక । మేల్గొని యేల్గొనకున్న పార్వతిన్.

మన్మథదహనము

మ. అలికాక్షున్ వరసంయమీంద్రుఁగని యా । ర్ద్యాపీడితుండై మరుం
డలవేసారఁగఁ జూతశాఖపయిఁ బ్ర । త్యాలీఢుఁడై నిల్చి, చేఁ
గలవిల్లెక్కిడి ముల్కిఁగూర్చి గుణమా । కర్ణాంతమున్ లాఁగి దృ
క్కుల లక్ష్యంబున మేళవించి విడిచెన్ । గొండాడఁగన్ వేలుపుల్.

గీ. చాప నిర్ముక్త బాణ సం । జాత వాత
నిహత వృషరాజ మప్పుడ । నిర్గమించి
స్వర్గనిం గూడఁ బరువిడె । స్వర్గమునకు;
నచ్చెరలఁ జూచి ప్రమథులు । ఱిచ్చవడిరి.

గీ. కమ్మ తావుల దిక్కులఁ । గుమ్మరించి,
రివ్వుమని కాముబాణంబు । హృదయ వీథిఁ
జొచ్చినంతనె కలఁగి సం । క్షోభమొంది
కడలఁ బరికించి ముక్కంటి । కనులఁ దెఱచి;

గీ. పాదపమునఁ బ్రత్యాలీఢ । పాదుఁడైన
యోధవరుఁజూచి హుమ్మని । హుంకరించి
ధిక్కరించి ఫాలాక్షంబుఁ । దెఱచినంత
మరుఁడు మసియయ్యె మాడెన । మ్మాధవుండు.

ఉ. అత్తఱి నాగ్రహాగ్ని నిట । లాక్ష సముద్గత ధూమవల్లి ది
గ్భిత్తుల నాక్రమించెఁ బృథి । వింగల శోభయు నస్తమించె వి
ద్యుత్తతిఁబోలి దీపము మ । హోజ్జ్వల కాంతులఁ బ్రజ్వలించియు
న్వ్యేత్తుగ నంతరించుగతి । వృత్రహుఁడెంతయుఁ దల్లడిల్లఁగన్.

ఉ. చిచ్చఱకంటి మంటలకుఁ । జేడ్పడి కీడ్పడి రూపుఁదక్కి మా
నచ్చినవాఁడు చచ్చెనని । నచ్చుకడుంగడు హెచ్చనంచు న
య్యచ్చరలెల్ల ఱిచ్చవడి । యచ్చోటువాసిరి వెచ్చనూర్చి; 'మా
యిచ్చకువచ్చె' నంచు మది । నెంతయు మెచ్చిరి దైత్యులెల్లరున్.

ఉ. అంగజు భస్మమ్ముంగని య । నంగుని యంగన శోకమిట్టి రూ
పుంగొనెనో యనంగ నెదఁ । బొంగిన యంగద మ్రింగ లేక చ
న్నుంగవ ఘూళిఁ బ్రుంగఁగఁ, గ । న్నుంగవ నశ్రులుజాలువార వ్రా
లింగవమాచరించె నను । లీల భువిం బొరలాడె నేడ్చుచున్.

ఆ. ఏడ్చి, యేడ్చి, యేడ్చి, । యెల్లదిక్కులఁ జూచి,
దిక్కులేద యనుచు । వెక్కి, వెక్కి,
శివుని మ్రోల నిల్చి । చేతుల జోడించి,
వెన్నువంచి, యబల । సన్నుతించె.

ఉ. ఆ కరుణామయుండు శివుఁ । డత్తఱి నత్తరలాయతాక్షితో
"శోకముఁబాయు మీవ విభు । జూచెదనంగుఁడనంగవాఁడు ము
ల్లోకములన్ మెలంగు; భువి । లోన నతండు జనించునప్పుడీ
వేకట వానిఁగూడఁగల । వింతకు నింతటి వంత యేటికిన్.

మ. యదువంశంబునఁ గృష్ణనామమున దై । త్య ధ్వంసి యమ్మాధవుం
డుదయించుంగద, వానియాత్మజుఁడు ప్ర । ద్యుమ్నుండు నీభర్తయై
ముదమేపార సుఖింపఁజేయు నబలా! । పొమ్మన్న" న క్కాంత నె
మ్మదినామోదముఁబొందుచున్ వెసఁ బెస । న్మానింపనాకౌకసుల్.

ఉ. అంతటసంతసించి, వన । జాతునిఁ గాంచి పురస్కరించి, వా
క్కాంతుఁడు నింద్రుఁడున్ సురలుఁ । గాలగళున్ దిలకించి, పార్వతీ
కాంతుఁడవై సుఖంపుము జ । గత్త్రియ మెంతయుసన్నుతింపుచు లో
కాంతక మన్మథాంతక మ । ఖాంతక యోత్రిపురాసురాంతకా

గీ. పుష్పశరుఁ జంపి వెండియుఁ । బ్రోచి తీవు
హరహరా! నీక తగుఁగాక । యాగ్రహించి
నిగ్రహింపఁగ మఱియు న । నుగ్రహింప;
బాసఁ దలపెట్టి మమ్ముఁగా । పాడు మింక.

గీ. అనిన నౌఁగాక యని వారి । నాదరించి
లోకనాథుండు పెండ్లికం । గీకరించె
నెల్లరును సంతసించిరి; । ఋషులు మునులు
నేగి పార్వతిఁ దిలకించి । యిట్టులనిరి.

గీ. "నారదుని విశ్వసించి యీ । ఘోరతపముఁ
జేసి మన్మథుని దహింపఁ । జేసి తీవు,
అతివ! నీదు నుద్దేశంబు । వ్యర్థ మయ్యె
బూడిదం బోయు పన్నీరు । పోల్కి నకట."

ఉ. నావుడు వారిఁజూచి నగ । నాథకుమారిక యిట్లనున్ "మహా
దేవునిఁ దక్క నన్యుల మ । దిందలపెట్టను, కంట జూడ; నా
భావమొసంగితిన్ త్రిపుర । వైరికి సన్నుత చక్రధారికిన్
దేవమునీంద్రులార! గురు । దేవుని నారదు విశ్వసించితిన్.

ఉ. శైత్యము వహ్నికీలలకుఁ । జాలునె, యావిరియై నశించు, నా
దిత్యుని నేవునై ఖగమె । దిర్చిన భస్మము గాకయున్నె? యా
నిత్యుని వేదవేద్యునిఁ గ । నిష్ఠునిగాఁ దలపెట్టి మారుఁడా
న్నత్యముఁ జూపఁబోయె మర । ణంబును బొందిన వింతయున్న దే.

గీ. సప్త ఋషులామె బుద్ధికి । సంతసించి,
ప్రీతి విశ్వాసములఁ గాంచి, । వినుతులిచ్చి
సత్వరంబుగ మలఱేని । సరస కేగి
తెలియఁజేసి రుదంతంబుఁ । వెల్లముగను.

సీ. దేవ కార్యార్థము । ధృతిఁ బూని మన్మథుం
డరిగెనం చాలించి । యభినుతించి,
వహ్నిలో శలభంబు । వలె మారుఁ డభవుచే
భస్మమయ్యె ననంగఁ । బరితపించి,
భర్గుండు కరుణించి । వరమిచ్చెఁ గంతుని
కాంతకన్నంతనే । సంతసించి,
తనసూతు రొనరించు । తపమున కీశ్వరుం
డల్లుఁడౌనని పల్కె । నతిశయించి,

గీ. ఘనుల సప్త మహర్షుల । గౌరవించి,
దివ్య నక్షత్ర భూషిత । దినము నందు
నెలఁత పెండ్లికి లగ్నంబు । నిశ్చయించి
నలువ మొదలగు నెల్లఱఁ । బిలువఁ బంచె.

శివోద్వాహ మహోత్సవము

గీ. పులక లంగంబునఁ జెలంగి । పొంగలింప
క్ష్మాధరేంద్రుండు పార్వతిం । గౌఁగిలించి,
ప్రోత్సహించె నుద్వాహ మ । హోత్సవమున
కోషధిప్రస్థ మెంతయు । నొప్పు మీఱె.

ఉ. మోహము మేరమీఱె హిమ । భూధరపుత్రిక, కాత్మయందు సం
దేహము దోఁప దానవులు । దిక్కులు నక్కిరి, చూచినంతనే

దేహము పుల్కరింప గడి । దేఱిన యచ్చర లాడి. పాడి రు
త్సాహముహాపుఁదాల్చెనను । చందమెసంగె వివాహ మెంతయున్

ఉ. ధీజను లెంతయుంబొగడఁ । దేజమెసంగ మనోహరాననాం
భోజకు, భక్తలోక సుర । భూజకుఁ, బాద నమద్విడౌజకున్,
రాజిత రత్నయుక్త ధర । రాజ తనూజకుఁ, బర్వతోన్నతో
రోజకు, నీలనీరద శి । రోజకు వాయత దృక్సరోజకున్.

సీ. వర జటాజూటస్థ । సురవాహినీ జల
క్షాళిత శశికళా । మౌళితోడ,
ఫణిఫణా మణి గణో । ద్భాసిత రుద్రాక్ష
కుండలభార శ । ష్కులుల తోడ
నురగ యజ్ఞోపవీ । తోపేత గరళ కం
ఠాలంబ కంకాళ । మాలతోడ
ఆభోగ భోగ స । హస్రమణీ ఘృణి
కలి తాహి నాధ కం । కణము తోడ

గీ. జ్ఞాన తేజో విరాజిత । నయన కాంతి
డంబు మీఱిన ఫాల భా । గంబు తోడ
డమరు శూలముల్ కరములఁ । గొమరు మిగుల
మృడుఁడు వృషవాహనుండయి । వెడలె నపుడు.

గీ. అంబరస్థలి దివ్య వా । ద్యములు మ్రోఁగ
నచ్చరలు నియచ్చరులతో । నాడి పాడి
రపుడు బ్రహ్మాది దేవత । లనుగమించి
రెలమి నజ్ఞాత నేత్రుండు । పలుకరించె.

చ. ప్రమథులు వెంబడింప, ముని । వర్యుల సామము మిన్నుఁదాఁకఁ, ద
య్యములు వికారరూపముల । నాటల నాడుచుఁ బాడుచుండ, ను

క్షముపయి వచ్చునీశ్వరునిఁ । గాంచి కడుంగడు సంతసించి యా
హిమగిరి యేగుదెంచి, యపు । డెల్లఱు మెల్లగ గౌరవించుచున్.

గీ. హరి హర బ్రహ్మలను మునీ । శ్వరులఁ జూచి
మ్రొక్కులర్పించి, ప్రమథులఁ । దక్కు వారి
పలుకులం దేనె లొల్కంగఁ । బలుకరించి
పెండ్లి విడిదిని జూపించి · విడియఁ జేసె.

గీ. ప్రమథులంజూచి దయ్యాల । వరుసఁ జూచి
భర్గుఁ బరికించి వాని రూ । పంబుఁ గాంచి
"ఔర ! పాములవాఁడు ద । య్యాల ఱేఁడు
పెండ్లికొడు" కంచు నవ్వి ర । వ్వీటివారు.

ఉ. ఎక్కడనుండివచ్చె జల । జేక్షణ కిట్టి మగండు? నారదుం
డక్కట కొంపఁదీసెఁ, దప । మంతయుఁ బాములవానికొక్కొ? యీ
చక్కని చుక్క యెక్కడ? శ్మ । శానమునందు మెలంగు జోగివీఁ
డెక్కడ? కొంపలేక చరి । యించెడు వానికిఁ బెండ్లి యేటికిన్.

గీ. ధనము లే దిల్లు లే దెట్టి । ఘనత లేదు
మాయయున్ మర్మమున్ లేక । మలయువాఁడు
దాపరించునె నీ కిట్టి । కాపురంబు ?
ఎవ్విధి సహింపవచ్చునే । పువ్వుబోణి.

ఆ. వె. బూచులకెకిమీఁడు । త్రాచుపాములవాఁడు
వల్లకాటిఱేఁడు । వల్లభుండె ?
ఊర జోగి యనఁగ । నూరూరఁ దిరుగాడు
వెంగలీఁడు వీఁడు । సంగడీఁడె ?

ఉ. పాఁడియుఁ బంట లేదనెడు । వాదటులుండఁగ నిల్లులేక న
ట్టాడెడు బిచ్చగాని కెవ । రైనఁ గుమారిక నిచ్చువారె? యి

ట్లాడికలాడ నేటికని । యందువు బేలవుగాన, వీనిఁ బెం
డ్లాడినఁ బూవుబోండ్లు నగ । రా? నగరాజకుమారి చెప్పుమా?"

చ. అని తనతల్లి యివ్విధి మ । హాపద పైఁబడినట్టు లెంతయున్
ఘనతర దుఃఖవేదనకుఁ । గాఁగి కడుంగడు వ్రేఁగి యేడ్చినన్
గని గిరిరాజపుత్త్రిక, ము । ఖంబున లేనగవంకురింపఁగా
జననినిఁ గౌఁగిలించుకొని । సాంత్వనవాక్యముల నాపె కిట్లనున్.

మ. "మును నేఁజేసిన చేఁతకుం దగుఫలం । బున్ గాక యన్యంబుఁ గో
రినఁ జేకురునె? నామగండకట వె । ట్టిం బోలి, యం బేదయై
వనిలోఁ గాపురముండుఁగాక, విను నా । ప్రారబ్ధకర్మంబు ద
ప్పునె? తప్పింపఁగ నేరికైనఁ దరమే? । మోహంబు నీకేటికిన్?

ఉ. చక్కఁదనంబుఁగోరు నెఱ । జాణలఁ బోలిన దానఁగాను; పెన్
మక్కువఁ గాంత యెవ్వనికి । మానసమిచ్చు నతండె నాథుఁడ
మ్మక్కరో! యిట్టిచింత తగు । నా మగనాలికి? నెట్టివానికిన్
జిక్కనివాఁడు కౌఁగిటకుఁ । జిక్కినఁ జాలదె యింత యేటికిన్.

ఆ. వె. కాళ్ళకేమి చేటు? । కనుల కేమిట లోటు?
పొట్టగావు మఱియు । లొట్ట వోవు;
అతనుఁ డంతవాఁడు । నతని చక్కఁదనంబుఁ
జూడలేక చచ్చి । సున్నమయ్యె."

క. అని సాంత్వన వాక్యముల న
వ్వనితామణి శైలపుత్త్రి । పలుకుచు నుండన్
విని సప్తఋషులతో సుర
ముని నారదుఁ డేగుదెంచెఁ । బొంతకు నెలమిన్.

గీ. అట్టు లేతెంచి నారదుం । డపహసించి
మేనకంజూచి వినుమని । యానతిచ్చె;

"మగువ! నీదు పుత్త్రిక జగ । న్మాత మఱియు
నాది మధ్యాంత రహిత, య । య్యాది శక్తి.
గీ. శివుని నెవనిగ నెంచి దూ । షించె దీవు ?
విశ్వనాథుండు ఘనుఁడు ము । వ్వేల్పులందు,
అతని యర్ధాంగ లక్ష్మి యి । య్యాదిశక్తి;
కాంత! యింక నీ కేటికి । నింత వంత ?
చ. అసదృశయోగమార్గ మహి । మాతిశయంబునఁబొల్చువాఁడు సొం
పెసఁగిన మేనివాఁడు భువి । నేరికిఁ జిక్కనివాఁడు మాయతో
మసలెడువాఁడుచూడఁగ న । హీన విభూషలనొప్పువాఁ డయో
దిన మొలవానిఁగాఁదలఁచి । తేఁకువఁ దప్పకుమమ్మ యుత్తఱిన్.
సీ. దక్షప్రజాపతి । తనుజయై నాఁడు నీ
యాత్మజ శివునిఁ బెం । డ్లాడ లేదొ ?
జానకీ రాముల । సన్నుతించి భజించు
నలికాక్షు తోడ వా । దాడ లేదొ ?
సీతాకృతిం దాల్చి । శ్రీరాము వంచింప
నడవికి నొంటిమై । వెడల లేదొ ?
భర్తృవియోగంబు । బాధింప దుఃఖించి
పెక్కేండ్లు తపముఁ గా । వింప లేదొ ?
గీ. పరిభవాగ్నికి దేహంబుఁ । బాయ లేదొ ?
నీదు కూఁతురై జన్మించి । నెగడ లేదొ ?
మెండి శివునిఁ బెండ్లాడఁ ద । పింప లేదొ ?
అతివ! నీవెఱుఁగనియట్టి । యాశమేదొ ?
చ. అన విని మేనకాది లలి । తాంగులు మిక్కిలి సంతసించి 'యో
మునివర! నీదువాక్యముల । పొందికఁబొందికఁ బొంపునింపు; మా

మనములనుండు సందియము । మానె ముహూర్తమమించకుండ నా
సనములఁగొండు లెండనుచు । శైలసుతం గడుమెచ్చిరంతటన్.

చ. వలువలతోడఁ, గప్పురము । భాతి నెసంగు విభూతితోడ మేల్
చిలువలతోడ సాలువలెఁ । జెల్వలరారెడు తోలుతోడ నా
దల నెలవంకతోడఁ దెలి । దమ్ములఁగ్రాల్ వినువాఁకతోడ, న
న్నలువకు మ్రొక్కి యాసనము । నన్ శివుడున్ దజివేచియుండఁగన్

ఉ. అంతట సన్మునీశ్వరుల । యానతి దేహమలంకరించి, శ్రీ
కాంతయు వెంబడింప నగ । కాంతు తనూజను దెచ్చిరెల్లయున్;
"కంతుని మత్తదంతి" యని । కానుకలిచ్చిరి వేల్పులంత, వా
క్కాంతనుగూడి యయ్యమర । కాంతలు పాటలఁ బాడిరాడుచున్.

గీ. రామభక్తియె యతుల సా । మ్రాజ్య" మనుచు
మహతిఁ గొని నారదుఁడు పాడె । మాను లలర;
వైదిక ప్రక్రియారంభ । వైభవమునఁ
బెండ్లి దీపించె వెన్నుండు । వినుతులిచ్చె.

గీ. పార్వతీ పరమేశ్వరో । ద్వాహ వైభ
వంబుఁ గాంచి మోదించిరి । పరమఋషివరులు;
దేవతా జయధ్వని మ్రోఁగె । దిక్తటముల!
జనులు హర్షింపఁ బుష్ప వ । ర్షంబు గురిసె.

గీ. అంత హిమవంతుఁ డామోద । మతిశయిల్ల,
నమరు లౌనని వినుతింప । హైమవతికిఁ
జిత్తమిగురొత్త, దాస దా । సీ జనంబు,
హస్తి రథ వాజి సంచయం । బరణ మిచ్చె.

చ. ఇలఁ గల జీవకోటి నల । యించిన దైత్యులు తల్లడిల్ల, వే
ల్పులు గడు నుల్లసిల్ల, గిరి । పుత్రికఁగూడి సుఖంపుమంచు, ని

ర్మలహృదయుల్ తపోనిధులు । మానులు దీవనలిచ్చి మెచ్చి రా
చలిమలయల్లునిన్ మరుని । జంపినమల్లుని నద్రిభిల్లునిన్.

ఉ. పిమ్మట శైలరాజసతి । పెండ్లికొమారునిఁ జూచి "దేవ యీ
కొమ్మనుముద్దుగుమ్మనిఁక । గొమ్ము, శుభంబగుఁగాక, మాకు జ్ఞా
నమ్ముదయించుఁగాక" యని । నాయపరాధముఁబ్రోవు" మంచుఁది
య్యమ్ముగఁబల్కి, చెంతఁగల । హైమవతిన్ దిలకించి యిట్లనున్

ఉ. తల్లి! సతీమతల్లి! విబు । ధప్రకరావనకల్పవల్లి! ని
న్నెల్లఱు నన్నుతింపఁ దపి । యించితివమ్మ, సమస్తదేవతా
తల్లజుఁ గొంటివమ్మ, నినుఁ । దక్క పరాంగనఁ జూపఁడమ్మ నీ
వుల్లమునందు నీమగని । నొప్పరికింపకుమమ్మ యెన్నఁడున్.

గీ. అంతఁ జెలికత్తె లయ్యాతి । నభినుతించి,
పార్వతిం దెచ్చి ముక్కంటి । పజ్జ నిలిపి
రెల్లఱున్ మెచ్చి దీవన । లిచ్చి రెలమిఁ;
బార్వతింగూడి వెడలె న । వ్వరుఁడు హరుఁడు.

ఉ. తోసము మేరమీఱ, నవ । తోయజపత్రవిశాలనేత్రి యు
ల్లాసముఁ జూప, మన్మథవి । లాసములన్ గరఁగించి శూలి కై
లాసమునన్ దదీయవను । లన్ విహరించి సుఖించెఁ సంగర
శ్రీసము పేతు, నిర్వ్యాజయ । శీలునిఁగాంచెఁ గుమారు నొక్కనిన్

గీ. అక్కుమారుండు బల్లిదుం । డుక్కలుండు
తారకుని సంహరించి బృం । దారకులను
బ్రోచె, నెల్లఱు రంజిల్లి । మ్రొక్కులిడిరి;
జగము నిష్కంటకం బయి । సంతసించె.

గీ. అనుచు నీరీతిఁ బల్కిన । యాజ్ఞవల్క్య
నాభరద్వాజుఁడా నని । యభినుతించె;

నంత నయ్యాజ్ఞవల్క్యుండు । సంతసించి
"అనఘ! యాలింపు" మని యిట్లు । లానతిచ్చె.

చ. హరునిచరిత్రసాంబుధి, త । దంతముఁ జూడఁగ లేవు వేదముల్;
నరుఁడు నుతింపఁ జాలునె? మ । నంబున నీవు సతంబు నమ్మహే
శ్వరు వినుతింతు వక్కతన । జన్మము సార్థకమయ్యె నీకు; ధీ
వరుఁడయి యీశ్వరుం గొలుచు । వానికిఁ జేకురు రామభక్తియున్.

ఉ. శూలికిఁ దుల్యుఁ డెవ్వఁడు? వ । సుంధరఁ బుట్టిన రాము నెన్నఁ గాఁ
జాలినవాఁడతండయని । చాటెద, రామచరిత్ర తీర్థమున్
గ్రోలెద నెల్లభక్తులకుఁ । గ్రోలఁగనిచ్చెద నాలకింప వో
మేలని సన్నుతింపవో య । మేయ తపోధన మోక్షసాధనా.

గీ. కిన్నరులు పాడ దేవతల్ । సన్నుతింప
సిద్ధసాధ్యులు తనను ప్రి । స్సిఁ బొగడఁ
బార్వతిం గూడి కైలాస । పర్వతమునఁ
గాపురంబుండె నక్కాల । కంధరుండు.

గీ. ఎవఁడు హరిహర విముఖుఁడో । యెవఁ డధర్మ
పరుఁడో వాఁడు కైలాస ప । ర్వతముఁ జూడఁ
జాలఁ డేనాటికైన ని । స్సంశయముగ
సన్నుతాగణ్య పుణ్య! ధీ । జనవరేణ్య!

గీ. ఘనుఁడు కుందేందునీహార । గౌరదేహి,
నిర్మలాత్ముండు కరకంక । ణీకృతాహి
పీన వక్షస్స్థలుండు కౌ । పీనధారి;
విబుధవందిత త్రిపురారి । వినుత శౌరి.

క. తరుణారుణాంబురుహ నిభ
చరణ నఖద్యుతి వితతిని । సద్భక్తుల దు

స్తర మాయా తమసంబును
హరియించెడు జ్ఞానమూర్తి । హరుఁడు తలంపన్.

గీ. చంద్రమౌళి శరత్కాల । చంద్రముఖుఁడు
నీలకంఠుండు కైలాస । శైల వీథి
మలయమారుత మనిశంబు । మలయుచుండ,
వృక్షములనీడఁ దపముఁ గా । వించుచుండు.

పార్వతి యీశ్వరునితో రామునిఁగూర్చి ప్రసంగించుట

గీ. అతని యనురాగముం గాంచి । యభినుతించి
మందహాసావృతాస్యయై । మందగమన
గిరిజ యొక్కనా డాతని । కేంగివనిల్చి
మధురవాక్కుల నిట్లనె । మానులలర.

ఉ. స్వామి! జగత్త్రయంబున భ । వన్మహిమంబు ప్రసిద్ధిఁగాంచె లో
కామయహర్తవౌదువు చ । రాచరముల్ వినుతించు చిత్కళా
ధాముఁడ వెల్లవేల్పులకుఁ । దండ్రివి, జ్ఞానివి, యోగి వీవు, నీ
నామము కల్పభూరుహ మ । నందగు భక్తుల కాశ్రితావనా.

ఉ. వాసిఁగలట్టి వేలుపని । భవ్యశముండని మానులెల్ల నీ
తా సముపేతుఁడైన గుణ । ధాముని రాముని నెన్నుచుందురు; నీ
దాసిని, మూఢచిత్తను స । దాశివ! పామరకోటి ముక్తికిన్
గాసిలకుండ రాఘవుని । గాథ యగాధమెఱుంగఁ జేయవే.

గీ. కల్పవృక్షంబు తనయింటఁ । గ్రాలుచుండ
ఘోర దారిద్ర్యబాధకుఁ । గుందినట్లు
బ్రహ్మమయుఁడు సర్వజ్ఞుండు । భర్తయయ్యు
జ్ఞానహీననై దుఃఖపెల్లఁ । జనునె నాకు.

గీ. రామ సుగుణంబులఁ దలంచి । బ్రహ్మమనుచు
జ్ఞానులగు మౌనులెల్లను । సన్నుతింత్రు,
వేదశాస్త్ర పురాణముల్ । వినుతులిచ్చు
నలువ కీర్తించు వేనోళ్ళ । చిలువ పొగడు.

గీ. అయ్యదట్లుండె ననఘ కా । మారి! నీవు
అనిశమున్ రాము నామంబు । నాత్మయందుఁ
బ్రస్తుతించెద వారయ । రాఘవుండు
నిర్గుణ బ్రహ్మమన నౌనె? । నిటల నేత్ర!

గీ. నిర్గుణబ్రహ్మ మెట్లగు । నృపసుతుండు?
స్త్రీవియోగంబు సహింపఁ । జేవలేని
యతని మహిమాతిశయము నే । నరయఁ జాల
స్వాంతము మునింగె సందేహ । సాగరమున.

సీ. అంతట వ్యాపించి । నట్టి యీ నిర్గుణ
బ్రహ్మంబు రామ భూ । వరునికంటె
భిన్నంబుగా నున్నఁ । గ్రన్నన నెఱుఁగఁ జె
ప్పుము నాకు వినియెద । భుజగ భూష!
అవివేకినికి నేటి । కని మిన్నకున్న నా
యజ్ఞాన మేరీతి । నంతరించు?
ఆనాడు వనమున । నా రాఘవునిఁ జూచి
మిక్కిలి భీతిచే । మేను మఱచి

గీ. వచ్చితిని నొచ్చితిని, నిన్ను । మెచ్చుకొంటి;
దబ్బఱ వచించి నిక్కంబు । దాచి పుచ్చి
అనుభవించితిఁ దత్ఫలం । బాత్మయందు
జ్ఞాన ముదయింపకున్నది । జ్ఞానమూర్తి.

క. ఉన్నవి సందేహము లె
న్నెన్నో ? సదసద్వివేక । హీనను దేవా !
సన్నుతిఁ గావించెద, నన్
మన్నించి వచింపు మతని । మహిమము విందున్.

సీ. అనఘ విరాముని రాము । ధ్యానింప వాంఛింతు
నెన్నాళ్ళనుండియో । యిందుమౌళి !
పాపాత్మురాలను । నీపాదదాసినిఁ
ద్రికరణశుద్ధిగఁ । దెలుప వలయుఁ
దత్వవేదులు గూఢ । తత్వంబు నన్యులు
కుపదేశముం జేయ । కున్న వారె ?
బ్రహ్మజ్ఞ నిర్గుణ । బ్రహ్మంబు సగుణమై
యవనిపై నేరీతి । నవతరించు ?

గీ. నఖిల భువనంబులకు నొజ్జ । వగుదు వనఘ !
ఈ వెఱుంగని యంశ మిం । కెందుఁ గలదు ?
మాయఁ దొలఁగింపఁజేయు రా । మాయణంబు
నానతిచ్చిన విని యెద । వీనులార !

గీ. జ్ఞాన వైరాగ్య భక్తుల । సంగ్రహించి
రాముని భజించు భక్తుఁడ । వో మహాత్మ !
వేదములయందు నీకీర్తి । విస్తరించె
నిన్ను వినుతింపఁ జాలునె । నీచ జీవి !

చ. అనవుడు నాలకించి నిట । లాక్షుఁడు మిక్కిలి సంతసించె; నా
తని హృదయంబు రామచరి । తంబను నంబుధి నీఁదులాడగన్
గనుఁగవబాష్పజాలమునఁ । గ్రాలె మెయిన్ బులకల్ రహించె నె
మ్మనమున రామరూపు విసు । మానముగన్ గనుపట్టె నత్తఱిన్.

గీ. స్వాంతమున సంతసించుచుఁ । గొంత దనుక
సుప్రసన్నుఁడై రాముని । సుప్రసిద్ధ
మహిమ ధ్యానించి రమ్య రా । మాయణంబు
వింపు నింపుచు నిట్లు వ । ర్ణింపఁ దొడఁగె.

శివోపదేశము

గీ. సత్త్ర సత్తుగ నెంచు న । జ్ఞాని యకట !
త్రాడు పామను విభ్రాంతిఁ । దల్లడిల్లు
జ్ఞానికీ ప్రపంచము మిథ్య; । జాగరితకు
స్వప్న విభ్రాంతి యుండునే । జలరుహాక్షి ?

గీ. పార్వతీ ! నిన్నుఁబోలిన । వారు గలరె ?
అఖిలలోకోపకారార్థ । మడిగె దీవు ;
రమ్య గంగానదింబోలు । రాము గాథ
మూడు జగములవారికి । మోక్షమిచ్చు.

సీ. దనుజారి చరితంబు । వినలేని వీనులు
వీనులే? యవి సర్ప । బిలము లతివ !
సజ్జనులం జూడఁ । జాలని కన్నులు
కన్నులే? యవి నెమ్మి । కన్ను లువిద !
అనఘులకున్ ప్రమొక్క । నట్టి శిరంబు శి
రం బౌనె ? తుంభీ ఫ । లంబ వనిత !
శౌరిని ధ్యానింపఁ । జాలని భావంబు
భావంబె ? జీవచ్ఛ । వంబ మగువ !

గీ. జానకీరాము వినుతింప । రాని జిహ్వ
జిహ్వయే? యది మండూక । జిహ్వ గిరిజ !

దేవతలఁ బ్రోచు దనుజుల ౹ సేవగించు,
నతని యవతారము నుతింప ౹ నలవి యగునె ?

గీ. రాము సత్కథా కరతాళ ౹ రావములను
వినినఁ బరువిడు సందేహ ౹ మను ఖగంబు,
రామ సత్కథా పరశు ధా ౹ రలకు నకట
నిలువఁ జాలునె యెంతైనఁ ౹ గలికుజంబు.

ఉ. రామ! సతీలలామ! విను ౹ రాముఁ డనంతుఁ డనంగనొప్పుఁ, ద
న్నామ చరిత్ర, జన్మ, సుగు ౹ ణంబుల నెన్నఁగలేవు వేదముల్
నామదినున్న రామ జన ౹ సాధుని గాథఁ గదించువాఁడ, మ
ర్త్యామర మాని చంద్రములకు ౹ నైన నెఱుంగఁగరాని దారయన్.

క. శ్రుతులకుఁ బొఁగడం దగినది
యతులకు ధ్యానింపఁ దగిన ౹ దనఘుం బాద్యం
బతులం బప్పరతత్త్వం
బతివా! శ్రీరాముకంటె ౹ నన్యంబగునే ?

క. పలుకం దగ దన్యంబని
పలికిన వినరాదు, విన్నఁ ౹ బాషండుఁడగున్;
గలికీ! హరిపద విముఖుఁడు
తెలియునె సదసద్వివేక ౹ దివ్యపథంబున్.

ఉ. జ్ఞానములేనివాఁడు సద ౹ సత్తులెఱుంగనివాఁడు శాస్త్ర దృక్
హీనుఁడుగాన నంధుఁడగు ౹ నెంతయు, దుర్విషయాగ్ని తప్త త
న్మానస దర్పణంబునను ౹ నైల్యమునెక్కొని మంచిచెడ్డలన్
గానగ నీవు, మత్తగజ ౹ గామిని ! నీకు నెఱుంగ, జెప్పితిన్.

క. కుటిలుఁడు, గపటియు, స్త్రీలం
పటుఁడును, శ్రుతిగర్హిత పథ ౹ వర్తనులై యో

కుటిలాలక! సత్సభలన్
గటకట వీక్షింపలేరు । కలలో నైనన్.

గీ. వేదమును విశ్వసింపరు । వీసమైన,
నాత్మ లాభ నష్టంబుల । నరయఁబోరు,
పండితుల మైత్రి సుంతయుఁ । బడయలేరు,
వారు శ్రీరాము వీక్షించు । వారె? యబల!

గీ. సగుణ నిర్గుణములఁ గూర్చి । చర్చ లేక,
వివిధ హేతులఁ గల్పించి । వ్రేలుచుంద్రు,
విష్ణు మాయావశంబున । వెలయు సృష్టి
ఎంత చెప్పిన వారు గ్ర । హింపలేరు.

గీ. సన్నిపాతవశుండైన । జనుఁడు లోన
మంచిచెడ్డల నరయక । మాటలాడు;
మోహమదిరను గ్రోలిన । మూఢమతికిఁ
దెలివి యిట్టిద యంచు బో । ధింప నగునె?

క. హృదయంబున శ్రీరాముని
సదయుని భావింపుమింక । సంశయమణఁగున్;
ముదితా! శంకాతమమును
విదళించెద నాదువాక్య । విమలార్కఘృణిన్.

ఉ. ఆదరువొంది యీసగుణ । మాకృతిఁ గైకొను భక్తకోటిపై
నాదటఁబూని; నిర్గుణ మ । నాకృతిఁ గ్రాలుఁ దలంప రెంటికిన్
భేదము గానరాదని, వి । వేకుల మానుల వాదముండఁగా
వేదములున్ బురాణములు । విశ్రుతశాస్త్రములున్ వచించెడున్.

క. నగ నిర్గుణంబు సగుణం
బగునా యను వాద మేటి । కంబుప్రు మంచా

పగిది నెఱుంగరో? యోహరో !
మగువా! మోహంబుడిగిన మానస మెఱుఁగున్.

క. ఎవ్వని నామము రవియై
దవ్వుగ వ్యామోహనామ తమసముఁ దోలున్,
బువ్వారుబోణి నమ్మిక
నవ్వానిని బ్రహ్మమంచు నరయుము మదిలో.

గీ. సచ్చిదానంద రూపంబు సహజకాంతిఁ
గలది, యయ్యది శ్రీరాముఁ గలసెఁ జూవె;
అతనిఁ గొలిచిన నేనాటి కైనఁ గాని
జ్ఞానమావిర్భవించు, మోక్షము లభించు.

గీ. శైలతనయ! యజ్ఞాన విజ్ఞానములును,
కామ మోహ లోభాద్యహంకారములును
సహజములు జీవకోటికి; సకలమునను
రాముఁడు రహించుఁ బో పరబ్రహ్మమనఁగ.

గీ. సాంఖ్యమను సుప్రసిద్ధ శాస్త్రమునఁ బొల్చు
పురుషుఁడే, నిర్మలజ్ఞాన మూర్తియైన
రామచంద్రుఁ డ, తండె మాయామయుండు,
జీవనాధారుఁ డఖిల లోకావనుండు.

ఉ. జ్ఞానము లేని పూరుషుని స్వాంతము భ్రాంతికిఁ దల్లడిల్లుఁ బ్ర
జ్ఞానిధి కానివాఁడు ప్రభు సంగతికిన్ విముఖత్వమొందు నో
మానిని! మానవుండెఱుక మాలి, దివిన్, జలదాంతరస్థునిన్
భానుని, లోఁదలంచుఁ గద పశ్చిమవారిధిఁ గ్రుంకినట్లుగన్.

ఉ. బాలుఁడు కంటిఱెప్పపయి బాగుగ వ్రేలిడి నొక్కి చూచినన్
పోలికఁ జంద్రుఁడొక్కరుఁడ యయ్యును రెండుగఁ దోచు కైవడిన్

ధూళినిఁ జీకటిన్ మఱియు । ధూమమునన్ దివి, వెక్కురూపులన్
గ్రాలినరీతి, బ్రహ్మమయి । రాముఁడు దోఁచు ననేక లీలన్.

గీ. అధిక తాపత్రయావృతుఁ । డైన యట్లు
పైకిఁ గన్పట్టుఁగాక సు । శ్లోకుఁ డతఁడు
శుద్ధబుద్ధుండు విజ్ఞాన । బద్ధుఁ డతుల
సచ్చిదానందమయమూర్తి । స్వచ్ఛకీర్తి.

గీ. విషయ దశకంబు, శబ్దాది । నియమములును,
జీవరాశులు, వేఁడియు । దేవతలును,
చెలఁగిఁ మెలఁగి చైతన్య వి । శిష్టములగు,
రామచంద్రుని కరుణచే । రమణి! వినుము.

క. రజతంబు శుక్తియందు, స
హజముగ నున్నట్లు దోఁచు । న ట్లాతప మం
దు జలము భాసిలు, నయ్యది
నిజమగునే భ్రాంతిగాక । నీరజ నేత్రా!

క. భగవంతుని ప్రాపున నీ
జగమంతయుఁ దోఁచుఁగాక । సత్యంబగునే ?
మగువా! వినుమీ మిథ్యా
జగతిని దుఃఖంబు దోఁచు । శాశ్వత మనఁగన్.

క. తల తునిసిన చందంబునఁ
గల కని దుఃఖించి మేలు । కాంచి నిజంబున్
దెలిసిన గతి, నీజగతిన్
గల కల్ల నెఱుంగవచ్చు । జ్ఞానము వలనన్.

క. ఆద్యంత శూన్యుఁ డనుచును
హృద్యంబుగ వేదఋక్కు । లెవని నుతించున్

సద్యంబ వానిఁ గొలిచిన
వేద్యంబగు సృష్టిలోని ౹ విషయము లబలా !

సీ. అడుగులు లేకయే ౹ పడఁతిరో! యెవ్వాఁడు
పుడమిపై వడివడి ౹ నడువఁ జాలు
వీనులు లేకయే ౹ వెలఁదిరో! యెవ్వాఁడు
లెస్సగా సకల మా ౹ లింపఁ జాలుఁ
జేతులు లేకయే ౹ నాఁతిరో! యెవ్వాఁడు
వివిధ కర్మములఁ గా ౹ వింపఁ జాలు
నాస్యంబు లేకయే ౹ యతివరో! యెవ్వాఁడు
చెలఁగి సర్వంబు భ ౹ క్షింపఁ జాలు

గీ. నాల్క లేకున్న నెవ్వాఁడు ౹ పల్కఁ జాలుఁ
జూడ్కి లేకున్న నెవ్వాఁడు ౹ చూడఁ జాలు
మేను లేకున్న నెవ్వాఁడు ౹ మెదలఁ జాలు
నట్టి శ్రీరాము నెవ్వాఁడు ౹ నరయ లేడు.

క. ధ్యేయుఁడు బుధులకు, శ్రుతులకు
జ్ఞేయుఁడు, యోగులకుఁ గీర్త ౹ నీయుఁడు, మునిరా
డ్గేయుఁడు సర్వసుపర్వా
మేయుఁడు, రాముండు, వేల్పు ౹ మేటి; మెలఁతా !

గీ. ఎవని నామబలంబున ౹ నేను, వార
ణాసిలో శరీరంబును ౹ బాసినట్టి
జీవికిన్ మోక్షముం జెందఁ ౹ జేయుచుంటి
నతఁడు నాస్వామి శ్రీరాముఁ ౹ డంబుజాక్షి !

క. ఎఱుఁగక స్పృశించినంత నె
చుఱచుఱ ననలంబు కాల్చు ౹ చొప్పున మనుజుం

దలమరికనేని రామున్
దెలవా! తలఁచిన నఘంబు । తెల్లక యున్నే ?

క. సందేహ భంజనుండగు,
నిందుధరుఁడాడు పలుకు । లెల్లను విని య
య్యిందీవరాక్షి మదిలో
నిందీవరగాత్రుఁ గొల్చి । యిట్లను నెలమిన్.

క. "నాథా! కరుణను నీ వు
ద్బోధించినయంత వాడు । మోహము తొలఁగెన్;
శ్రీధవుని రాముఁ దెలిసితి
బాధం దొలగించుకొంటిఁ । బ్రజ్ఞం గంటిన్.

గీ. నన్ను నీపాద దాసిగ । నెన్నుకొనుము,
స్త్రీ స్వభావంబు జడమని । తెలియ వచ్చెఁ;
జిన్న సందియుఁ బున్నది । చిన్మయాత్మ!
శాంతము వహించి యెఱిఁగింప । సన్నుతింతు.

క. సర్వవ్యాపకుఁ డనఁగను
సర్వాంతర్యామి యనఁగ । సర్వజ్ఞుఁడనన్
శర్వా! నుతిఁగొను రాముం
డర్వన్ నరుఁబోలి పుట్ట । నొప్పునె చెపుమా ?"

క. అనవుడు శివుఁ డాపెం గని
"వనితా నీసందియంబు । వారింపగఁ లే
రనఘాత్ములైన మునులున్
ఘనులున్ బ్రహ్మాదిపుణ్య । ఖనులున్, వినుమా !

ఉ. రామచరిత్ర మానసము । రమ్యతరంబు, పవిత్రవంతమా
కామిని! తచ్చరిత్రమును । కాకభుశుండి వచింప మోక్ష ల

క్షేమమహిమాశయుండు ఖగ । శేఖరుఁ డాదట నాలకించె శ్రీ
రాముఁడనంగఁ గేవలము । రాజనియెంచకు మెన్నిభంగులన్.

తే. వారలిరువురి సంవాద । వైభవంబుఁ
దరుణమిద్దిగాదు నిగదింపఁ । దరుణి! మున్ను
దాశరథ్యవతార క । థా విధాన
మాలకింపుము సందేహ । మంతరించు.

గీ. "భగవదవతార మేల సం । ప్రాప్తమయ్యె;"
ననిన నాబోటి కోబోటి । యరయ రాదు;
నే నెఱింగిన యంత వ । ర్ణించువాఁడ;
నెట్టిదో హేతు వీవ యూ । హింపఁ దగును.

చ. దనుజు లధర్మకర్మపర । తంత్రులు; ధర్మముఁగప్పిపుచ్చి, స
జ్జనులను సాధులన్ మునుల । భూసురులన్ సురలన్ నిరంతరం
బును నిరసించి దుఃఖములఁ । బొందఁగఁ జేసెద రట్టివేళఁ బా
వనుఁడు ధరావనుండు భగ । వంతుఁడు వారల సంహరింపగన్.

గీ. అవని నరరూపముం దాల్చి । యవతరించి
ఆశ్రితులఁ బ్రోచి, వేద మ । ర్యాద నిల్పి
మోదమిగురొత్త ధర్మంబుఁ । బాదుకొల్పుఁ,
దరుణి! యిట్టిదే రామావ । తార మనఁగ.

చ. జయవిజయుల్ హరింగొలువఁ । జాలిన భక్తులు, ద్వారపాలకుల్
ప్రయతు లుదారమానసులు; । బ్రాహ్మణశాపము కారణంబునన్
భయద తమోవికార గుణ । భార నికృష్టశరీరులై, కుశే
శయనయనా! ధరిత్రి దను । జత్వముఁగాంచి తపించిరెంతయున్.

గీ. కనకకశిపుఁడు, కనకాక్షుఁ । డనఁగ నిరువు
రింద్రుని పదచ్యుతుంజేసి । యేపుఁ గాంచి,

మెల్లమెల్లగ, నుల్లముల్ । తల్లడిల్ల
నెల్లఱ జయించి, జగములఁ । గొల్లఁగొనిరి.

గీ. ఖర వరాహ నృసింహావ । తారములను
దాల్చి శ్రీహరి వారలఁ । గూల్చి, చీల్చి,
అవని భారంబు వారించె । నమరు లలర;
వారు వెండియు నొందు క । ల్పమునఁ జెలఁగి.

క. జగ మెంతయు భీతిం జెం
దఁగ రావణ కుంభకర్ణ । నామంబులతోఁ
బగఁబూని సురలఁ గెలిచిరి;
భగవంతుం డవతరించి । వారలఁ దునిమెన్.

ఉ. "మూడవపుట్టుకన్ దనుజ । పుంగవు లిర్వురు శ్రీనివాసుచే
నోడిన మోక్షముంబడయ । నోపుదురన్ మునివాక్యమెంచి పో
రాడి వధించి వారలకు । నాదట మోక్షమొసంగి భూస్థలిన్
బాడఱియున్నపాడి నిలు । పన్ హరి వెండియు నాపుఁగైకొనెన్.

క. ఇది యిట్లుండగఁ దెలిపెద
విదితంబుగ రాముగాథ । విబుధులు జ్ఞానా
భ్యుదయప్రద మని యందురు
ముదితా! విను వీనులార । ముచ్చట దీఱన్.

క. శ్రీసహితుఁ డదితి కశ్యపు
లాసింపఁగఁ బుత్త్రుఁడయ్యె; । నా దంపతులే
కౌసల్యా దశరథులై
శాసించిరి ధర్మపథము । సాకేతమునన్.

క. మునుపొక యుగమున భీకర
దనుజుండు జలంధరుండు । దైత్యాధిపుఁడై

తన దోర్బలమున నమరుల
ననిలోన జయించి యింద్రు । నడలం గొట్టెన్.

గీ. కంధర సమాన దేహుండు, । ధూమ్రధ్రశిఖర
కంధరుండు, భూరమణీ భ । గందరుండు,
రణకలా పరి భూత పు । రందరుండు,
అల జలంధరుఁ డరి హంస । జలధరుండు.

గీ. అతివ! యతి పతివ్రతచూవె । యతని భార్య
అక్కతంబునఁ ద్రిపురాసు । రారి నయ్యు
వానితోఁబోరి యోడితి । భండనమున;
అందఱుంగుందఁ బలచెఁ బు । రందరుండు.

శా. ఏతన్మాత్రుఁడె రాక్షసుండు? తరుణీ! । యిందీవరశ్యాముఁడే
రీతిన్ వీని వధింపవచ్చు నని లో । దృష్టించి తన్మానినీ
పాతివ్రత్యముఁ గొల్లలాడి యతనిన్ । వంచించి ఖండించె; నీ
చేతంగాంచి ముకుందు నాసతి శపిం । చెన్ దైత్యులగ్గింపఁగన్.

గీ. బృంద శపియించి నంతనే । కుందకుండ
మంచిదని శౌరి యంగీక । రించెఁ జూవె;
ఉవిద! యీ దైత్యుఁడింకొక । యుగమునందు
నసురవిభుఁడయి జన్మించి । యతిశయించె.

గీ. అంబుజాక్షుండు పృథ్విపై । నవతరించి
వాని వధియించి యపవర్గ । ఫలమొసంగెఁ;
బూర్వ మొకనాడు నారద । మునివరుండు
నలిగి శపియింప వెండియు । నవతరించె."

చ. అనవుడు శైలపుత్త్రి యలి । కాక్షుని జూచి "మహానుభావ య
మ్మునివరుఁడైన నారదుఁడు । మూర్ఖుఁడె? భక్తవరుండు జ్ఞాని పా

వనుఁడు ప్రశాంతమూర్తి భగ । వంతుఁడొనర్చిన దోసమేమి యా
తని ముని వర్యుఁ డేటికి వృ । థా శపియించె? నెఱుంగఁ జెప్పవే?

గీ. అనిన నించుక హసియించి । యభవుఁ డనియె;
"జ్ఞాని లేఁడు మూర్ఖుండెందుఁ । గానరాఁడు
అనఘుఁ డారాముఁ డేరీతి । నాత్మఁ దలఁచు
నట్లు ఘటియిల్లు నంభోరు । హాయతాక్షి.

మ. హిమికాహార్య గుహాసమీపతలమం । దేపారు గంగన్ దదా
శ్రమ సౌందర్యముఁ జూచి లోనలరి వి । జ్ఞానంబు దీపింప సం
యమివర్యుండగు నారదుండు భగవ । ద్ధ్యానంబునందుండ దు
ర్భ్రమచే నింద్రుఁడుపంచెఁ గామునిఁ దపో । భంగంబుఁగావింపగన్.

క. ఇంద్రుఁడు తన పదవిని ముని
చంద్రుఁడు హరియించు నంచు । సందేహించెన్;
ఇంద్రియ సుఖ లాలసుఁ డో
చంద్రానన! కాకమట్లు । జంకుచునుండున్.

క. తనకుం జిక్కిన యెమ్మున్
గనినంతనె బొబ్బ మెకము । గైకొను నంచున్
శునకము పరువిడు వడువున,
ననఘున్ మునిఁ జూచి యింద్రుఁ । డనుమానించెన్.

చ. అలరులఁబూని వృక్షనిచ । యంబు కడుంగడుఁ గ్రాలె, బంభరం
బులు మధుపంబులై సకల । పుష్పరసంబుల నెల్లఁ గ్రోలె, గో
కిలముల పంచమధ్వనులు । కీర రవంబుల మేళవించె; వే
ల్పుల యెకిమీఁడు నారదుని । పొంతకుఁ గంతునిఁ బంచినంతనే.

గీ. అచ్చరల యాటపాటల । నాలకించి
మెచ్చుకొని శారికలు వేడి । యుచ్చరించె;

రాగ మిగురొత్తఁ గామాగ్ని ॥ ప్రజ్వలింప
మలయమారుత మే తెంచె ॥ మందగతిని.

గీ. సముపదుండయి నిల్చి; సం ॥ యమిని బిల్చి
టెక్కు పెంపెక్కఁ జేటకు వి ॥ ల్లెక్కు వెట్టి
అలరుటమ్మేసె నాలీధుఁ ॥ డైై మరుండు;
ఆత్మప్రతిమకు గిలిగింత ॥ రీతిఁ దోఁప.

గీ. చక్కు చెమరదు, నెమ్మేను ॥ చొక్కి సోల
దక్కటక్కట! జడదారి ॥ యట్ల యుండె;
సంగజుఁడు వ్యర్థమని, శృంగ ॥ భంగ మయ్యె
ననుచు నమ్మానికిన్ ప్రమొక్కి ॥ యభినుతించె.

గీ. స్మరుని వినుతికి మౌని ప్ర ॥ సన్నుఁ డగుచు
నల్పముగ నవ్వి పొమ్మని ॥ యానతిచ్చె
బ్రతుకుజీవుఁడ యంచు న ॥ ప్పంచ శరుఁడు
హరికి నెఱిఁగించె నెల్లయు ॥ నభినుతింప.

ఉ. మాయ నతిక్రమించితిని ॥ మన్మథు గెల్చితి ధిక్కరించితిన్
నాయదిగాక ప్రజ్ఞయని ॥ నారదుఁ డాత్మ నహంకరించి, యో
హో యని లేచి చిత్త మిగు ॥ రొత్తఁగ వీణియ మేళవించి నా
రాయణ శ్రీనివాస యని ॥ యాడుచుఁ బాడుచుఁ బోయె నత్తటిన్.

గీ. త్రోవ ననుఁజూచి యమహాని ॥ తోయజాస్త్రు
నతిశయ మణంచితి మహాత్మ! ॥ యని వచించి
నంత మేలు మేలని వాని ॥ నభినుతించి
"వెన్నునకుఁ జెప్పు" మని యంటి ॥ వికటముగను.

క. అకటా వికటంబుగ నే
నకటా! వచియింప మౌని ॥ యానని వడి నా

టక ట్రొంకరి వెన్నుఁడు గల
నికటంబున కేగెఁ జూవె । నీరజ నేత్రా !

మ. చని వైకుంఠునిఁజూచి కాముని కథన్ । సర్వంబు వాక్రుచ్చినన్
విని యాతండిసుమంతనవ్వి "విటులన్ । విభ్రాంతులన్ లోఁగొనన్
దనకుం జెల్లినఁ జెల్లుఁగాక ముని చం । ద్రా! నిన్ను ధర్షింపఁ గా
మునకున్ శక్యమె? బ్రహ్మచారివనుచున్ । భూంగించెనగ్గించుచున్.

గీ. ఆశ్రితున కంకురించిన । యతిశయంబు
సంహరింప సంకల్పించె । జలజ నేత్రుఁ
డాత్మ నుప్పొంగి భగవంతు । నభినుతించి
ఎలమి జడదారి తనదారి । నేగుచుండె.

గీ. వీణెయుంబూని జలజాక్షు । వీడుకొల్పి
మౌనివరుఁ డేగుచుండఁగ । మార్గమునను
నయున పర్వంబుగాఁ బత్తె । నం బొకంతు
గోచరించె భూలోక వై । కుంఠ మనఁగ.

విశ్వమోహిని స్వయంవరము

ఉ. అత్తఱి నారదుండు నయ । నాంబుజముల్ వికసింపఁజేసి త
త్పత్తనభర్మహర్మ్యముల । వైఖరిఁగాంచి రతిన్ జయించు న
న్మత్త గజేంద్రగాములను । మాటికి మాటికిఁ జూచి రూపునన్
చిత్తజులైన తత్పురుష । సింహములన్ బరికించి మౌనిప్పడెన్.

చ. బలమునవాయువై యతుల । వైభవయుక్తిసురేంద్రుఁడై తనూ
విలసనమందు మారుఁడయి । విద్యలకున్ విధియై కళోన్నతిన్
నెలయయి కాంతినర్కుఁడయి । నీతి బృహస్పతియై యశస్వియై
అలరెడువాఁడు శీలనిధి । యన్ నృపశేఖరుఁ డేలుఁ దత్పురిన్.

క. విశ్వమోహిని నంగజు
నశ్వమునా నొప్పు కన్నె । నాతఁడు గనియెన్
విశ్వేశ్వరి! యాపెకు నై
విశ్వమున స్వయంవరంబు । వెల్లడిఁ జేసెన్.

గీ. నేల యేలిన యట్టి భూ । పాల వరులు
వచ్చి యవ్వైభవముఁ జూచి । మెచ్చుకొనిరి
అంతమునివర్యుఁ డవ్వార్త । నాలకించి
రాజవరుఁ జూచి యాతని । పూజలందె.

ఉ. ఆ నృపుఁడంత "నామగృహ । మంతయు, బావనమయ్యె దేవ ప్రి
జ్ఞానిధి వీవెఱుంగని ప్రి । సంగము లుండవు నామకూతు రీ
మానిని యబ్జసంభవుని । మానసపుత్త్రుఁడ వీవెఁజూచి మా
కానతి యీయ నోపవె గు । ణావ గుణంబుల నెల్లభంగులన్.

చ. అన విని రాజుఁజూచి యజు । నాత్మజుఁడా లలితాంగి యందమున్
గనులఁ జెదర్పనీయక మె । గాదిగఁగాంచి మనోహరాంగి యి
వ్వనరుహపత్ర నేత్రియని । పల్కె మెదన్ విచలించి "యీమె న
న్నెనయకయున్న నాను తను । వేటికి భూమికి భారమౌఁ గదా.

క. స్నానంబ! యేటికరుగుము
ధ్యానంబా! యటవి కేగు । మకటా చాలున్
మౌనంబ! మూకుఁ జేరుము
జ్ఞానంబా! యీపెఁ గూడ । శంకింపకుమా.

గీ. నృపకుమారిక నన్ను వ । రించుఁ గాక;
చాలు జపమేల? తపమేల? । జ్ఞానమేల?
కాంత ననుఁ గూడకున్న నీ । కాయమేల?
సరస రతి నేలఁ జాలిన । స్వర్గమేల?

క. బాలన్, హరి నీలాలక
జాలన్, సుగుణాలవాల, । సన్నుత శీలన్,
లీలన్, నవమృగ మద జం
బాలన్, రతినేలకున్న । బ్రమకం జాలన్.

ఉ. చక్కనిచుక్కలైన నెఱ । జాణలకున్ దల మానికంబుగా
నక్కట ఖ్యాతికెక్కిన ల । తాంగిని రంభను జూచి యుండనా?
ఇక్కనకాంగిఁ బోలఁగల । దే? భళిరా ధృతిఁదక్కి చిక్కితిన్
గ్రక్కున మచ్చకంటి కడ । కంటికి నావెఱవింటి కిత్తుజిన్.

క. అని యివ్విధిఁ బొక్కుచు న
మ్మునివర్యుఁడు నారదుండు । భూపాలుని వీ
డ్కొని తత్స్వయంవరమునకు
జనపాలురు రాకమున్నె । చయ్యనఁ జనియెన్.

క. ఇలఁగల భూవరు లెల్లను
జలజాక్షినిఁ బెండ్లియాడఁ । జనుదెంచిరి, క
ల్వల రాజులో, వలరాజులో
తలపోయఁగఁ జాలమంచుఁ । దరుణులు వొగడన్.

క. తిలకంబుఁ దీర్చె నొక్కఁడు
కలకాలము యౌవనంబు । క్రాలు ననంగన్;
దిలకిని తిలకింపఁగఁ దా
వలపింపఁగ సాటిలేని । వలపులు నిగుడన్.

క. కొమ్ముల్ తిరిగిన వీరుఁడఁ
గొమ్మా! ననుఁ గూడి ముద్దుఁ । గొమ్మా ముద్దుం
గుమ్మా! యను నట్టుల మీ
సమ్ముల నొక భూవరుండు । చక్కఁగఁ ద్రిప్పెన్.

క. ఈరీతి రాజులెల్లను
గారాబము మోములందుఁ । గన్పట్టఁగ శృం
గారములం బ్రకటించిరి;
నారదు వీక్షింపవచ్చె । నారాయణుఁడున్.

గీ. కపట నృపవేషధారియై । కమలనాభుఁ
డచ్చటికి వచ్చెఁ దనుమెచ్చు । మచ్చకంటి;
అతని మాయావశంబున । నమ్మునీంద్రు
మోము వానర ముఖమును । బోలియుండె.

గీ. నారదుండాత్మఁ జక్కఁదన । ంబుఁ గలిగి
యున్నరీతిని భావించుఁ; । గన్నెమిన్న
తన్ను వరియించునని పజ్జ । నున్న భూమి
వరునితో గానముంగూర్చి । పలుకుచుండు.

క. ఒకపరి వీణం జేకొను,
నొకపరి సంగీత శాస్త్ర । మొప్పఁగఁ జెప్పున్,
ఒకపరి కన్నెం గనుఁగొనుఁ,
బకపకమని తన్నుఁజూచి । వనితలు నవ్వన్.

క. తన చక్కఁదనముఁ గనుఁగొని
వనితామణి మెచ్చునటుచు । భావించు మదిన్,
దనమోము చొప్పెఱుంగఁడు;
వనజాక్షుని మాయ నెఱుఁగ । వచ్చునె చెపుమా!

క. కాంతామణి, రతికాంతుని
చింతామణి యేగుదెంచె । క్షితిపులఁ గాంచెన్,
వంతంగొనె మునిఁగని, శ్రీ
కాంతుని వరియించి మాలఁ । గ్రక్కునవైచెన్.

నారదుఁడు ప్రమథుల శపియించుట

గీ. ప్రమథులరువురు నారదు । పజ్జ కరిగి
అద్దమును దెచ్చి తిలకింపుఁ । డనుచు నవ్వి
రంత మునివర్యుఁ డీక్షించె । నాగ్రహించెఁ
గనుల రేకెత్తెఁ గెంజాయ । యనల మనఁగ.

చ. "ఇరువురుఁ గ్రూరశారి! కప । టేంగితు లెంతకు లేరు? సన్మునీ
శ్వరులపహాసపాత్రులె? ని । శాచరులై భువిఁ బుట్టుఁడంచు ని
ష్ఠురుణ శపించె వెండియు మొ । గంబు జలంబునఁజూచి నారదుం
డరమర లోజనింపఁ గమ । లాక్షుని సన్నిధి కేగె నత్తఱిన్.

ఉ. "శ్రీపతి యిట్లు మాయఁబచ । రింపఁగ హేతువెఱుంగరాదె? సం
తాపము మేరమీఱె; నిఁకఁ । దాళుదునొక్కొ? శపించువాఁడ, లే
దా పడిచచ్చువాఁడ, నక । టా యవమానము నోర్వనచ్చునే?
కోపము హెచ్చెనంచు ముని । గొబ్బునఁ బోయె వికుంఠసీమకున్.

ఉ. విచ్చిన తమ్మిపూపులన । విశ్వవిమోహినితోడ, లచ్చితో
నచ్చటఁ గొల్చియున్న జల । జాక్షుఁడు మచ్చరమూని చెచ్చెరన్
వచ్చినవానిఁజూచి, "ముని । వర్య! కలంగిన చిత్తవృత్తితో
నెచ్చటికేగెదీ" వనిన । హెచ్చినకిన్క మునీంద్రుఁడిట్లనున్.

నారదుండు శ్రీవిష్ణువును దూషించుట.

ఉ. "హాలహలంబు శంభునకు । స్వార్థపరుండవొసంగితీవు, తో
ల్వేలుపుమూకకున్ మదిరఁ । బెట్టితి వెంతటివాఁడవౌర! ల
క్ష్మి లలితాంగిఁ, గౌస్తుభముఁ । జేకొనివచ్చి, నటించెదీ జగం
బేలుచునున్నయట్లు, కప । టేంగితమున్ విడనాడవెన్నఁడున్.

క. గడిదేఱిన గడిదొంగవు,
జడదారులు నిన్నుఁగొల్చి । జడులైరి గదా;

గమసరి వెంతయుఁ గుటిలుఁడ
వెడఁదన్ నిను విశ్వశించి । యెవఁడు రహించున్.

క. చేతో వీధిం దలఁచిన
చేఁతల వెనుదీయ కీవు । చేసెద వెటు లేన్;
స్వాతంత్ర్యముఁ గలవాఁడవు
నీతలఁ పెవ్వాఁడెఱుంగ । నేర్చును శౌరి !

క. కొంకవు జంకవు భళిరా
శంకాతంకములు లేక । చరియించెదవో ?
రంకులకున్ బొంకులకున్
బొంకంబుగ నుండు నీవు । బుద్ధి తలంపన్.

క. సాధ్యుండవు కావేరికి,
బాధ్యుండవు కావు కర్మ । పఙ్క్తికి, లోకా
రాధ్యుండవె ? శాపాయుధ
వధ్యుఁడవు కాక నీవు । పంకజ నేత్రా !

మ. ననువంచించిన యట్టి రూపమున జ । న్మంబొందుమే నాత్మఁ గో
రిన కాంతన్ హరియించితీవు, వినుమా । రీతిన్ మహాశోకుండవు నీ
కనకాంగింగొను; నన్ను వానరముఖుం । గావించితీవున్ భువి న్
వనిలో వానర సఖ్యముంబడయుమో । పద్మాక్ష ! యింకేటికిన్.

మ. సరసీజోద్భవపుత్త్రుఁడిట్లు కినుకన్ । శాపింపఁ, గోపింప నా
హరి యానాఁగని శాపముంగొని, ప్రస । న్నాంభోజ వక్త్రంబునన్
దరహాసాంకురముల్ నటింప, "మునిచంద్రా! యింక శాంతింపు, మీ
త్పరిహాసంబున" కంచు మాయఁ ద్రోలఁగిం । పం జేసె నాకుక్షిస్థుఁడున్.

గీ. మాయ తొలఁగిన యంతనే । మౌని వరుఁడు
మబ్బు బాసిన భానుని । మాడ్కిఁ గ్రాలె;

నంత నక్కాంత లిరువురు । నంతరింప
నక్కజముఁ బొంది శ్రీహరి । నభినుతించె.

క. "రక్షింపుము మూఢుఁడ, నను
శిక్షింపుము, నీదుమాయఁ । జిక్కితిఁ, గరుణన్
వీక్షింపుము, శ్రీనర హ
ర్యక్షా ! రణదక్ష ! భక్త । రక్షాదీక్షా !

క. కోపించితి, నెంతయు సం
తాపించితి, నేఁడు నీదు । తల నిందల నా
రోపించితి, మాయాంధుఁడ
శాపించితి నిన్ను, నన్ను । సాఁకం దగునే ?"

క. అని ముని వినుతించుచుఁ బ
ల్కిన పల్కుల నాలకించి, । క్లేశము తొలఁగన్
వనజాక్షుఁడు, దరహాసము
తన మోమునఁ జిందులాడ । దయ నిట్లనియెన్.

గీ. ఈశ్వరునికంటెఁ బ్రియుఁడు నా । కెందు లేఁడు
శివునిఁ గొలువుము నీమన । శ్చింత తొలఁగు
శివుని ద్వేషించి నన్ను భ । జించువాఁడు
మాయ నెడఁబాయఁ జాలఁడో । మౌనివర్య."

గీ. అనుచు వచియించి యంతలో । నంతరించి
నట్టి భగవంతు ధ్యానించి । యాత్మయందుఁ
గాలగతి నెంచి సత్యలో । కమున కేగె
మహతి మ్రోఁగించుకొనుచు న । మ్మౌనివరుఁడు.

గీ. శాపహతులైన ప్రమథు లా । సమయమునను
తపసి వీక్షించి, వాని పా । దముల కెఱఁగి,

"మునివతంసమ! కరుణింపు మని నుతింప
వారలంజూచి యిట్లనె నారదుండు.

గీ. "నాదు శాపంబు పరివర్త నంబు గనదు;
అధిక బలవంతులై దైత్యు లై జనింపుఁ
డంబుజాక్షుండు శ్రీరాముఁ డవతరించి
మిమ్ము వధియించునపుడు మో క్షమ్ముఁ గొనుఁడు."

చ. అనవుడు వారలిర్వురు "మ హాత్ముల వాక్యము రిత్తవోవునే?"
యనుచుఁ దలంచి దైత్యవరు లై భువిఁబుట్టిరి చూవె; దేవతా
వనుఁడగు మాధవుండమిత పాపభయంకరులన్ వధింపఁగన్
ఘనులనుఁబ్రోవ నొక్కొక యుగంబునఁ బుట్టుచునుండుమానినీ.

క. అవతార మొంది నంతనె
అవనీస్థలిఁ దచ్చరిత్ర మలరుచు నుండున్,
భవతారకమని యన్యుల
కవబోధముగా నుతింతు రతివ! మునీంద్రుల్.

క. వేదములకు సన్మునిసం
వాదములకు భవ్యకావ్య వర్గంబులకున్
మూదలమై తత్కథ ని
ర్వేదము మోదము నొసంగు విమలేందు ముఖీ!

క. అంతము లేనిది యని, వే
దాంతము, భేదాంతమంచు ననఘులు మును లే
కాంతముగా భగవత్కథ
స్వాంతములన్ సంస్మరింతు రంబుజ నేత్రా!

గీ. మాయఁ దొలఁగింపఁజాలు రా మాయణంబు
కోటి కల్పాంతములకైనఁ గొఱఁతఁ గనదు;

విబుధవర్యుల నేని శ్రీ విష్ణు మాయ
మోహితులఁ జేయుఁ జూవె స మ్మోహనాంగి !

క. భగవంతుఁడు భువి జన్మిం
పఁగ రెండవ కారణంబుఁ బలికెదఁ జిత్రం
బుగ వర్ణించెద వినుమా
మగువా! మాయాంధకార మార్తాండమగున్.

ఉ. నిర్గుణియై యెవండు సగు ణీకృతవేషముఁ దాల్చి మత్స్య సం
సర్గముఁ బొంది, సోదరుఁడు జాయయుఁదగ్గొలువన్, మహాటవీ
దుర్గమవీధులన్ మెలఁగి దుష్టుల నెల్లఁ సంహరించె నో
దుర్గ! తదీయగాథ భవ తోయధినుండి తరింపఁ జేయదే ?

మనుచరిత్రము

సీ. స్వాయంభువ మనువు శతరూపఁ బెండ్లాడి
మానవసృష్టిని మహిఁ సృజించె,
వానికి నుత్తాన పాదుండు పుత్త్రుఁడై
జన్మించి శాసించె సకల భూమి;
నతనికి ధ్రువుఁడను హరిభక్తుఁడుదయించె;
నతని పుత్త్రిండు పి ప్రియవ్రతుండు;
దేవహూతియనంగఁ దేజరిల్లినకాంత,
యాతని పుత్త్రిక యై రహించెఁ;

గీ. కర్దమప్రజాపతికి న క్కాంత భార్య;
ఆమె గర్భంబునందు నా రాయణుండు
కపిలుఁడనుపేర జన్మించి విపులముగను
సాంఖ్యశాస్త్రంబుఁ బ్రకటించె జలజగంధి !

క. మనుభూపతి రాజ్యంబును
ఘనముగఁ బాలించి యంత్య । కాలంబునకున్
దనరాజ్యముఁ దనసుతునకుఁ
గొనుమని యర్పించి యరిగె । ఘోరాటవికిన్.

క. వైరాగ్యం బభయంబని
శ్రీరామ పదారవింద । సేవాపరుఁడై
ఆరాజమహోళి సతితోఁ
గారాకుల మెసఁగి మెలఁగెఁ । గల తీర్థములన్.

గీ. ముక్తిసాధింప నెంచి, స । న్మునులఁ గొలిచి
సిద్ధులం జూచి యోగుల । సేవఁ జేసి,
భక్తి విజ్ఞాన వైరాగ్య । వైభవమునఁ
దీర్థముల సంచరించి కృ । తార్థుఁడయ్యె.

గీ. మేను శుష్కింపఁ జేసి, కా । పీన మూని
గోమతీ నదీజలముల । లో మునింగి,
ద్వాదశాక్షర మంత్రంబుఁ । దలఁచుకొనుచు
మునుల సేవించుచుఁ బురాణ । ములను వినుచు.

గీ. సచ్చిదానందమూర్తికి । స్వాంత మొసఁగి,
కందమూలాదులందిని, । కాంక్ష విడిచి,
జలములం గ్రోలి, తుదకుఁ ద । జ్జలముఁ బాసి,
గాలిఁ బీల్చుచు, జపతపో । లీలఁ బేర్చి.

గీ. ఎవని యంశంబునఁ ద్రిమూర్తు । లవతరించి,
రెవని వేదరాశియు వచి । యింపఁ జాల
దెవఁ డనంతుండు, భగవంతుఁ । డెవ్వఁడట్టి
సచ్చిదానందమూర్తి ద । ర్శనముఁ గోరి;

గీ. ఆరువేలేండ్లు తపియించి । నీరు గ్రోలె;
నేడువేలేండ్లు తపియించి । యూఁదఁ బీల్చె;
నంత నాతని మువ్వేల్పు । లరయ వచ్చి
"వరములం గోరుకొమ్మ" ని । పలుకుటయును.

గీ. సుస్థిరాత్ముఁడై స్వంతయు । సాస్థ లేక
అస్థిమాత్రుఁడై నిశ్చలుఁ । డై, తపించుఁ
గాని యాలింప, డంత నా । కాశవాణి
ఎలమిఁ గర్ణంబులం జొచ్చి । యెఱుకపరచె;

చ. పులకితగాత్రుఁడై, వినయ । భూషితుఁడై, కనుదోయి విచ్చి, వే
ల్పులు భవదీయపాదముల । పొంక మెఱుంగుడు రన్యులెన్నఁడున్
దలఁపగలేరు దేవ! సుఖ । దాయక! వందిత దేవనాయకా!
బలినుత! భక్తలోక పరి । పాలక! పాలిత దైత్యబాలకా!

గీ. యతికులాంభోజ దినరాజ! । నత బిడౌజ!
ఆశ్రితామరవృక్ష! భ । క్తాంగరక్ష!
వరము లొసఁగఁగ దయఁగల । వాఁడవేని
నాదు కోరిక నీడేర్ప । రాదె దేవ?

గీ. ఏ స్వరూపంబు భక్తుని । హృదయమందు
సంతతము రాజిలుచునుండు । సగుణమనఁగ
నిర్గుణమనంగ నెయ్యది । నెగడుచుండు
వేదసన్నుత మెయ్యది । వేదవేద్య.

గీ. అనఘ మానస మానస । హంస మెద్ది
అవ్యయంబెద్ది చూడ న । నంత మెద్ది
దేని మానులు దర్శింప । దేవులాడు
చుందు రా రూపుఁ జూపు మా । నందమూర్తి.

చ. అనవుకు భూపతింగని ద। యానిధి విష్ణువు భక్తవత్సలుం
డనఘుఁడు నీలనీరద శు। భాంగుఁడు శారద చంద్రమండలా
ననుఁడు విశాల నేత్రుఁడు జ। నార్దనుఁ డంబుజనాభుఁ డచ్యుతుం
డనుపమమై యనంతమగు। నవ్యయరూపముఁ జూపె నత్తఱిన్.

గీ. మకరకుండల భూషు నా। మ్నాయ భాషుఁ
జిత్కళోల్లాసుఁ బీత కౌ। శేయవాసుఁ
గుందకోరక రదనుఁ బూ। ర్ణేందువదను
శ్రీశు నవినాశు ననుపమ। కేశ పాశు.

గీ. దంపతులుచూచి యాశ్చర్య। తరళితాత్మ
లై "నమోవాసుదేవాయ" । యనుచు మ్రొక్కి
రతివ! వారల హృదయంబు। లళులఁబోలి
అతని చరణాబ్జ మకరంద। మాస్వదించె.

గీ. వాణి, కల్మిపూఁబోణి శ। ర్వాణి వీవు
నేమహాశక్తిచే సృజి। యింపఁబడిరి ?
ఏ సతీదృష్టికిన్ సర్వ। సృష్టియలరు
నమ్మహామాయ యాతని। యండనుండె.

క. ఇరువురు దద్రూపముఁ గని
పరవశులై మ్రొక్కిరతని। పాదద్వయికిన్
గరుణాభరణుండగు న
ప్పరమేశుఁడు లేవనెత్తె। వారల నెలమిన్.

క. "వరములఁ గోరుఁ డొసంగెద
నరుదా? మీకీయకుండ। నరుగం గలనా ?
నరవర!" యని పలికిన య
న్నరహరికి నమస్కరించి। నరపతి యొనియెన్.

సీ. "భవదీయ వరపాద । పద్మంబులం జూచు
కంటెను భాగ్యంబు । గలదె మాకు?
అవధరింపుము దేవ! । యభిలషింపఁగ నొండు
వాంఛ యుండుంగాక । ప్రాప్తమగునె;
శరణాగతత్రాణ! । కరుణింపఁ గలవాఁడ
వింక మాకోర్కె లీ । డేఱకున్నె?
వరదాన విఖ్యాతిఁ । బడసిన దైవంబ
వేము కోరిన దాని । నీయ లేవె?
గీ. కల్ప వృక్షంబు వీక్షించి । కలిమిఁ గోరు
పేద చందాన నిన్నొండు । వేఁడుకొందు
మెన్నటికినైన నినుఁబోలు । చిన్నవానిఁ
బడసినం జాలుఁ బున్నెంబు । పండుఁగాదె?
మ. అనినన్ జేనికి విష్ణువిట్లనియెః- "న । ట్లౌఁగాక యీ సృష్టిలో
ననుఁ బోలంగలవాఁడు లేఁడు, విను మై । నన్ నేను పుత్త్రుండనై
జనియింతున్ భవదీయ గర్భమున, నీ । సందేహ మింకేటికో
యనఘా!" యంచుఁ దదీయ భార్యఁగని "నీ । వర్థింపుమెద్దాని నేన్."
చ. అనవిని యామె యిట్లనియెః- । "నంబుజనాభ! మదీయభర్త కో
రినయది స్వల్పమయ్యును వ । రించెద; నయ్యది యట్టు లుండఁగా
వినుము మఱొండు కోరిక ల । భింపఁగఁ జేసెదనంటి; బ్రహ్మకున్
జనకుఁడవే మొసంగుటకుఁ । జాలవు? భక్తహితార్థనారయన్.
శా. అంతర్యామివి, లోకనాయకుఁడ వీ । వాద్యంత శూన్యుండ వ
శ్రాంతంబున్ నినుఁగొల్చువారలకు వాం । ఛా సిద్ధి లేకున్నె? శ్రీ
కాంతా నాకు లభింపఁ గోరెదను లో । కస్తుత్య వైరాగ్యమున్
స్వాంతంబందున యుష్మదీయ పదసే । వాసక్తియున్ భక్తియున్.

క. అన విని హరి యశ్లాఁగా
కని మిక్కిలి సంతసించి । యాపెన్ బొగడెన్ ?
మను భూపతి శ్రీపతిఁ గని
"అనఘా! నా విన్నపంబు । నాలింపు దయన్.

క. జలముం బాసిన మీనము
జలజేక్షణ యెట్లు బ్రతుకఁ । జాలును చెపుమా ?
తలపోయఁగ నా జీవం
బలరునె నినుఁగూడకున్న । నఖిలాత్మ హరీ !

ఉ. నావుడు మాధవుండు, "నర । నాయక ? యింత విచార మేటికిన్?
ఈవనినట్లయౌను; సుఖ । యింపఁగఁ దొల్త సురేంద్రు సీమకుం
బోవలె, నచ్చటన్ సకల । భోగములన్ గొనవచ్చు; నాపయిన్
భూవరమౌళివై వసుధఁ । బుట్టెద వేలికవై యయోధ్యకున్.

ఉ. ఏ నరరూపముం గని మ । హిన్ జనియించెద భూవరా! భవ
త్సూనుఁడనై, మదంశమునఁ । దోచిన వారలు మత్సహోదరుల్;
కానల సంచరించి, జన । కంటకులన్ వధియించి, వేల్పులన్
మానులఁ బ్రోచెదన్ సకల । మానవులౌనని సన్నుతింపగన్.

క. మచ్చరిత మాలకించిన
సచ్చరితులు మోక్షమొందఁ । జాలుదు రనఘా !
హెచ్చిన భక్తిన్ నన్నున్
మెచ్చిన వెన్నాడు వాఁడ । నీశ విధానన్.

గీ. భక్తులను ఘోర సంసార । వార్ధినుండి
నేఁ దరింపఁగఁ జేసెద । నిర్మలాత్మ !
ఇన్మహామాయ సీతయై । యిల జనించు;
ననుచు వచియించి మాధవుం । డంతరించె.

# బాలకాండము

క. అమ్మాడ్కి నంతరించిన
అమ్మాధవు సన్నుతించి । రైశ్వర్యమునన్;
బిమ్మట దంపతు లిరువురు
నిమ్మహి నివసించి యెలమి । నేగిరి దివికిన్.

## ప్రతాప భానుని చరిత్రము

క. శ్రీరాముఁ డవతరింపఁగఁ,
క్రూరాత్ముల సంహరింప, । ఘోరాటవులన్
బోరాము లనుభవింపఁగ,
వోరామ! ముఖ్యంబు హేతు । వున్నది వినుమా.

గీ. కేకయ దేశాధీశుఁడు
లోకైక బలుండు, ధర్మ । లోలుఁడరి దురా
లోకుఁడు సుశ్లోకుఁడు, ల
క్ష్మీకరుఁడన నొప్పు సత్య । కేతువు వఱలున్.

క. గుణధాము లతని పుత్త్రులు
రణభీములు, వారిలోన । రాజిల్లు నభో
మణి నాఁ బ్రతాప భాను
డణుమధ్యా! రాజ్యమేలె । నతఁడతి బలుఁడై.

క. నానారిపు భూజానుల
సేనాతామిస్రపటలిఁ । జెదరం జేయం
గా నొప్పు ప్రతాపము గల
భానుండగు నా ప్రతాప । భానుఁడబలా!

క. అరయన్ రెండవ పుత్త్రుం
డరి మర్దనుఁ డాతఁ డహహ । యరిమర్దనుఁ డీ

యిరువురు సోదరు లిరవుగ
ధరణిం బాలించి రతుల । ధర్మనిరూఢిన్.

క. రాగాభివృద్ధిఁ గోరరు
భోగానుభవాభిలాషఁ । బొందరు, ప్రజలన్
రోగార్తుల విడనాడరు
త్యాగార్జిత కీర్తిధనులు । తరుణీ! వారల్.

క. భూషింప రధిక వేషుల,
ద్వేషింపరు పరుల సిరుల, । వికటంబున కేన్
భాషింప రనృత భాషల,
ఘోషింపరు తాల్మిఁదూలి । ఘోరాపదలన్.

ఉ. పాపమనంగ నెట్టిదియొ । స్వప్నమునందు నెఱుంగ రెట్టి సం
తాపము లేనివారు, సత । తంబును వైదిక ధర్మ కర్మ ని
ష్ఠాపరు లెల్లభంగులఁ బ్ర । జల్; పరికింపఁ బ్రతాపభాను ధా
త్రీపతిఁ బోలువారు గల । రే? త్రిజగన్నుత రాజకోటిలో.

గీ. రాజనీతికి శుక్రుండు, । రాజ్యహితుఁడు,
పాడిగలవాఁడు; ప్రజలఁ గా । పాడు వాఁడు;
ధర్మరుచి యను సచివుండు, । ధర్మపరుఁడు,
ఆ ప్రతాప భానుని మంత్రి । యబ్జవదన!

ఉ. భండనసీమ కేగి, బల । వద్రిపుకోటి జయింపఁజాలు త
మ్ముండు విధేయుఁడై తనకు । పొంత నెయుండఁగ, రాజనీతికిన్
మండనుఁడైన ధర్మరుచి । మంత్రిపరుండయి చాతురీ ధురీ
ణుండయియుండ, నానృపుని । నోర్వఁగ నోపునె యెట్టిభూపుఁడున్

శా. సప్తార్చిప్రతిమాన బాణ వితతిన్ । సైరింపఁగా శక్యమే?
సప్తాశ్వుండు ప్రతాప భానుఁడగుచున్ । తూర్ణకాంతు లగ్గింపఁగా

సప్తద్వీపములన్ జయించి, వసుధన్ । శాసించె నాతండు, సం
ప్రాప్తశ్రీజిత యక్షనాయకుఁడనన్ । రాకేందు బింబాననా!

క. ధర్మార్థ కామ మోక్షము
లర్మిలిఁ దనుగొల్చు వార । లందఱుఁ బడయన్,
శర్మము వర్ధిల్లఁగ, రిపు
మర్మ స్పృక్కర్మమెఱిఁగి । క్ష్మావిభుఁ డేలెన్.

గీ. అతని దండనీతిం బొంది । యమర ధేను
వనగ నొప్పారె భూదేవి । వనజగంధి!
ఈతిబాధలఁ గలనైన । నెఱుఁగ రాదు;
అతుల సౌఖ్యంబులం గాంచి । రఖిల జనులు.

క. వాపీ కూప తటాకము
లేపారఁగఁ, బుష్పవనము । లెల్లెడఁ గ్రాలన్,
స్థాపించె దేవ గృహముల
క్ష్మాపాలుఁడు పాపమేఘ । ఝంఝానిలుఁడై.

క. సత్రంబుల, బహుపుణ్య
క్షేత్రంబులఁ బాదుకొల్పి, । క్షేమంకరుఁడై
క్షాత్రంబు రహింప నహో
రాత్రంబు నతండు ప్రోచుఁ । బ్రజలన్ గరుణన్.

క. ఎప్పుడుఁ ద్రికరణశుద్ధిగఁ
దప్పక కార్యంబొనర్చి, । తత్ఫలము నతం
డప్పనము సేయు శ్రీహరి
కొప్పగ నిష్కామకర్మ । యోగి యనంగన్.

.. ప్రతాప భానుడు వేటకేగుట

ఉ. పాటలగంధి ! యాత్మ పరి । వారముతోడ, హయాధిరూఢుఁడై,
హాటకపుంఖ బాణనిచ । యంబు, శరాసనమున్ ధరించి, యా
ఖేటక వేషమూని, పరి । కించి వనాటులు త్రోవఁజూప, విం
ధ్యాటవికేగె నొక్కసమ । యంబున ఱేఁడు మృగాంతకుండనన్.

క. వేఁటరియై యప్పాటరి
వ్రేటునకున్ వేనవేలు । మృగములు గూలన్
వేఁటాడి మాటలాడుచు
వాటంబగు బాట మగిడి । వచ్చుచునుండన్.

క. ఱిక్కించి చెవుల, గుఱ్ఱపు
డెక్కల సడి నాలకించి, । డీకొనఁగ నొడల్
నిక్కించి, ఘుర్ఘురించుచు
నొక్కెడఁ బొదప్రక్కనొక్క । యొంటరి చెలఁగెన్.

ఉ. అవ్వని నల్లగొండ నడ । యాడఁగ నేర్చెననంగ నేపుమై
గ్రొవ్వి చరించు పంది నృప । కుంజరుఁడుంగని యార్చి కెప్పునన్
జివ్వన గుఱ్ఱముం గదియఁ । జేసి శరాసనమెక్కువెట్టి తా
ఱివ్వన బాణమున్ విడిచె । ఱెప్పలవైచిన యంత మాత్రలో.

క. ముప్పెంచి యవ్వరాహము
మెప్పించుచు వేఁటకాండ్ర । మెడవంచి వడిన్
గుప్పించి యెగసి గుబిలోఁ
దప్పించినయట్లు తూపుఁ । దప్పించుకొనెన్.

క. అదలఁడు పాఱినపందికిఁ
గదలఁడు లో ఱిచ్చపాటు । గడలుకొనంగన్

మెదలఁడు పంతముఁ గుంతము
వదలఁడు ధరణీవిభుఁడు । పర్వతపుత్రీ!

క. ఒంటరికై భూపాలుం
డొంటరియై యేగి యేగి । యొక కొండ దరిన్
గంటక మయ కాంతారము
నంటుకొనెన్ ద్రోవఁదప్పి । యలసెన్ సొలసెన్.

క. ఈపాటి యేకలంబును
భూపాలుఁడు చంపలేక । పోయెను; విన మ
ద్గోపాలుఁడు శ్రీపాలుఁడు
గాపాడినఁ జంపువాఁడుఁ । గలఁడే? లలనా!

క. అడలెన్ గుఱ్ఱము వడికిన్
బడలెన్ బెనుదప్పివలన । బలిమియు మేనన్
సడలెన్, వృక్షచ్ఛాయకు
వెడలెన్ భూనాయకుండు । విశ్రాంతిఁ గొనన్.

క. "తక్కితి వివేక మంతయు
నక్కట యాఖేటమనెడు । వ్యసనంబునకున్
జిక్కితినని" భూపాలుం
డొక్కించుక విశ్రమించి । యూఱటఁ గాంచెన్.

ఉ. ఊరటఁగాంచి లేచి నర । పోత్తముఁ డెంతయుఁ దల్లడిల్లి, నే
వీటిఁడినైతిఁ బుదికి వి । వేకముఁ దక్కితిఁ ద్రోవఁ దప్పితిన్;
ఆఱడిపోకకుఁ దగిన । యారట మొందితి నెంతతోలినన్
బాలుని వారువంబు పరి । వారముఁ జేర నుపాయమున్నదే?

మ. తలఁగెన్ సత్తువఁ, దప్పితిన్ దెలివుఁ దు । ద్దాహంబుచే నోరు పా
పడెఁ, బ్రొక్కటఁ దూలి సోలెఁ దురగం । బారాటముం బాఱఁగన్

దెఱఁగింకెయ్యది ? నాలుకం దడుపఁగా । నీరంబు లేదయ్యె, నన్
దతిమెన్ దుర్విధి భీకరాటవికి భూ । దారాపదేశంబునన్.

చ. కుడిపితి బ్రాహ్మణోత్తముల । కుం గడుపార నిదాఘవేళలన్
దడిపితి సర్వజీవముల । నాలుకలన్ విమలాంబుధారలన్;
బుడిసెడు నీరు చేకురదు ? । మున్నొనరించిన నోములన్నియున్
జెడి నశియించెనే? యడవిఁ । జిక్కితిఁ బొక్కితిఁ జేవఁదక్కితిన్.

క. కడకివ్వడుపునఁ గడుఁ గడుఁ
జిడిముడిపడి పొక్కి మోము । చిటచిట లాడన్
దడఁబడెడు వారువంబును
నడపించుచు వెడలె భూమి । నాయకుఁ డడవిన్.

క. కోరింద డొంకలంబడి
చేరువఁగల మలల దాటి । చిట్టడవులలో
వారువము బుజ్జగించుచుఁ
గోరిక లీడేఱ నొక్క । కోనం గాంచెన్.

గీ. కాననలోఁ గానరాని య । క్కోన లోన
నాశ్రమంబొండు నిర్మించి । విశ్రమించు
కపట మునివేషధారినిఁ । గాంచె నతఁడు.
వెలఁది ! రాముని కీసుఁ ద । ప్పింప వశమె ?

కపట ముని ప్రతాపభానుని మోసపుచ్చుట

మ. మును పెవ్వాఁడు ప్రతాపభానునృపుతోఁ । బోరాడి యయ్యాహవం
బున సర్వస్వముఁ గోలుపోయె వినుమ । భూపాలుఁ డీకోనలో
మునివేషంబున దాఁగియుండె నిపుడీ । భూపాలుఁ డీచొప్పటికిన్
జనుదేరంగని పోల్చి లోనలరె నీ । ర్ష్యాగ్రస్తుఁడై మానినీ !

గీ. ఆఁకటికి దప్పికిన్ డస్సి । వీఁక చెడిన
భూపుఁ డాతని నిక్కంపు । మునిగ నెంచెఁ

గపట ముని వాసికిన్ దటా । కంబుఁ జూపె,
వారువముతోడ నాతండు । వారిఁజొచ్చి;

గీ. స్నానముంజేసి విమలాంబు । పానమునను
శ్రమ నివారించి వార్చి యా । శ్రమముఁ జేరెఁ
గందమూలాదులన్ దన్ని । కపటమౌని
సాంధ్యసమయంబునన్ వాని । సరస కేగి.

ఉ. "పువ్విలుకాని నీ చెలువు । పొమ్మనుఁ గిమ్మనసీయ దక్కటా !
ఎవ్వఁడవయ్య? యొంటిమెయి । నివ్వన సీమఁ జరింప నేటికి?
జవ్వన మిమ్ముగావళులఁ । జాపునిమిత్తము వెచ్చ బెట్టెదే ?
ఇవ్విధినున్న నిన్నుఁగని । యొంతయుఁ గుందెద నేమిసేయుదున్.

క. ఇందుఁడ వౌదువా ? లేక యు
పేంద్రుఁడవౌదువా ? కళంక । హీనుఁడవై యా
చందుని నిరసించు యశ
స్సాంద్రుఁడ వౌద" నిన రాజ । చంద్రుఁడు నగుచున్.

ఉ. "ఇంద్రుఁడఁగాను వొడియును । పేంద్రుఁడఁగాను ప్రతాపభాను రా
జేంద్రుని మంత్రినౌదు వినుఁ । డేఁ జనుదెంచితి వేఁటకంచు ని
స్తంద్రమదంబునన్; బధముఁ । దప్పితిఁ దప్పికిఁజిక్కి పొక్కితిన్
సాంద్రవనాంతభాగముల । సంచరియించితి మిమ్ముఁ గాంచితిన్.

గీ. అనిన విని ధంభముని యిట్టు । లతని కనియెఁ
"గటిక చీకటికిందోడు । గాలివాన
దుర్గమంబు వనంబు నీ । దుర్గసీమ
చాల దవ్వగనుండు ని । చ్చటికి ననఘ.

గీ. ఒక్క తృటిలోన వేఁగుఁబరి । తూష్యమునను
లేచిపోవచ్చు నందాక । వేచియుండు

మంధకార బంధురమైన । యడవిఁ బట్టి
ఊరికేగుదె ? డెబ్బది । యోజనములు.

క. వల్లెయని భూమిపాలుం
డల్లన గుఱ్ఱంబుఁ గట్టి । యవనిజమునకున్
మెల్లఁగ నిట్లనె " నోముని
వల్లభ! నను మీసుతునిగ । భావింపఁ దగున్

క. మీమోముఁ జూచినంతన
నామానసమందు జ్ఞాన । నయనము దోఁచెన్
నాను పవిత్రాక్షర శు
ద్ధామృత మేనాస్వదింతు । నానతి యీరే?"

క. అహాహా !! ప్రతాప భానుఁడు
కుహనా మునిఁ జూచి పోల్చు । కొనఁజాలండా
మహిపాలు నాతఁ డెఱిఁగెను
తుహినాద్రిజ! యెఱుఁగరాదు । ద్రోహుల మతముల్.

క. ఆరాజవర్యుఁ గనుఁగొని
వైరంబును గప్పిపుచ్చి, । వాత్సల్యంబే
పారఁగ, నమ్ముని మృదు వా
గ్ధోరణితో నిట్టులనియెఁ । దోయజనేత్రా !

క. "నను భిక్షుకుఁ డంద్రు జనుల్
జనసన్నుత! నాకు ధనము, । సదనముఁగలదే ?
మునివృత్తి నివ్వనంబున
దినములు వెచ్చించుచుందు । దెప్పర మయ్యున్."

చ. అనవుడు భూపుఁడిట్లనుః- మ । హా మహిమంబును గప్పిపుచ్చ ని
వ్వనమున సంచరింతు రొక । పాటి జటింబలె, నార !! సత్తపో

ధనులరు, స్వార్థముఁ న్విడిచి । ధన్యత, గాంచినవారు, మిమ్ములన్
గనుఁగొన నొప్పదే నిపురుఁ । గప్పిన నిప్పుగ సంయమీశ్వరా.

క. నిర్ధనియు, శాంతమూర్తియు,
స్వార్థత్యాగియు, సకలజ । నావనుఁడును, మో
క్షార్థులు, పావనులని వే
దార్థము నిగదించుఁగాదె । యనఘ! మునీంద్రా!

చ. శివుఁడవో! పద్మగర్భుఁడవో! । శ్రీహరివో? పరికింపఁజాల నో
పవిమలచిత్త! నీపద । పద్మములంబడి సన్నుతింతు, ఘో
ర వనము నందు మత్తనువుఁ । బ్రాణముఁ బ్రోవఁగవచ్చినట్టియో
వెవఁడవనుగ్రహింపఁగద । వే? తలవాంచి నమస్కరించెదన్.

క. అనవిని, కుహనాముని నె
మ్మనమునఁ గడు సంతసించి, । క్ష్మావిభువర్యుం
గని యిట్లను:- "వినుమనఘా!
వనమున నివసించువాఁడ । వైరాగ్యమునన్.

గీ. జప తపోవన సీమకు । జ్వాల బోలు
లోకమాన్యత మనులము । మాకుఁ దగదు;
జనము నీక్షింపకుండ ని । వ్వనమునందు
గాలముంబుచ్చుచుంద, ని । క్కంబు వినుము.

గీ. కపట సుందర వేషంబుఁ । గాంచినంతఁ
జతురుఁడున్ వంచితుండగు । జనవరేణ్య!
మధురవాక్కుల నాలించు । మాత్రమునను
మానవుఁడు విశ్వసించిన । హానియొదవు.

క. జనసంబాధముఁ బాసితి
వనమున నేకాకి నగుచుఁ । బరతత్త్వా న

క్తిని ముముక్షుద్విజులఁ గడపెద;
ననఘా! బ్రహ్మంబుఁ దక్క ♦ నన్యముఁ దలఁపన్.

క. సర్వజ్ఞుఁడు భగవంతుం
డుర్విం గల భక్తకోటి ♦ కొసఁగును ఫలమున్;
ఉర్వీశ వినుత! యెపుడున్
గర్వింపఁగరాదు చూవె ♦ జ్ఞానంబునకున్.

క. తలఁపున భక్తి శ్రద్ధలు
వెలయఁగ నాయందుఁ బ్రీతి ♦ విశ్వాసములన్
గలవాఁడవు, నినుఁగాదను
పులు మానిసి కెల్లు కీడు ♦ మూఁడక యుండున్."

చ. పొలఁతి! పరితాప భాను నృప ♦ పుంగవుఁడింటికి వచ్చి నొంటిమై
నలువురఁజిక్కినంచుఁ గుహ ♦ నాముని యిట్టివిధిముచ్చటించి లో
నలరుచు "నన్ను నేకతనుఁ ♦ డందురు మానులు, నిక్కమింతయున్
దెలిపితి" నన్న భూవరుఁడు ♦ నెమ్మది నమ్మికఁగల్గి యిట్లనున్.

చ. నను భవదీయ దాసునిగ ♦ నమ్మి కృతార్థునిఁ జేయరాదె? స
జ్జననుతచర్య! యేకతను ♦ శబ్దములంగల భావమెట్టిదో
వినియెద నానతిం"డనిన ♦ "వెంగలి యీ నరనాథ పుంగవుం"
డనుచుఁ దలంచి యిట్లనియె ♦ నక్కపటాత్ముఁడు నక్కకైవడిన్.

క. సృష్టికి మును నేనీ తను
యష్టిం గైకొంటి నిట్లు ♦ లలరుచు నుంటిన్;
నష్టంబుఁ బొందనెవ్వఁడు;
స్పష్టంబుగఁ జెప్పిననాఁడ ♦ భష్టుఁడ వగుటన్.

గీ. తనువు విడనాడ, రెండవ ♦ తనువుఁ బొంద,
నేక తను నామ మిట్టివిధి ♦ నారుఁ జెల్లు

దీన నాశ్చర్యముం బొంద నౌనె? రాజ!
తపమునకుఁ గాని కార్యమే తలఁపు గలదె?

గీ. బ్రహ్మ సృష్టింపఁ జాలెఁ ద పంబు వలనఁ
దపమునన్ శౌరి పాలింప దక్షుఁడయ్యె,
భర్గుఁడు హరింపఁజాలెఁ ద పంబు కలిమిఁ,
గార్యసిద్ధికి మూలంబు ఘనతపంబు."

గీ. పొలఁతి! యీరీతి నమ్మికఁ బుట్టఁ బలికి;
తనదు మాహాత్మ్యముం దెల్పు కొనఁ దలంచి
నట్లు నటియించి, దరహాస మంకురింప,
నృపవరుం జూచి వెండియు నిట్టులనియె.

మ. "అవురా! నీవు ప్రతాపభానుఁడవుగా వా చెప్పుమా వాని మం
త్రివె? యుద్దండబలుండవౌదు, సకల ద్వీపంబులం గెల్చి నాఁ
డవు; సాధారణ రాజమాత్రుఁడవె? స్ప ష్టంబయ్యెడున్ దివ్యదృ
ష్టి విలోకించిన సర్వమున్ మునులకున్ శీఘ్రంబుగన్ భూవరా!

క. అరిమర్దనుఁ డరిమర్దనుఁ
డరయఁగ నీయనుఁగుదమ్ముఁ డలరునె సుఖియై?
వరరాజ నీతిఁ గఱచిన
స్థిరబుద్ధికి ధర్మరుచికి క్షేమమె చెపుమా?

క. నీతండ్రి నిత్య సత్య ని
కేతనుఁడనఁ నొప్పు సత్య కేతుఁడు గాఁడా?
బ్రాఁతియె? నీ కపటేంగిత
చాతుర్యము, నే గ్రహింపఁ జాలనె? చెపుమా.

గీ. అనృతము వచింపఁ దగదైనఁ గినియఁ జూవె
రాజులకు నొప్పు; నయ్యది రాజ నీతి;

మండలాధిపు లొక్కెడ మఱుఁగు పఱచి
మాటలాడుటయున్ లెస్స ఘన్నతలేంద్ర!

క. గురుకృప వలన లభించిన
వరదృష్టిం జూడ నీదు వైనము దెలిసెన్;
వర మొండు వేఁడు మొసఁగెద
నరనాయక! సన్నుత సుర నాయక! వినుమా."

క. అనవుడు భూవరుఁ డిట్లను
వినయంబున:—"రాజులకు లభింపక యున్నే
మునులను సందర్శించిన
మునుకొని ధర్మార్థ కామ మోక్షము లనఘా!

చ. జననుత! నీవు నాయెడఁ బ్ర సన్నుఁడవై వర మొండు వేఁడు మి
త్తునని వచించి తాత్మఁ గృప దోపఁగ; ధన్యుడనైతి, సత్తపో
ధనుల కృపావిశేషమున ధన్యతఁ గాంచని వాఁ డెవండు? నీ
నెనరున శోకముం దొలఁగి నేను సుఖించెద నెల్లభంగులన్.

చ. సరసిజనేత్రలం దనుపు శక్తియు, రక్తియు, రూపమున్, జరా
మరణ విహీనదేహ, మస మాన పరాక్రమ విక్రమంబులున్,
అరులు జయింపరాని మహిమాతిశయంబును, దైవభక్తియున్
స్థిరమగు రాజ్యలక్ష్మియును జేకుర నాకు ననుగ్రహింపవే?"

చ. అనవుడు దంభమూని, దర హాసము మోమునఁ దాండవింప ని
ట్లనియెను "నీవు కోరినటు లౌ; జను లెల్లఱు నీదు పాద సే
వనమును గోరుచుందురొక బ్రాహ్మణబృందము దక్క; వారు స
న్మనులకుఁ దుల్యులై జప తపో మహిమన్ విడనాడ రెన్నఁడున్.

గీ. బాడబుల కోప మత్యుగ్ర బాడబంబు
వారి నెదిరించి మనలేఁడు భర్గుఁడైన;

బ్రాహ్మణులు నీకు వశులైన । వనజభవుఁడు
నీదు పదదాసుఁడై యుండు । నృపవరేణ్య !

గీ. బ్రాహ్మణుల నీవు పూజించు । వాఁడవేని
వైభవంబున నీకు లోపంబు లేదు ;
బ్రాహ్మణుల నీవు ద్వేషించు । వాఁడ వేని
హాని చేకూరుఁ, దప్పింప । నజుని తరమె ?

క. విని భూనాయకుఁ డెంతయు
మనమున సంతోష మొంది । మౌనిని భక్తిన్
వినుతించి మ్రొక్కి నిల్చినఁ
గని వెండియు నాతఁడిట్లు । క్ష్మాపతి కనియెన్.

క. "మన సమ్మేళన మేరికి
జననాయక ! తెలియరాదు । సత్యము వినుమా,
నిను శపియించెదఁ దెలిసిన"
ననవుడు విని భూమినాథుఁ । డత్యాతురుఁడై.

గీ. మౌని పాదాబ్జములకు న । మస్కరించి
"నీమనానతిఁ దలఁదాల్చి । నిను భజింతు,
ననఘ! పావనమైన బ్రా । హ్మణ కృపా క
టాక్ష మేరీతి లభియించు? । నానతిమ్ము."

గీ. అనిన విని మౌని హసియించి । కనుల మోడ్చి ;
ఆత్మ ధ్యానించు రీతియు । నభినయించి,
"లోకమున నుపాయంబులు । లేక యున్నె
కష్ట సాధ్యంబు లగుఁగాక । క్ష్మాతలేంద్ర !

క. సదుపాయ మొండు గలదది
మదధీనమ మైన నేమి, । మనుజులఁ జూడం

గద; వన సీమలఁ దక్కన్
దదితరములఁ జూడ నను వ్ర । తంబును గొంటిన్."

క. విని భూమి పాలుఁ "డక్కట
మునిచంద్రుఁడు రాకయున్న । మోసమురాదే"
అని లోనఁ దలఁచి యత్తఱి
వినయానతుఁడై యొకింత । వినుతించి యనున్.

సీ. "సకల సంపదలకు । స్థానమౌ కుధరంబు
తనయౌదలఁ దృణంబుఁ । దాల్ప లేదె ?
రత్నాకర ఖ్యాతి । రాజిల్లు నంభోధి
హీనమౌ ఫేనంబుఁ । బూన లేదె ?
రత్నగర్భ యనంగఁ । బ్రఖ్యాతిఁ గల భూమి
యనిశంబు ధూళితో । నలర లేదె ?
అమృతాంశు ధరియించు । నలికాక్షుఁ డక్కటా !
హాలాహల జ్వాలఁ । గ్రోల లేదె ?

గీ. లోక హితులైన లోక సు । శ్లోకులెలమి
నెట్టి కష్టంబునైన స । హించు వారు ;
నీకు పదసేవకుండను । నిర్మలాత్మ !
బ్రతుకనోపుదునే? యీవు । రాకయున్న;"

ఉ. అంతట దంభమౌని "భళి । రా! నృపవర్యుఁడు చిక్కెనంచు" లో
సంతసమొంది యిట్లనియె:-"భూప! ధ్రువంబుగ నీదు కార్యమున్
సాంతముఁ జేయనోపుదు, గృ । తార్థుఁడవయ్యెదు, సందియంబు లే
దింతకు నాదుభక్తునకు । నేమియొనర్పఁ దపోబలంబునన్.

చ. ఇతరు లెఱుంగలేని యటు । లేనొనరించెద వంటకంబులన్ ;
క్షితిసురవర్యులెల్లఱు భు । జించిన నిన్ గడు మెచ్చుకొండ్రు; సం

తతమును లక్షభూసురుల, ౹ దానమునన్ దనియింప నోపుదేన్,
క్షితిప! వచింపనేటికి, వ ౹ చింపఁగరాని ఫలంబుచేకురున్.

చ. ధరణిప! నీపురోహితుని ౹ దాచెదనాతఁడు తత్క్షణంబునన్
విరతినిఁ బొందనిమ్మతని ౹ వేసమునన్ జనుదెంతు; నింతకున్
విరసముగాదె యిట్టి ముని ౹ వేసమునన్ జనుదెంతునేని? మ
ద్గురుతరశక్తియున్ దపము ౹ ధూర్జటినైన జయింపకుండునే?

క. కడచినది చాలరేయి, భూ ౹ కాంత! యింకఁ
బండుకొనఁబొమ్ము; మత్తపో ౹ బలము కలిమిఁ
జెక్కు చెదరక పురమును ౹ జేరఁగలవు;
మూడు దినములకే నిన్నుఁ ౹ జూడవత్తు."

క. అనవిని మునిపలుకుల న
మ్మనుజాధిపుఁ డాత్మనలరి ౹ మహిఁ బండుకొనెన్;
మునికెట్లు నిద్రవచ్చుఁ?
దనమనమునఁ గార్యరీతిఁ ౹ దలఁచుచు నుండన్.

కాలకేతువు

గీ. శ్రితజనస్తోమ దుఃఖాబ్ధి ౹ సేతు వనఁగ,
భూతలాధీశ కులధూమ ౹ కేతు వనఁగ,
దనుజ సంచయ బలహేతు ౹ ధాతువనఁగ,
గెరలు నొకరాక్షసుఁడు కాల ౹ కేతువనఁగ.

ఉ. శంబరవిద్యయందు నెఱ ౹ జాణఁడు, జాణెత వానిభార్య, స్వ
ర్ణాంబరుఁజీరికింగొనని ౹ యట్టి బలుల్ పదిమంది సోదరుల్,
పంచినవేడ్క వానిపద ౹ పద్మములన్ బడియుండు పుత్త్రికల్
డంబుగ నూర్ధ్వసుంద్రుడు, జగ ౹ డంబునకున్ వెనుదీయరెన్నఁడున్.

గీ. దురమునన్ వీనిసుతులు, సో ౹ దరులు, భార్య,
ఆ పరితాప భానుని ప్రతా ౹ పాగ్ని కకట !!

మిహుతలంబలె మడసిరి । పడఁతి మిన్న !
కడకు నిక్కాల కేతు వా । క్యంబు మిగిలె.

మ. తరుణీ! వీఁడె ప్రతాపభానునృపుఁ గాం । తారంబునన్ జూచి, సూ
కర రూపంబున మోసపుచ్చె; మునికిన్ । గారాపు నెయ్యుండు; సం
గర రంగంబున వీరలిర్వురును మున్ । ధూమ్రకాంతుచే నోడి, భీ
కర కాంతారముఁ జొచ్చి రెమ్మెయిఁ బ్రతీ । కారంబుఁ గావింపగన్.

క. ప్రతిదినము రాత్రి సఖునకు
క్షితిపాలుని చర్యలెల్లఁ । జెప్పుచు నుండున్ ;
అతివా! ఎప్పటి యట్టుల
నతనికిఁ దెలుపంగవచ్చె । నతఁడ త్తఱికిన్.

ఉ. వచ్చినవాని మౌని కని । పజ్జకు వేచని పల్కరించి “ యీ
విచ్చటి కేగుదేర కెట । కేగెదవో యని సంశయించితిన్ ;
మెచ్చితి సంగడీఁడ! నిను । మించినవాఁ డెవఁ”డంచు నవ్వుచున్
గ్రుచ్చి కవుంగలించి నృప । కుంజరుఁ జూపి వచించె సర్వమున్.

క. యావద్వృత్తాంతము విని
దేవారి ప్రమోదమొంది । తేఁకువతో మా
యా విద్యా పాటవమున
నైవశ్యముఁ బొందఁ జేసె । వసుధాధీశున్.

క. “ఔషధము లేకయే మన । వ్యాధి కుదురు
తెరవుఁ జూపించి విధి మన । బనుపుఁ గొనియె,
నితని సకుటుంబముగ నశి । యింపఁ జేసి
మగిడి వచ్చెద”నని పల్కి । మౌనిఁ బాసి.

రాక్షసుఁడు ప్రతాపభానుని నంతిపురముం జేర్చుట

గీ. వాహనము తోడ నృపుఁ బట్టి । బయలు వెడలి
పురమునకు నేగి, నృపు నంతి । పురముఁ జేర్చి ;

అశ్వమును బట్టి మందుర । యందుఁ గట్టి
నృప పురోహితు నింటికి । నిర్గమించి;

సీ. ఆపురోహితుఁ గందర । యందు డాచి
వానియాకృతిఁ గొని వాఁడు । పంపుకొనియె
జనవిభుఁడు లేచి, వెఱఁగొంది । మునిని మెచ్చి
వారువము నెక్కి వెడియు । వనికి నేగి;

గీ. వేటకుం బోయి మగిడిన । వితవు దోప
రెండు జాములకే తెంచె । నృపవరుండు
జనము తమజేని రాకకు । సంతసించి
ఉత్సవముఁ జేసిరపుడు నే । త్రోత్సవముగ.

బ్రాహ్మణులు ప్రతాప భానుని శపించుట

గీ. తన పురోహితు వేషంబుఁ । దాల్చినట్టి
అసుర వీక్షించి మునియని । యాత్మనెంచి,
అతని యానతిఁ దలఁదాల్చి । యాక్షణంబ
అన్నదానాభిలాషియై । యవని విభుఁడు.

క. పెకు ్రరు భూసుర వర్యులఁ
దక్కక రప్పించె నీవిఁ । డనుపఁగ; నంతన్
టక్కరి రక్కసి చక్కఁగఁ
గ్రక్కునఁ గావించె వంట । కంబుల నెల్లన్.

క. గోబ్రాహ్మణ మాంసాదుల
నాబ్రాహ్మణ్యము భుజింప । నతఁడిడి నంతన్
సెబ్రి, భుజింపం దగదని
అబ్రంబుగ గగనవాణి । యాక్షేపించెన్.

గీ. బాడబులు లేచి కోపించి । బ్రాహ్మణులకు
నకట!! యపచారముం జేయు । నగునె? రాజ!
అవని సకుటుంబముగఁ బుట్టు । మసుర వగుచుఁ
గాకులముఁ జేయ నెంచితే । వ్యాకులంబు ?

క. నీకున్ నివాప మొనరుప
నో కాపురుషాధమ! విను । మొక్కండైనన్
లోకంబున శేషింపఁడు,
నీ కావర మప్పుడణఁగు । నిశ్శేషముగన్."

గీ. అని శపించిన యంత న । జ్జన విభుండు
విహ్వలుండయి మతిఁదప్పి । వెఱఁగుఁ బోలి
శూన్య దృక్కుల దిక్కులం । జూచి, చూచి,
డీలుపడి, మ్రానుపడి, నేలఁ । గూలఁ బడియె.

గీ. "ఘోరకాంతార మధ్యస్థ । వైరివలన
వంచితుండయ్యె, బ్రాహ్మణ । వర్యులార!
ఇందు నృపదోష మిసుమంత । యేని లేదు,
పాడిఁ దప్పకురే" యని । వాణి పలికె.

ఉ. "ఆఁ" యని యొంతతప్పని ధ । రామరు లెల్లను వంటయింటికిం
బోయిరి; వంటతో దనుజ । పుంగవుఁ డయ్యెడ నంతరించె; "ఛీ
ఛీ యిది యేమి మోస"మని । చింతిలి వారలు మానవేంద్రుపైఁ
బాయని కూర్మిఁ బూని మృదు । భాషల నిట్లని రుమ్మలించుచున్.

ఉ. "చెప్పఁగరాని వైశసము । చేకురె నీకు, నరేంద్ర! నీయెడన్
దప్పిసుమంత లేదయిన । దైత్యుఁడవయ్యెద వెట్టివారికేన్
దప్పదు విప్రశాపమిది । తథ్యము; సారసగర్భు వంశమం
దుప్పతిలంగలాఁడవు, బ । లోన్నతిఁ బొందఁగలాడ వింతకున్.

గీ. భస్మకరుణను వరములఁ । బడసె నీవు,
మూఁడులోకంబుల జయించు । వాఁడ వీవు
నరవరోత్తమ! వినుము; స । నత్కుమారు
వలన నీకు మోక్షంబు సం । ప్రాప్తమగుచు.

క. నీవును నీపరివారము
నో వసుధాధిప ! మునివరు । నుపదేశమునన్
గైవల్యముఁ గైకొందురు
భావుకములఁ బొందఁ గలరు । వైకుంఠమునన్.

చ. అనివచియించి భూమిసురు । లందఱు వీడ్కొని యేఁగ "రక్కసుఁ"
యని ప్రజ లెల్లరున్ గలఁగి । యవ్విధి దూఱిరనేక భంగులన్;
దనుజుఁడు రేయిఁగందరను । దాఁచిన రాజపురోహితున్ గృహం
బునను బయుండఁబెట్టి, ముని । పొంతకు నేగి హసించి యిట్లనున్.

గీ. "అహహా! సంకల్పసిద్ధుఁడ । వగుదు సఖుఁడ!
కోర్కె లీడేఱె; మనకుఁ జే । కూఱె బలిమి;"
అనిన విని మేలు మేలని । మునివరుండు
సైన్యమాయి త్తముం జేసె । సమరమునకు.

గీ. దనుజపుంగవుఁడుం దాను । దాడి వెడలి
భూవరుండుండు పురమును । ముట్టడించి
పోరి సకుటుంబముగ వైరిఁ । బొలియఁ జేసి
రకట! బ్రాహ్మణ శాపంబు । వ్యర్థమగునె ?

ఉ. కాలము దప్పి వచ్చిన, జ । గత్పతి దైవము వైరమొంచినన్
ధూళి ధరాధరంబనఁగఁ । దోఁచును, పాముగఁ బూలమాలయున్
గాలునిఁబోలుఁదండ్రి, కడ । గండ్లకు లోనగు నెట్టి సాధుపున్,
హాలహలంబుఁబోలు నమృ । తాన్నము; నేమనవచ్చు దుర్దశన్.

రావణ కుంభకర్ణ విభీషణుల జననము

చ. ఇరువది చేతులంగలిగి, । యేపగు దేహముఁగల్గి, లోక భీ
కరమగు రూపుఁదాల్చి, దశ । కంఠుఁ డనంగఁ బ్రతాపభాను భూ
వరుఁడు పులస్త్యవంశమున । బ్రాహ్మణశాపము కారణంబునన్
సురలకుఁ బ్రాణగండమయి । ఘోరవరుండయిపుట్టె భూస్థలిన్.

క. ధరణీధర కాయుండై,
అరిమర్దనుఁ డక్కటకట! । యతి బలుఁడై సో
దరుఁడై, త్రిజగజ్జన భీ
కరుఁడై జనియించెఁ గుంభ । కర్ణుం డనఁగన్.

క. వైమాత్రేయానుజుఁడై,
క్షేమంకర విష్ణుభక్త । శేఖరుఁడై, ని
ష్కాముఁడయి, విభీషణుఁడన్
నామంబున, ధర్మరుచి జ । నన మొందె భువిన్.

రావణ కుంభకర్ణ విభీషణులకు బ్రహ్మ వరములొసంగుట

గీ. నిష్ఠ దీపింప నాహార । నిద్రలుడిగి
తపముఁ గావింప వార లా । తపము నందు;
బృథివి కంపించె, నమరులు । భీతిఁ జెంది,
రంతఁ బ్రత్యక్ష మగుచుఁ । బద్మాసనుండు.

క. వరములఁ గొనుఁడన దశకం
ధరుఁడవ్విధి కిట్టులనియెఁ:- । "దాతా! నర వా
నరతతిచేఁ దక్కన్, నే
మరణంబును బొందకుండు । మఱి యెవ్వరిచే."

చ. అనవుడు నీవు కోరినటు । లౌనని నవ్వి, విరించి కుంభక
ర్ణునిఁ గని వాని క్రూరతర । రూపముఁ గాంచి "యహర్నిశంబు భో

జనము లభించెనేని జన । సంచయమున్ బ్రిదుకంగనీడు పే
డని పెరరేపె భారతిని । నాతఁడు నిద్రను గోరునట్లుగన్.

గీ. కుంభకర్ణుండు మతిఁదప్పి । కోరె నిద్ర;
నంబుజాసనుఁ డట్లయా । నని వచించి,
సద్గుణ విభూషణుని విభీ । షణునిఁ జూచి,
"వత్స! నీకెట్టివరము కా । వలయు ననిన.

క. "తాపసులతోడి మైత్రియు,
శ్రీపతి పదసేవయందు । స్థిరచిత్తంబున్,
బాపేంగి తానుతాపము
నేపారఁగ నిమ్మను గ్రహింపుము దేవా!

చ. భళి! భళి! మేలు! మేలనుచు । భక్తవరా! చిరకాల జీవివై
ఇలసుఖయించెదంచు వచి । యించి విరించనుఁడంతరించె; లో
నలగుచు సోదరుల్ ముగురు । నాత్మగృహంబుఁకేగి రా యమ
ర్త్యులు, మునిపుంగవుల్, నరులు । యోగులు, సిద్ధులుఁ, దల్లడిల్లఁగన్.

గీ. "గంధసింధుర సత్త్వ ధు । రంధరుండు,
కంధరారవసర్జిత । కంధరుండు,
ఘనవినయ వశీకృత నీల । కంధరుండు,
క్షతవసుంధరుఁ డప్పంక్తి । కంధరుండు.

గీ. క్రూరహుంకార, ఘోరటం । కార భీత
శత్రుకామినీ గర్భ వి । స్రావణుండు,
ప్రబల విక్రమ నిర్జితై । రావణుండు,
రావణుండెూర లోక వి । ద్రావణుండు.

గీ. అని నుతింపఁగ నెల్లఋ, । దనుజ విభుఁడు
విక్రమక్రమంబున లంక । నాక్రమించి

దుర్గముల, రత్నమయ హర్మ్య । ములను,
సౌధముల, భవనములఁ, బ్రా । సాదములను.

గీ. మోదమిగురొత్త నిర్మించి, । సోదరులకు
హర్షమెసగంగ నేలి, దు । ర్ధర్షుఁడగుచు
మయుని తనయను, సద్గుణ । మయను, సుంద
రిని, గృశోదరిన్ మండోద । రిని వరించె.

రావణాది రాక్షసుల పరాక్రమ వర్ణనము

క. సురలకు నమరావతిఁబలె
వరసర్పంబులకు భోగ । వతి చందమునన్
నరభుక్కులైన దైత్యుల
కిరవయి దీపించె లంక । యిల నిశ్శంకన్.

గీ. యక్షుల జయించి హర్యక్ష । మనఁ జెలంగి
అలక లల్లాడకుండ న । య్యలకఁ జొచ్చి
పుష్పక విమానమును మాన । మును హరించె
రావణుండౌర! పీడాప । రాయణుండు.

ఉ. శౌర్యము దోర్బలంబు సుత । సంతతి, విద్యయు, మత్సరంబు, నై
శ్వర్యముసైన్యమున్జయము । సౌఖ్యముబుస్సియుశ్రద్ధయున్ మనో
ధైర్యమువృద్ధియుకాకోలఁదిఁ । దామరతంపరయయ్యె వానికిన్
క్రౌర్యముగార్యదీక్షయును । గర్వములోభముమోహమున్గడున్.

గీ. కుంభకర్ణుని యుద్ధ సం । రంభవిధముఁ
జూచినంచాలుఁ జూలాలి । చూలు సడలు;
మేఘనాథుండు భళిర! య । మోఘబలుఁడు
ఇంద్రుని జయించె నమరుల । యేపణంచె.

గీ. సుముఖుఁడు నకంపనుండును । గులిశరదుఁడు.
ధూమ్రకేతుండు రిపురాజ । ధూమకేతుఁ,
డైన యతికాయుఁ డక్కటా! । యతుల బలులు
కామరూపులు నిర్దయుల్ । కపటమతులు.

గీ. వీరలెల్లను, సుభటులు । వీరవరులు
జ్యేష్ఠపుత్త్రుండు రిపుజైత్రు । డింద్రజితుఁడు,
సోదరుఁడు కుంభకర్ణుండు, । శూరసింహుఁ
డైన రావణు వర్ణింప । నలవి యగునె ?

ఉ. నీలసరోజనేత్ర! యవ । నీధరమున్ గదలించె నేపునన్;
గాలునిఁ జీఁకిఁగొనని । కాలుఁడు రావణుఁ డొక్కనాఁడు పే
రోలగమందు మంత్రులను । యోధులఁ, బుత్త్రుల, నుగ్రదైత్యశా
ర్దూలములన్ గనుంగొని వి । రోధులఁ జంపఁదలంచి యిట్లనున్.

మ. "గదలం బోలిన బాహుదండములచే । గౌరీశుకైలాసమున్
గదలింపంగల సత్త్వమున్ బడసితిన్ । గంధర్వులన్ వేల్పులన్
విదలింపంగల సైన్యమున్ బడసితిన్ । వీరుండ ధీరుండ న
న్నెదిరింపంగల రాచజోదు గలఁడే? । యీరేడు లోకంబులన్.

మ. మనకాగర్భవిరోధులైన సురలన్ । మ్రగ్గింప నూహింతు వా
రనిలో దైత్యులఁ జూచి పాఱెద రుపా । యంబొండు చింతించితిన్
వనభాగస్థ మునీశ్వరక్రతు హవి । ర్భాగంబులన్ గైకొనన్,
జనుదేరంగల వారలప్పుడచటన్ । సాధించి బాధింపనా.

గీ. బ్రాహ్మణుల యాగములకును । శ్రాద్ధములకు,
వెడలుచుందురు సతతంబు । విబుధవసులు;
అట్టితఱిఁ జూచి వారల । నదిమిపట్టి,
పరిభవింపుఁడు చంపుఁడు । హరి కలఁగ."

చ. అనుచు దశాననుండు విబు। ధావళులఁ జూచి వచించి సింహగ
ర్జన మొనరించి నంతనె, ధ। రాతలమంతయు సంచలించె నౌ
నని "యిది లెస్స"యంచు నసు। రారులుహుమ్మనిహుంకరించుచున్
జనిరి ధరామరప్రణుత। సన్మునియాగ వినాశనార్థులై.

రావణుని దిగ్విజయము

సీ. సురలోకముం జొచ్చి। సురనాథు బంధించి,
యితర దిక్పాలుర। నేపణంచి,
యక్షుల వీక్షించి। పక్షులంచు వధించి,
గంధర్వులం బట్టి। కసిమసంగి,
నరులా వానరులా కి। న్నరులంచుఁ బీడించి,
సిద్ధులనోడించి। బుద్ధిఁ జెప్పి,
పురుషులాయంచుఁ గిం। పురుషుల సాధించి,
సాధ్యుల బాధించి। సంహరించి,

గీ. సప్త పాతాళముల గెల్చి। సంభ్రమించి,
అఖిల లోకంబుల జయించి। యతిశయించి,
శత్రులోకాంతకుండయ్యె। సమర రంగ
భైరవుండగు దనుజ కం। ఠీరవుండు.

ఉ. అవ్విధి రావణుండు, దను। జావళితోడఁ బరాక్రమించి, నా
కెవ్వఁడు సాటియంచు, హరి। యేడి? యెదుర్కొనఁ డేటికంచు, మై
క్రొవ్వున హుంకరించి యని। రుద్ధ బలుండయి లంక కేగుచున్
నవ్వుచు వచ్చు ముళ్ళ యతి। నారదుఁ గాంచి హసించి యిట్లనున్

ఉ. "డీయని సర్వలోకముల। డీకొని గెల్చితి, గెల్పు లచ్చితో
హాయిగవచ్చుచుంటి, నసు। రావనుఁడుందురు విష్ణుమూర్తి, మై

తేయుల గర్భవైరియని । ధీరవరుండని సన్నుతింతు, రే
డీ? యెదిరింపఁడో? నను జయింపఁడో? దైత్యులసంహరింపఁడో.

శా. "భీతిల్లెన్ భువనత్రయంబు, విబుధుల్ । పెంపేద వెన్నిచ్చి ర
క్షాతంబయ్యె జగంబు, వేల్పులెచటన్ । గన్పట్టరన్నన్" సుర
వ్రాతంబెచ్చట డాఁగునో యెఱుఁగవే? । రాత్రించరాగ్రేసరా!
శ్వేతద్వీపము ముట్టడింపుము భవ । ద్వీర్యంబవార్యంబుగాన్".

### రావణునకు సంభవించిన పరాభవములు

చ. అని ముని హెచ్చరింప విని । యూనని నవ్వుచుఁ దక్షణంబ య
ద్దనుజవిభుండు, వారినిధి । దాటి వడిన్ దెలిదీవికేఁపు నైఁ
జని యచటన్ జరించు నెఱ । జాణలఁ బెక్కురఁ జూచి "వేగ మీ
యినునకుఁ దెల్పుఁడాతని జ । యించి మిముంగొనిపోదు లంకకున్."

చ. అదవద లేక వీరుఁడను । నాదరమించుకయైన లేక, య
మ్మదవతులద్దశాస్యుఁగని । మాటికి మాటికి నవ్విరంతటన్
ముదుసలియోర్తువానిపది । మోములఁజూచిహసించి, "యూర! నీ
వు దశముఖుండవో? దనుజ । పుంగవ! మావిభు గెల్వవచ్చితో.

క. పదితలలం గల పుసు వె
య్యదియో యేతెంచె" నంచు । నమ్ముసలి త
త్పదములఁ గేలం దివియుచుఁ
జదలకుఁ గొంపోయి త్రిప్పి । జలనిధిఁ ద్రోసెన్.

సీ. జలధిలోఁబడి విపరి పరి । సాదమునను
పొలియకందుండి పాతాళ । మునకు నేఁగి,
ఎలమి బలిలోకముంజొచ్చి । బలినిఁ జూచి
అతని మన్ననలం గొని । యసుర విభుఁడు.

గీ. "అనఘ! నీరాజ్యము హరించి । నట్టి హరిని
సంహరింపఁగ వచ్చు నా । సాయమునను;
రమ్ము భూలోకమునకు నీ । రాజ్యమునకు"
ననిన బలి వాని వీక్షించి । యపహసించి.

చ. "భళిభళి బల్లిదుండవన । వచ్చు; మదీయ పితామహుండు వే
ల్పులకు యముండు స్వర్ణకశి । పుండు ధరిత్రికి రాచపుండు తా
నెలమి ధరించె దీని ధరి । యింపును కానుకగా గ్రహింపు మి
య్యెల విహరింపు మాశల జ । యింపుము రావణ! రాక్షసావనా"

గీ. అని బలియొసంగు భూషణం । బును ధరింపఁ
జేవ లేక దశాస్యుండు । చిన్నఁ బోయె;
వానిఁ దిలకించి యిట్లనె । బలి హసించి;
"ఎల్లిదంబయ్యెఁగద నీకు । బల్లిదంబు.

గీ. అమర గంధర్వ కిన్నర । యక్ష సిద్ధ
సాధ్యుల జయించినాడవు, । సాటిలేని
మేటి నని చెప్పుకొంటి వీ । పాటి సొమ్ముఁ
దాల్పఁ జాలవు, శ్రీహరిఁ । దాకఁ గలవె?"

చ. అనవుడు మోము వంచి దను । జాధిపుఁ డచ్చోటు వాసి తత్క్షణం
బునఁ జనె లజ్జ నించుకయుఁ । బొందక, ఘోర పరాభవార్తికిన్
వనరి, దయావిహీనుఁడయి । పాపభయంబుఁ దొలంగి, చిత్కళా
ఖనులగు మానులన్ ఘనుల । గాసిలఁ జేయుచునుండె నెంతయున్.

గీ. అంగటి బలుండు, రావణుం । డలుపుఁ డయ్యె;
నకట! దైవంబు ప్రతికూల । మైన వేళ
రత్న మెంతటిదయ్యు వ్య । ర్థంబ యగును
గాజు చందంబున, వరాట । కంబు కరణి.

గీ. అంగనల మానధనముల దొంగిలించి,
బ్రాహ్మణుల మౌనివర్యులఁ బరిభవించి,
సజ్జనుల, దైవభక్తుల, సంహరించి,
ఉర్వి దిరుగాడు నాతఁడిం కొక్కనాఁడు.

రావణుఁడు వాలిచేఁ బరిభవింపఁ బడుట

క. పంపాతీరంబున, వర
శంపారుచిఁ గ్రాలు రోమ సంతతితోడన్
సొంపారు వాలిఁగనె; నను
కంపాహీనుండు దైత్య కాంతుండంతన్.

క. వాలిన్, శాత్రవకుల వన
కీలిన్, సంగ్రామరంగ కేళీ జిత వీ
రాలిన్, జననుత భుజబల
శాలిన్, ముఖవిజిత హేళి సన్నుత శూలిన్.

గీ. గెలువ నూహించి జృంభించి ! యలపు మెఱయ
మెల్లమెల్లఁగ బ్రామఁకులఁ బెల్లగించి,
ఉప్పరముఁదాకు చొప్పున నుప్పొచుండె;
దత్తఱిల్లక యవ్వాన రోత్తముండు.

గీ. జపతపోధ్యాన నిరతికి సమయమగుట
సూర్యునకు నంజలింగూర్చి చూచుచుండె;
"నన్ను లక్షింపకీతండు మిన్నకుండె"
ననుచుఁ గోపించి, యిట్లనె దనుజ విభుఁడు.

శా. "ఔరా! వానర! చాలుఁజాలును బక ధ్యానంబు మౌనంబు, లో
కారాధ్యుండవ; బల్లిదుండవని బ్రహ్మాండంబు ఘోషింప, దో

స్సారంబున్ బరికింపవచ్చితి శరా । సారంబునన్, బోరెదన్
రారా! లేక జితోఽస్మి పాహి యనినన్ । రక్షింతు నింతేటికిన్."

గీ. అనిన విని వాలి యించుక । యాగ్రహించి,
"బ్రహ్మకులజుండు, బ్రహ్మ వ । ర ప్రసాద
మహిమఁ గొబ్బినవాఁ" డంచు । మదిఁ దలంచి,
జపముఁ జాలించి లేచి రా । క్షసునిఁ జూచి.

ఉ. "శూరుఁడ వౌదువోయి! యిదె । సూర్యున కర్ఘ్య మొసంగుచుంటి, నీ
వోరిచియుండుమిప్పటికి । నోడితినంచు దలంపు" మన్న దే
వారి హసించి "సూర్యునకు । న ర్ఘ్య మొసంగిన లాభమేమి? నీ
కోరినకామితంబు నొస । గూర్చెద నాకునొసంగు మర్ఘ్యమున్.

చ. అన విని వాలియాగ్రహము । దగ్రముగాఁగమహోగ్రుఁడై, నరా
శనుఁగని "యోరి! నీ యెదిరి । సత్త్వముఁ దలఁపక, సన్నిపాత మొం
దినగతి నేలఁ బ్రేలెదవు? । నిన్ను జయింపఁగవచ్చు, నింటికిన్
జను" మనినంత రావణుఁడు । చయ్యన డీకొనె వానరోత్తమున్.

గీ. తగరు కొండను దాకు చం । దమునఁ జెలఁగి
తన్ను ఢీకొను రావణు । వెన్నుఁదన్ని,
వాల నిహతాంబుధరపాళి । వాలి, వాలి
వాని నేపున్మోఁ దనచంక । లోనిమిడ్చె.

చ. వననిధు లేడు దాటి, సుర । వారము మేలని హెచ్చరింపఁగన్
వనములఁ ద్రిప్పిత్రిప్పి, కుల । పర్వతపంక్తి నతిక్రమించి, యా
త్రినయను నెమ్మనంబున స్మ । రించుచు నింటికిఁ బ్రొద్దుగ్రుంకినం
తనె చని పుత్త్రినిన్ బిలిచి । దానవనాయకుఁ జూపి నవ్వుచున్.

గీ. పడతులల బొమ్మ యియ్యది । పలుకఁ గలదు,
వాడుకొను మాడుకొను"మని । పలికి నెపలె;

దారయే తెంచి కరుణించి । దనుజ వరుని
"వెంగలీ! పొమ్ము పొమ్మ"ని । విడిచిపుచ్చె.

గీ. బ్రతుకుజీవుఁడయంచు నె । మ్మదిఁ దలంచి
వాలి తనకొనర్చినయట్టి । పరిభవంబు
నమరులీక్షించి కడుమెచ్చి । రనుచుఁ గినిసి
తపఁబడుచుఁ బండ్లుగొఱుకుచు । వెడలి వెడలి.

రావణుఁడు కార్తవీర్యార్జునునిచే బంధింపఁబడుట

క. శర్మదఁ, బ్రోత్ఫాళిత గజ
దుర్మద, భీకర యమభట । దుర్భర బాధా
వర్మద, స్నాతక ఘర్మద
నర్మద, నీక్షించె దనుజ । నాయకుఁడంతన్.

గీ. అందుఁ గ్రీడించు వనితల । యందముఁ గని
హైహయాధీశ్వరుఁ జూచి । యాగ్రహించి
జలముఁ గలుషితంబుగఁ జేసి । చలముఁ బూని
పజ్జకేతెంచి నంతనె । పరిహసించి.

గీ. కంఠరవజిత పర్జన్య । గర్జనుండు
దుర్జయుఁడు నిర్జితాఖిల । దుర్జనుండు
ఆర్జితార్జునకీర్తి వి । స్ఫూర్జితుండు
కార్తవీర్యార్జునుండు దోః । ఖర్జు వణఁగ.

గీ. రావణుఁ గొట్టి కర సహ । స్రమునఁ బట్టి
పురవరంబున కేగి మం । దురను గట్టి
"అసురనాయక ! లజ్జింపు" । మనుచుఁ దిట్టి
కాంతలం గూడి యేగె శు । ద్ధాంతమునకు.

ఉ. అంతఁబులస్త్యుఁడాత్మజు న । హంకృతి యింతకుఁ దెచ్చెనంచు లోఁ
జింతిలి మిన్నకున్న నికఁ । జేడ్పడుఁ గీడ్పడునంచు నెంచి భూ
కాంతుని సన్నుతించి దశ । కంధరు బంధవిముక్తుఁ జేసె న
త్యంత విచార భార విన । తాననుఁడై పరితాప మొందుచున్.

గీ. తత్క్షణంబున వెడలి య । ద్దనుజ విభుఁడు
తనకుఁగలిగిన పరిభవం । బునకుఁ గినిసి
పండ్లు పట పటఁ గొఱుకుచు । వచ్చుచుండఁ
దోవఁ గన్పట్టె రంభయన్ । దోయజాక్షి.

రావణుఁడు రంభను బలాత్కరించుట

క. రంభన్ నిజోరుధిక్కృత
రంభన్ గుచకుంభజృంభ । రంజన్నాట్యా
రంభన్ సురతాధిక సం
రంభన్ గని కౌఁగిలించె । రతిఁ బీడింపన్.

చ. వలదనియేడ్చి కాళ్ళఁబడి । వావికిఁ గోడలనౌదు రావణా
తొలఁగుము పాపహేతువని । తోయరుహానన యెంత చెప్పినన్
ఖలుఁడు బలాత్కరించి రతి । కాంతునకోడి రమించె నాపె కన్
గొలుకుల నీరమూర నల । కూబరుఁ జేరి వచించె సర్వమున్.

నలకూబరుఁడు రావణుని శపించుట

గీ. అతఁడు మోమునన్ జెమ్మట । లంకురింప
గనలి కన్నీరు మున్నీరు । గా స్రవింప
జలరుహేక్షణ నీక్షించి । జలముఁబూని
అసురనాథు నుద్దేశించి । యాగ్రహించి.

గీ. "ఏమరాత్మ్రుండు, నాకొఱ | కేగుదెంచు
లలనఁగని కౌఁగిలించి, బ | లాత్కరించె,
నద్దురాత్ముండు, ఖలుఁడు, దే | వాంతకుండు,
సపరివారంబుగ నశించు | సంగరమున."

ఉ. ఆనలకూబరుండు దను | జాధిపు నిట్లు శపించి నంతనే
మానవనాథులున్, సురలు, | మౌనులు, యోగులు, సంతసించియా
నౌనని హెచ్చరించి, దను | జాధిపుఁడున్ భయమొంది వెంటనే
ఆసతియిచ్చె దైత్యులకు | నందఱ నెల్లెడ సంహరింపఁగన్.

గీ. మునులు యోచించి కౌటిల్య | మునకుఁ జొచ్చి
రక్తపూరిత కుంభంబు | రాక్షసుల కొ
సంగి, "మీ ఱేని కీఁబొండు | సత్వరముగ
వంశవర్ధన మగు" నని | పలికినంత;

గీ. మునులొసంగిన యాకుంభ | మును ధరించి,
వారలేతెంచినంత, రా | వణుఁడు చూచి,
ఎగ్గువాటిల్లు నని యెంచి | యిట్టులనియె,
"దీనిఁ గొంపోయి యుత్తర | దేశమునను.

గీ. పదిలముగనొండు స్థలమునఁ | బాదుకొలిపి
అరుగుదెండని పొండని" | యానతిచ్చె;
"నకట! మౌనులు వంచించి | రనుచుఁ గినిసి
వారలారీతిఁ గావింప | బయలు వెడలి;

క. జనకుని దేశంబునకున్
జని, యొక క్షేత్రంబుఁ జూచి | చయ్యనఁ గుంభం
బును నిమ్న గర్తభాగం
బునఁ బొందుగఁ బాదుకొల్పి | పోయిన యంతన్.

## సీతా జననము

చ. జనకమహాక్షి దేశమున । క్షామము దిక్కులనాక్రమించెఁ, ద
జ్జనులకు క్షుత్పిపాసలను । సంకటముల్ చెలరేగె, నెక్కడన్
జినుకులు లేవు కర్షకుల । నేత్రయుగంబునఁ దక్క నక్కటా !!
వనములెడారులయ్యె, నిఁకఁ । బాడినశించిన, వింతయున్నదే ?

ఉ. కుందికృశించియున్న జన । కుంగని క్రుంగని తాల్మితో శతా
నందుఁడు "కుందనేల? జన । నాయక! జన్నమొనర్పు మింక నా
నందము మేర మీఱఁగ ఘ । నంబుగ వృష్టిలభించు" నన్నఁ దా
సుందరమైన క్షేత్రమును । జూచి, మునీంద్రులు ప్రోత్సహింపగన్

చ. కనకహలంబుఁ బూని జన । కాంతుఁడు దున్నుచునుండ భూమిలో
గనుఁగొనవయ్యె నొక్క వర । కన్య, విశాల సరోరుహేక్షణన్,
కనకలతాంగి, సన్మునుల । కన్నులకున్ మిఱుమిట్లు గొల్పఁగన్
జనులు వినూత్నరత్న ఖని । సంచయమంచు నుతింపనయ్యెడన్.

క. ధన్యన్, మునిసన్నుత సౌ
జన్యన్, బుణ్యాగ్రగణ్య, । జనమాన్య, ననా
మాన్యన్, రూపానన్యన్,
గన్యన్, వీక్షించి, భూమి । కాంతుండలరెన్.

ఉ. నారదుఁ డేగుదెంచి, జన । నాథునిఁ జూచి నుతించి, యీమె ధా
త్రీరమణీతనూజ యగు, । సృష్టికిఁ దత్స్థితికిన్ దలంప సం
హారిణి, యాదిశక్తి, గుణ । హారిణి, క్షీరపయోధికన్య, నీ
సీరమునన్ జనించె, భువి । సీతయనంగ నెసంగు భూవరా !

గీ. సకల కల్యాణ సంధాత్రి । స్వర్ణగాత్రి,
పృథ్వినాయక! నీపుత్త్రి, । విష్ణునేత్రి,
అనిన విని మౌనికిన్ మ్రొక్కి । యభినుతించి,
జనకుఁడా జగన్మాతకు । జనకుఁడయ్యె.

రావణుని దారుణ చర్యలు

గీ. ఆసమాచార మంతయు । నమరవైరి
రావణుండాలకించి, ని । ర్లక్ష్యముగను,
దిక్కులజయించి, శాసించి । త్రిభువనముల,
సూర్యచంద్రులఁ బాద దా । సుల నొనర్చె.

గీ. సకలదిక్పాలు రతని సే । వకులు గాఁగ
నఖిలరత్నంబు లతని భో । గ్యంబులయ్యె;
క్షుద్రతరకీర్తి, సంగర । రౌద్రమూర్తి,
వక్రపథవర్తి, రాక్షస । చక్రవర్తి.

క. పాకారి వీఁక యణఁచెను,
శోకారినిఁ గోకమిత్రుఁ, । గోనె దివ్వెలుగా,
లోకారి యనఁగఁ జెలఁగిన
నాకారి జయింపరాడు, । నగరాట్పుత్రీ!

గీ. నిగమ! నిగమాంగములను తృ । ణీకరించి,
బ్రాహ్మణుల గోవులం జంపి, । గ్రామనగర
జనపదంబులఁ గాల్చి, భ । స్మములఁ జేసి,
పాపముల కున్కిపట్టయ్యె । వానిసుతుఁడు.

మ. భగవత్పూజలు, యజ్ఞముల్, జపతప । స్స్వాధ్యాయముల్ దానముల్
జగతిన్ స్వప్నగతంబులయ్యె, నెవఁడేన్ । సత్త్రంబులన్ బెట్టి, య
ధ్వగులన్ బ్రోచిన, సత్వరంబచని వి । ధ్వంసంబుఁగావించు; పం
క్తిగళున్ మించెను మేఘనాధుఁడు ధరి । త్రీదేవి శోకింపగన్.

క. చోరులు, జారులు, నత్యా
చారులు, దుర్మార్గులైన । శ్వపచులు, నీచుల్

క్రూరులు, బ్రాహ్మణ మాంసా
హారులు బాధించిరకట! । యవనీ దేవిన్.

భూదేవి గోరూపము ధరించి యమరులమ్రోల విలపించుట

క. "సప్తకుల పర్వతంబుల,
సప్తసముద్రముల, సకల । జనులన్, ఖనులన్,
సప్తాశ్వ తీవ్రతేజము,
సప్తద్వీపముల నోర్వఁ । జాలియు నకటా !!
గీ. ఒక్కపాపాత్ము భరియింప । నోప, నిపుడు,
ప్రబల విద్రోహులెందఱో । ప్రబలిరింక
నోపుదునె?" యంచు భూమి గో । రూపమూని
అమరులంజూచి విలపించి । యలసి సొలసె.
గీ. చేయునది లేక, కన్నులు । చెమ్మగిల్ల
నపుడు భూదేవితోఁగూడి । యమరులెల్ల
బ్రహ్మపాలికినేతెంచి, । ప్రస్తుతించి,
గొల్లుమని యేడ్చి యేడిచి, । పల్లటిల్లిరి.
గీ. బ్రహ్మచింతించి, దుఃఖింప । వలవదనుచు,
వసుమతింజూచి, యకట, నా । వశముఁ దప్పె,
నంగయున్ బరమాత్ముని । యంద కలదు,
అభినుతింపుము, భగవంతు । ననుదినంబు.
గీ. "అనిన విని వేల్పులెల్లఱు । నదియ లెస్స"
అనుచు నామోదముంబొంది । రభినుతింప;
వసుమతీదేవి జలజాత । భవునిఁ జూచి,
వెక్కి, క్రేఁటుచుఁ, గుందొచ్చి! । వెచ్చనూర్చి.

శా. "పాడిన్ దప్పిన క్రూరులన్ దనుజులన్ । బాహాహులంజెండి, కా
పాడఁజాలినవాఁడు విష్ణువనఁగా । నౌనంచు సైరించితిన్
రాఁడో? దైత్యులసంహరింపఁడో? ననున్ । రక్షింపఁగాజాలఁడో?
ఏడీ యాభగవంతుఁ డెందడఁగెనో? । యేచాయ నిద్రించెనో?

సీ. కాలాంబు దచ్ఛాయఁ । బోలువాఁడని నమ్మి,
యంభోధరంబుల । నభినుతించి
రవి చంద్రబింబ నే । త్రంబులవాఁడంచుఁ
జంద్ర సూర్యులఁ జూచి । సంతసించి,
కమలకు నిల్లంచుఁ । గమలనాభుండంచుఁ
గమలంబుఁ గాంచి, త । ద్ఘనతఁ నెంచి,
చక్రావనుండంచుఁ । జక్రధారియ నంచుఁ
జక్రంబుఁ దిలకించి । సన్నుతించి,

గీ. జలధి వన శైలములఁ జొచ్చి । సంచరించి;
విసిగి వేసారితిన్ మేలు । పొసఁగ దనుచు,
డింది కుందితి; భగవంతుఁ । డెందుఁ గలఁడో?
రాఁడో? నామొఱాలించి కా । పాడ లేఁడో?

గీ. అనుచు విలపించు వసుమతి । ననునయించి,
ఉమ్మలించుచుఁ, గన్నులు । చెమ్మగిల్ల,
నల్లములు తల్లడిల్లఁగ । నెల్ల వేల్పు
లించుకంత తాల్మింబూని । యిట్టులనిరి.

ఉ. "క్షీరసముద్రమందు నివ । సించు; సతంబును శేషశయ్యపై
గూరుకుఁజెందు, నెప్పుడు వి । కుంఠమునన్ విహరించునందు; రా
శ్రీరమణుండు, భూతదయఁ । బ్రేమముఁగల్గిన భక్తవర్యులన్
జేరి రహించునందు) ముని । శేఖరులెల్లఱు, నిక్క మెట్టిదో ?

గీ. దేశకాలంబులన్, సర్వ । దిక్కులందుఁ,
చిన్మయుండయి దీపించు । శ్రీవిభుండు;
ఇందుఁగలఁడందు లేఁడను । సందియంబు
వలదు వలదండ్రు కొందఱు । భక్తవరులు.

గీ. సర్వరహితుండవో? లేక । సర్వమయుఁడ
వో? విరాగివో? రాగివో? । యోగివో? త
లంప భోగివో? నిన్ను గ్రి । హింపఁగలమొ?
ఆది మధ్యాంత రహిత! కా । పాడవలదె?"

క. విని వేల్పులాడు పలుకులఁ,
మనమున హర్షంబు భక్తి । మల్లడిఁ గొనఁగన్
గనుదోయి నీరమూరఁగ
వనజాక్షుని సన్నుతించె । వనజాసనుఁడున్.

బ్రహ్మకృత శ్రీవిష్ణు స్తుతి

రగడ:— "జయ జయ నిర్జర । సంతతి నాయక!
జయ జయ సన్నుత । సన్ముని గాయక!
జయ జయ సజ్జన । సత్సుఖ దాయక!
జయ జయ శంకర! । శంకర నాయక!
వరజన రంజన! । భవభయ భంజన!
శరణు నిరంజన! । జ్ఞానాంధాంజన!
నిను వినుతింపఁగ । నేర్చును వేదము,
ఘనుఁడవు, నీమది । గాంచదు ఖేదము;
పరుఁడవు, పరనిజ । వాదవిభేదము
నరయక పొందెద । వతులా మోదము;
అతుల విరాగీ! । యానత యోగీ!
అతిశయ భోగీ! । స్వార్థత్యాగీ!

సురలన్ బ్రోవుము । సుర రిపు శిక్షా !
నరులన్ గావుము । నరహర్యక్షా !
క్షమఁ జాలింపుము, । క్షమఁ బాలింపుమా,
మము లాలింపుము । మనవాలింపుమా ;
తనుజిత కంధర ! । దళిత జలంధర !
తనుభృత మందర ! । దరనిభ కంధర !
వనరుహ నయనా ! । వననిధి శయనా !
వినత ధరామర । వేదాధ్యయనా !
జయ జయ గోద్విజ । సంచయ రక్షా !
జయ జయ రక్షః । స్సంఘవిపక్షా !
జయ జయ సుందర । సద్గుణ మందిర !
జయ జయ శ్రీముఖ । జలజేందిందిర !
పాహిసురాసుర । వందిత చరణా !
పాహి చరాచర । పాప నివారణ !
పాహి ముకుందా ! । నంచిత బృందా !
పాహి విమోహిత । వనముని బృందా !

అభయప్రదానము

క. అని సన్నుతించి వంత నె
విని సర్వవ్యాపకుండు । పృథివిం బ్రోవన్
వనజాసనుఁ దనియింపన్
దన మనమున నిశ్చయించి । దయ నిట్లనియెన్.

మ. "వనజాతాసన ! తాల్మిఁబూను మవనీ । భారంబు వారింపఁగా
జనియింతున్ భువిరాఘవుండనయి; ర । క్షస్సంఘముంగూల్చెదన్,
జనులన్ ధర్మముఁబాదుకొల్పెద, ధరన్ । శాసించెదన్, గోద్విజా
వన భారంబువహించెదన్, నర సుప । ర్వశ్రేణికీర్తింపఁగన్.

గీ. భువి నయోధ్యాపురంబున । రవికులమున
దశరథక్ష్మావనీశుని । తనయుఁడ నయి
ఇల జనించెదఁ గ్రూర దై । త్యుల వధింపఁ;
నాదిలక్ష్మియు జానకి । యై జనించు"

చ. అనవుడు మేలుమేలనుచు । నందఱు సంతసమొందిరప్పుడా
వనజభవుండు, "వేలుపులు । వానరులై భువి నుద్భవిల్లి, య
వ్వనరుహనేత్రునింగొలిచి । పావనులౌదురు పొందు పొం"డనన్
విని కడు లెస్సయంచుఁ బృథి । వీసతితోఁ జని రెల్ల వేలుపుల్.

శ్రీ రామ జననము

ఉ. కాఁపురమై జయేందిరకు, । క్ష్మాస్థలిఁ గ్రాలు విదేశకోటికిన్
మూఁపురమై, ధరారమణి । నూపురమై, బుధసేవితావనీ
గోపురమై, సువర్ణమయ । గోపురమై, సురహృద్యమై, యయో
ధ్యాపుర మొప్పు, సంపదల । దాఁపురమై యలకాపురంబునాన్.

ఉ. ఆపుర మేలువాఁడు, సక । లాశ్రితకోటికి మేలువాఁడు సం
తాపము లేనివాఁడు, నృప । ధర్మమెఱింగినవాఁడు, సద్గుణా
వాపమనంగ ఖ్యాతిఁగల । వాఁడు, మహాబలవంతుఁడయ్యు, నా
వాపము లేనివాఁడహహ । పంక్తిరథుండను ఱేఁడు; మానినీ!

శా. ఆసుజ్ఞాని, పతివ్రతామణుల, మి । థ్యామధ్యలన్, ముగ్ధలన్,
కౌసల్యాది పవిత్రశీలవతులన్, । కళ్యాణులన్ గూడి, వి
శ్వాసుల్ మిత్రులుమంత్రులున్ భటులుఁగొల్వన్ భూమి శాసించియున్
తోసంబేమియు లేక సన్నగిలెఁ బు । త్త్రుల్ లేని లోపంబునన్.

క. మగఁటిమిఁ గలవాఁడయ్యున్
వగఁబొగులుచు నుండె నతఁడు । వసుధ "నపుత్ర
స్య గతిర్నాస్తి" యని మహా
నిగమజ్ఞులు పల్కినట్టి । నీతికి నకటా!

క. గురువర్యుఁ జేరి తత్పద
సరసిజములకు నెఱంగి, శ్రద్ధన్, భక్తిన్,
గరకమలంబుల మోడిచి,
పరితాపము భూవరుండు వ్యక్తముఁ జేసెన్.

గీ. అవ్వశిష్ఠుండు దశరథు ననునయించి,
"ఓరుపుంబూను మనఘ! నీ కుద్భవింతుఁ
గలరు నలువురు సుతులు, జగత్ప్రసిద్ధు
లాశ్రితావనదక్షు లత్యధిక బలులు."

గీ. అనిన విని హర్షముప్పొంగ జనవిభుండు
మ్రొక్కులర్పించి వెడలె; న మ్మునివరుండు
పుత్రికామేష్టికిన్ యత్నముల నొనర్చి,
ఋష్యశృంగుని రప్పించె నింటికపుడు.

ఉ. పొంగుచు నంతరంగమున భూపతిమెచ్చెఁ, బదానురోధ సా
రంగు, నధిష్ఠితాగమతు రంగుని, నానత రాజ మత్త మా
తంగుని, సజ్జనాంబుజ పతంగుని, భూతదయాంతరంగు, ని
స్సంగుని, యాగచంగు, గుణసంగు, నభంగుని, ఋష్యశృంగునిన్

గీ. అమ్మునీంద్రుని యానతి నవధరించి,
పుత్రికామేష్టిఁగావించె భూవరుండు;
భక్తినాహుతినీయ, వైశ్వానరుండు,
అలరి, పాయసంబిచ్చెఁ బ్రత్యక్షమగుచు.

క. "ఈపాయసంబుఁ గైకొని
క్ష్మాపాలక! పంచియిమ్ము సతులకు; దనుజా
టోపాంతకులన్, దనుజులఁ
బాపఘ్నులఁ గాంచెదీవు వసుధావనులన్."

గీ. అనిన విని వీతిహోత్రునిఁ । గని నుతించి,
సత్వరమ పాయసంబున । సగము పెద్ద
భార్యకు నొసంగి, మిగిలిన । భాగ మొగినిఁ
గైకకు సుమిత్రకుం బంచె । క్ష్మావరుండు.

గీ. తనదు భాగంబులోని య । ర్థము మిగిల్చి,
ఆసుమిత్రకుఁ గౌసల్య । యందఁ జేసె;
ప్రేమమైవార నెలమి సే । వించి నంత
సతులు వరగర్భ వతులైరి । క్షితిపుఁ డలర.

క. జగముల నెల్లెడ నెలకొను
భగవంతుని దివ్యకాంతి । భరియించిన య
మ్మగువల చక్కందన మె
న్నఁగ వీక్షింపఁగ నలవియె । నలువకునైనన్.

ఉ. మేదినిఁ జైత్రశుక్ల నవ । మీతిథి నాడభి జిన్ముహూర్తమం
దాదివిరాట్స్వరూపమున, । నచ్యుతుఁడవ్యయుఁడీ ప్రపంచ మా
మోదముఁబొంద రామనృప । పుంగవుఁడై జనియించె; బూర్ణచం
ద్రోదయభూషితాంబునిధి । యోయనఁబం క్తిరథుండు రాజిలన్.

క. ఆనందకంద మనఁదగు
శ్రీనాథుఁడు రాముఁ డవత । రించిన యంతన్
ధ్యానించి రఖిల మౌనులు,
జ్ఞానులుఁ; జరము లచరములు । సంతోషించెన్.

గీ. వసుమతీ జావలోకన । వైభవంబు
తనకుఁగా కన్యులకుఁ గల్గ । దనుచుఁ దెలుపు
గతిని, సుమసౌరభంబులఁ । గడలఁజల్లి,
మలసె మలయ సమీర కు । మారుఁడపుడు.

సీ. వన వృక్షసంతతి, । ఫలపుష్ప భారావ
నతములై, భూమికి । నతులొసంగె;
సర్వ పర్వత పంక్తి । సకల లోహములకుఁ
గమనీయమణుల కా । కరము లయ్యె;
స్వాదు నిర్మల పూర్ణ । సలిలంబు లేపార
జల జల ప్రవహించె । సకల నదులు;
దేవతా మంగళా । రావంబు స్తుతిగాఁగ
నచ్చర లిచ్చమై । నాడి పాడి;

గీ. రంత నిర్జరు లామోద । మతిశయిల్ల
నలరు వానలఁ గురిపించి । రఖిల దిశల;
సన్మునుల మనోవీథి ప్ర । సన్నమైన
కరణి, గగనంబు నిర్మల । కాంతిఁ గ్రాలె.

సీ. నీలాంబుద శరీరు, । నిగమాంత సంచారు,
నమృతాంశు నయను, శ్రీ । రాబ్ధి శయను,
నానత పాలాక్షు, । మానవ హర్యక్షు,
నాహవభీము, లో । కాభిరాము,
వర చతుర్భుజకాండు, । వరదానగుణ శౌండు,
సద్భక్తజనలోలు, । సత్యశీలుఁ,
బంచాయుధోపేతు, । బహుళ మాయాతీతు,
మకర కుండల కర్ణు, । సుకృతపూర్ణు,

గీ. శిష్టజనమానసోల్లాసుఁ । జిద్విలాసు,
నసుర సంతాపుఁ,ద్రిభువన । వ్యాప్తరూపు,
శత్రుభీకర శస్త్రాస్త్రు, । స్వర్ణవస్త్రు,
విబుధ వినుత వివిధవేషు, । వేదభాషు;

గీ. చూచి కౌసల్య, భీతిల్లి । సొక్కి సోలి,
తెప్పిఱిలి లేచి, ఱెప్పల । నప్పళించి,
కన్నుఁగవవిప్పి, హస్తయు । గంబు మోడ్చి,
"దేవతావనదివ్య ప్రి । భావ! దేవ!

క. శరణాగతావనాంతః
కరణా! శుభకారణ! వర । కరుణాభరణా!
చరణాశ్రయ సన్మునిజన
భరణా! నిగమావతరణ! । భక్తావరణా!

క. ఈరూపుఁ జూడఁజాలను,
శ్రీరామ! గుణాభిరామ! । శిశురూపము ము
ద్దారం జూపింపుము, నా
గారాబము మేరమీఱఁ । గాంచి నుతింతున్.

క. కరమక్కజంబుఁ గొలుపఁగ
నరుణాంబుజనేత్ర యిట్టు । లాడినయంతన్
వరదుండు సంతసించెను
దరహాసంబాస్యసీమఁ । దాండవమాడన్.

ఉ. మాయకతీతుఁడై సకల । మానవకోటి నుతింప, నాదినా
రాయణుఁ డర్కవంశమున । నాకృతిఁదాల్చి జనించి భక్తిమై
నాయమ వేడుటన్ శిశువు । నాకృతి వొందియు నేడ్చుచుండె, నో
హో" యనియెల్లఱున్ దశర । థోర్వివిభున్ గొనియాడసత్తఱిన్.

గీ. మఱియుఁ గైకేయి యొక్కకు । మారుఁ గాంచె
నల సుమిత్రయు నిరుపుర । నెలమిఁ గనియెఁ;
పుత్త్రులన్ నల్వురం జూచి । భూవిభుండు
పేద పెన్నిధిం గన్నట్లు । మోదమొందె.

సీ. కులపురోహితుఁడైన । గురువర్యునానతి
నవధరించి, మునీంద్రు । లనుమతింప
జాతకర్మాదుల । శ్రద్ధతో నొనరించి,
బ్రాహ్మణుల కనర్ఘ । రత్నములను
ధనధాన్య వస్తు వా । హనముల, గోవులన్,
గృహములఁ, దనివోవఁ । బ్రీతినొసఁగెఁ;
గస్తూరి గలనీరు । కలయంపిగాఁ జల్లి,
గంబూర ముగ్గులఁ । గలయఁ దీర్చి,

గీ. వరపతాకంబులన్ సౌధ । పాళిఁ గట్టి,
పురవరంబునఁ బౌరులు । పొంగి పొరలఁ
బొంకముగ రాజవీధి న । లంకరించి
రెల్లజనుల యుల్లములు రం । జిల్లునట్లు.

గీ. ఆకసమునుండి పుష్పంబు । లవనిఁ గురిసె,
స్వర్ణ కలశంబులంబూని । సతులు వచ్చి
"మంగళము మంగళం" బంచు । మధురగాన
మింపెసఁగ బాడి దీవన । లిచ్చి రెలమి."

గీ. పట్టపగలయ్యు నగరు ధూ । పముల వలన
నంధకారంబు వ్యాపించె । నఖిల దిశల
రత్నములు తారకలఁబోలి । గ్రాలుచుండె;
రాత్రి యేతెంచె నేమొ శ్రీ । రాము: జూడ.

గీ. "అవనిఁ గాపాడ శ్రీరాముఁ । డవతరించె
మేలుకొనుఁ" డంచు వఱువాత । మేలుకొలుపు
ద్విజకులారావమో యన । ద్విజవరేణ్య
వేదనాదంబు దిక్కులఁ । బిక్కటిల్లె.

నామకరణము

గీ. శిశువులకు నామకరణంబుఁ । జేయనెంచి
మునివరులఁ జూచి దశరథ । భూవిభుండు
"సార్థకములైన నామంబు । లరయుఁ డనిన
తేనికిట్లానతిచ్చి ర । మ్మునివరులు.

క. వేలుపులఁ బ్రోవఁ బుట్టిన
బాలకుల కనంతనామ । వాచ్యుల కవనీ
పాలక! నామంబుల నిడఁ
జాలునె వాణీశుఁడైన । శంకరుఁడైనన్.

గీ. ఆగ్రహాము లేనివాఁడు నీ । యగ్రసుతుఁడు,
భానుకులవార్ధిసోముండు । భవ్యయశుఁడు,
అఖిలగుణధాముఁ డాదినా । రాయణుండు,
రాముఁడననొప్పు లోకాభి । రాముఁ డగుట.

గీ. కైకకుం బుట్టినట్టి యీ । ఘనుఁడు సత్త్వ
భావమునఁ గ్రాలు వాఁడు, ప్ర । పంచ భరణ
నిరతుఁడైయుండుఁ గావున । భరతుఁ డగును;
సద్యశస్సాంద్ర! దశరథ । క్ష్మాతలేంద్ర!

గీ. ఈసుమిత్రకుఁ బుట్టిన । యీ సుపుత్త్రు
లక్షయబలధురంధరు । లందొకండు
లక్ష్మణుఁడు సర్వలక్షణ । లక్షితుండు;
ఆశ్రితామర భూజ రా । జాధి రాజ!

గీ. ఈద్వితీయుండు, శత్రుఘ్నుఁ । డద్వితీయుఁ
డరుల వధియించు కార్యమున । దధిక బలుఁడు;

అహహా !! నీపెంపు వినుతింప ౹ నలవి యగునె ?
కృతమనోరథ దశరథ ౹ పృథ్వినాథ !

గీ. అనఘ! శ్రీరాము లక్ష్మణుం ౹ డనుసరించు,
నట్లు భరతుని శత్రుఘ్నుఁ ౹ డనుసరించు;
రామలక్ష్మణు లనఁగను ౹ గ్రాలుచుండ్రు,
భరత శత్రుఘ్ను లనఁగను ౹ వఱలుచుండ్రు.

క. అని మానులాడు పలుకుల
జననాథుం డాలకించి ౹ సంతోషించెన్ ;
వనితా ! నిక్కంబుగ న
య్యనుజులలో రామచంద్రుఁ ౹ డత్యుత్తముఁడౌ

శ్రీరామచంద్ర ప్రభావము

చ. అనుజులు రూపశీల సుగు ౹ ణాఢ్యులు, నిత్యము లోక ధర్మ పా
లనమున నేర్పరుల్, ఋతువు ౹ లన్ మధుమాసముఁ బోలి వారలన్
ఘనుఁడగు రామచంద్రుఁడను ౹ కంపకుస్థాన మనంగనొప్పుఁ, బా
వనచరితుండు, భానుకుల ౹ వారిధిసోముఁడుఁ గీర్తి కాముఁడున్.

గీ. అతని ముఖచంద్రబింబంబు ౹ సతము మంద
హాస చంద్రికలం జల్లు ౹ నఖిల దిశలఁ;
జూచినంతనె యెంతటి ౹ శోకమైనఁ
బోవు, సంతోష మొదవు నిం ౹ దీవరాక్షి !

గీ. అంతటను పరబ్రహ్మమై ౹ యలము కొనిన
కంజలోచనుఁ డజుఁడు ని ౹ రంజనుండు
ప్రీతితోడఁ గౌసల్యాంక ౹ పీఠిఁ గ్రాలె
నతని యందంబు వర్ణింప ౹ నలవియగునె ?

సీ. నీలాంబుదచ్ఛాయఁ । బోలు దేహమువాఁడు
వనరుహంబుల నేలు । కనులవాఁడు
సంపెంగఁబోలిన । చారు నాసిక వాఁడు
సోముని వలపించు । మోమువాఁడు
కంతుచాపముఁబోలు । కనుబొమఁ గల వాఁడు
డంబైన కంబుకం । ఠంబు వాఁడు
ఆజానులంబ బా । హాదండములవాఁడు
కమలామనోజ్ఞ వ । క్షంబువాఁడు

గీ. శోభకావాలమగు నిమ్న । నాభివాఁడు
పిడికిటం జిక్కు తడఁబడు । నడుము వాఁడు
అతని యందంబుఁ జందంబు । నభినుతింప
నలవియే ? చూడవలెఁగాక । యలిరుబోఁడి !

గీ. ముత్యములఁబోలి నఖకాంతి । పొలుపు మిగులఁ
గులిశ కేత్వంకుశాది రే । ఖలు రహింప
నినదమింపొంద క్షుద్రఘం । టికలు మ్రోఁగ
మెఱఁగు చరణారుణాంబుజం । బుల నుతింతు.

చ. కలుములచాన కేలుఁగవఁ । గ్రాలెడు కమ్మని తమ్మిపూవులై
తెలిజిగిఁదేఱు పుష్కర న । దిన్ బ్రియ మారఁగఁ గన్నతల్లులై
బలిబల సాహసంబులను । బల్మినడంచిన పర్వతంబులై
అలఘు పదాంబుజాతముల । నాత్మఁదలంచి నమస్కరించెదన్.

చ. మఘవ చరాచరప్రతతి । మాయకుఁజిక్కి మెలంగు, మాయయా
భగవదధీన మాత్మ భగ । వంతు భజింపకయున్న, మాయయన్
మొఘలునఁజిక్కి జ్ఞానమను । ప్రొద్దురహింపకయుండుఁ, గావునన్
జగదవనార్థమై యిల నె । సంగిన బ్రహ్మము రాముఁగొల్చెదన్

శ్రీరామ బాల్యక్రీడాభి వర్ణనము

క. జననీ కనకుల మానస
వనజంబు లమందహర్ష । వారిధి నలరన్,
ఘనమాయా మానుషుఁడ
వ్వనజాతాక్షుఁడు నటించె । బాల్యక్రీడన్.

క. బాలుని విశాలఫాలునిఁ
బాలించుచు ముద్దులొలుకఁ । బాలిచ్చి, కడున్
లాలించుచు హర్షాంబుధిఁ
దేలించుచు రాజమహిషి । దినములు గడపున్.

గీ. తల్లి కౌసల్య యొకనాఁడు । దాశరథిని
జలకమాడించి, పసిఁడి సొ । మ్ములనలంక
రించి, యుయ్యెలం బెట్టి, ని । ద్రింపఁ జేసి,
స్నానమొనరించి దేవతా । ధ్యాన విధికి.

గీ. ఎలమిఁ బూజాగృహంబున । కేగి యందు
వేల్పులకు మ్రొక్కులిచ్చి, నై । వేద్యమునకుఁ
బాకశాలకుఁబోయి, యా । పంకజాక్షి !
చూచె నొకవింత నెంతయుఁ । జోద్యముగను.

క. బాలుఁడు శ్రీరాముం డా
శాలాంతర పక్వ భక్ష్య । సందోహంబున్
లీలన్ దినుచుండఁగ నో
బాలా ! వీక్షించి యామె । భయమొంది వడిన్.

క. సుభ్రాణి ! వినుము, సందే
హాంధ్రేకము తోడ నేగి । యురుతర గాత్రున్

నిద్రా ముద్రిత నేత్రుఁ డై
భద్రాకృతిఁ గ్రాలు రామ । భద్రుం జూచెన్.

చ. ఇరువుర రాములం గని యి । దేటి విచిత్రమొ యంచు, దైవమా
కరము భయంకరంబనుచుఁ । గంపితగాత్రమునం గలంగి, యు
ర్వరఁబడి తల్లడిల్లె; రఘు । రాముఁడు తల్లికిఁదోచినట్టి య
య్యరమరఁ బాప లోఁదలఁచి । యంతటఁజూపెను విశ్వరూపమున్

విశ్వరూప ప్రదర్శనము

సీ. ప్రతిరోమకూపంబు । బ్రహ్మాండములతోడ
శోభాయమానమై । చూడ నొప్పెఁ
గనులెత్తి చూడ శ । క్యంబె యేటికినైనఁ
జంద్రార్క బింబ సం । చయము దోఁచె
నహినాథునకునైన । నలవియే లెక్కింప,
నక్షత్రకోటి యం । తట రహించె
సకల చరాచర । సంతానములతోడ
బ్రహ్మాది దేవతా । ప్రతతి వఱలెఁ

గీ. పర్వతంబులు నదులును । వారినిధులుఁ
గాననంబులు భూములుఁ । గాననయ్యెఁ,
గాలకర్మ గుణ జ్ఞాన । లీలలెల్ల
వపుసఁ గన్పట్టె విశ్వరూ । పంబు నందు.

మ. కలయో మేల్కొనియుంటినో యకట జా । గ్రత్స్వప్న సందిగ్ధ సం
చలితస్వాంతముననా మతిభ్రమను వి । జ్ఞానంబుఁ గోల్పోతినో ?
తలఁపన్ బాలునియందునిట్టి విపరీ । తం బెట్లు గన్పట్టెనో ?
తెలియన్ శక్యమెయంచు నన్వనిత భ । క్తిన్ మోడ్చె నేత్రంబులన్

ఉ. స్వేదకణంబులాస్యమునఁ । జిందులుద్రొక్క, భయంబుపెంపునన్
బాదయుగంబు తల్లడిలఁ । బంకజనాభు ననంతలీలలన్
బైదలి సన్నుతించె నెద । భక్తియు విస్మయ మావరింప; నా
మోదముఁబొందిరాఘవుఁడు । ముద్దుగదాల్చెనుబాలరూపమున్.

గీ. కాలముగతించెఁ గొంత నీ । లీల నంత
నన్నదమ్ములు పెద్దవా । రై రహించి
రందు రాముండు విద్యల । నభ్యసించె;
నతని నిశ్వాసమే వేద । మంబుజాక్షి !

గీ. వరధనుర్బాణధారియై । వఱలువాని
రామచంద్రుని, లోకాభి । రాముఁ జూచి
భువిఁ జరాచరవిగతి, వ్యా । మోహవార్ధి
నోలలాడుచు నుండెనో । లోలనయన !

సీ. సఖులు సంతోషింప । సంచరించుచు నుండు
వేఁటకాండ్రంగూడి । వేఁటలాడు
దల్లిదండ్రులయాజ్ఞఁ । దలఁదాల్చి పాలించు
ననుజుల కనుకూలుఁ । డై మెలఁగు
నితరోపకారంబె । హృదయంబునం గోరు
నాశ్రిత జనులఁ గా । పాడుచుండు
నెట్టిశాత్రవునైన । హింసింప వెనుదీయు
ధర్మమార్గముఁ బ్రోవఁ । దలఁచుచుండు

గీ. సకలవేద పురాణాది । శాస్త్రములను
అనుజులకుఁ జెప్పుటట్లుండ । నఖిల జనులు
నభ్యసింపంగ బోధించు । ననవరతము
సుప్రసన్నుఁడై యుండునో । సుందరాంగి !

చ. కరుణకు నున్కిపట్టనుచు । ధాత్రిస్థలిఁ బ్రోవఁగఁ బుట్టినట్టి యా
సరసిజనేత్రుఁడంచు, ముని । చంద్రులు మేలన సంచరించు దా
శరథిని, సాత్త్వికోదయుని । శాంతునిఁ బ్రాణసమానుగాఁ జరా
చరములలోఁ దలంచుగిరి । జా! యనుమానము మానుమాత్మలో.

గీ. అచ్యుతుఁ డజుండు త్రిభువన । వ్యాపకుండు
నామరూపవిహీనుండు । రాముఁ డతివ!
ధర్మసంస్థాపనార్థంబు । ధరణియందు
నాకృతిం దాల్చి మనుజుఁడై । యవతరించె.

విశ్వామిత్రుఁడు దశరథునిఁ జూడవచ్చుట

గీ. జలజగంధి! గాధిసుతుండు । జపతపో గ
రిష్ఠుఁడయ్యును సన్ముని । శ్రేష్ఠుఁడయ్యె
నీచులైన సుబాహు మా । రీచ దనుజ
పుంగవుల ఘోరబాధకుఁ । బాడవడంగి.

చ. తనదు తపోబలంబునను । దైత్యులఁ జంప వలంతియయ్యు, న
ట్లొనరుప నేటికంచు, నతు । లోగ్రతపోధనరక్షణార్థమై,
మునులను బ్రోవఁగన్ బుడమిఁ । బుట్టిన శ్రీరఘు రాముఁడధ్వరా
వనమునకోపునంచు జన । పాలునిఁ జూడఁ దలంచి చెచ్చెరన్.

గీ. సరయు నదిలోనఁ దనివోవ । స్నానమాడి
భూతిఁ దాలిచి జపతపం । బుల నొనర్చి
యోధులకసాధ్యమైన య । యోధ్య కేగి
ఎలమి నృపునకుఁ దనరాక । నెఱుకపఱచె.

క. మునినాథుఁడైన గాధిజుఁ
డనఘుం డేతెంచెనంచు । నవనీ నాథుం

డనుమోదిత భూసురుఁడై
చని రండని గౌరవించె । సంయమివర్యున్.

గీ. భూసురుల వేదనాదంబు । బోరుకలఁగ
నర్ఘ్యపాద్యాది పూజల । నాదరించి
ఇష్టమృష్టాన్నమునను సం । తుష్టిపఱచి
"అనఘ! భవనంబు పావన । మయ్యెననుచు"

క. వినయానతుఁడై జనపతి
తనయావృతుఁడై యెరంగి । ధన్యుఁడ ననుచున్
దన యాసన మిచ్చిన యం
తన యామోదించె గాధి । తనుజుండాత్మన్.

గీ. దైత్యులను సంహరింపంగ । ధరణియందు
మానవాకృతిఁ దాల్చిన । భానుకులజు
రామునీక్షించి హర్షించె । రాజ మౌని ;
కైరవప్రియుఁ గనిన చ । కోరమట్లు.

ఉ. అచ్చపుభక్తి నెక్కొనఁగ । నంత నరేంద్రుఁడు రాజమౌనితో
ముచ్చటలాడి,"యాశ్రమము । పొంత మృగంబుల బాధ లేదుగా,
ఇచ్చటికేగుదెంచుటకు । హేతువొకించుక యుండవచ్చు, వే
వచ్చినకార్యమున్ జెవుల । పండువుగా నెఱిఁగింపరే దయన్ ?"

ఉ. నావుడు రాజుఁజూచి, ముని । నాయకుఁ డౌనని నవ్వి యిట్లనున్ :
"భూవర! నిన్నుఁబోలు నృప । పుంగవులుండఁగ లోపముండునే?
పావననాము రాము సుర । వంద్యునిఁ గంటివి, దైత్యకోటికిన్
జేవ యణంగకున్నె ముని । శేఖరులెల్లను సంతసింపఁగన్.

క. ఓనరనాథ శిరోమణి !
భానుకులాంబుధి శశాంక ! । వడి మా మనవిన్

వీనుల నిడి రక్షింపుము ;
మారులు కుందిరి సుబాహు । మారీచులచే.

ఉ. వారలసాధ్యులెట్టి నృప । వర్యునకే, నలికాత్ముఁడైన నీ
క్రూరులఁ జంపఁజాలఁడు; వి । కుంఠమునన్ నివసించు మాధవుం
డీరఘురామచంద్రుఁడొకఁ । డే వధియింపఁగనోపు, భూవరా !
మారువచింపరాదు విను । మా! యభయంబనుమా శుభంబగున్.

ఉ. ద్రోహుల రాక్షసాధములఁ । ద్రుంచి, జయేందిరఁ బెండ్లియాడఁగన్
శ్రీహరియైన రామునకుఁ । జెల్లు; శుభంబగు నమ్ముమింక సం
దేహముఁ బొంది జ్ఞానమును । ద్రెక్కొని భీతిలి పుత్త్రుఁడంచు వ్యా
మోహవశంబునన్ గలఁతఁ । బొందకుమా నరనాథ చంద్రమా.

చ. నరవర! రామలక్ష్మణుల । నాపలుకుల్ విని పంపుమా మద
ధ్వరమును బ్రోవఁగాఁ దగిన । వారలు దైత్యులఁ జంపఁబుట్టి దు
ర్వర; నరమాత్రులంచు సమ । రంబున హాని ఘటిల్లునంచు లో
నరమరఁగుంద నేటి కసు । రాంతకు లెంతకుఁ జాలరింతకున్.

## దశరథుని పరితాపము

చ. అన విని తెల్లఁబోయి తన । యా యని రాముని ముద్దులాడుచున్
గనుఁగవ బాష్పతోయములఁ । గ్రక్కుచు వెక్కుచు వెచ్చనూర్చుచున్
వనమునఁ గ్రూరదానవుల । బాధకునోపునె చంటిబిడ్డఁడో
మునివర! యంచుఁ గాళ్ళఁబడి । మ్రొక్కుచు నానరనాథుఁడిట్లనున్.

సీ. "అతుల ప్రతాపవి । ఖ్యాతిఁ గాంచినయట్టి
పావనవంశ సం । భవుఁడ వీవు
ఘాలాత్ముఁడైన నిన్ । బరిభవింపఁగ లేడు
భీకర శస్త్రాస్త్ర । వేది వీవు

సకల లోకంబుల । శాసింపఁ జాలుదు
వందిత భూపాల । వరుఁడవీవు
నూతన సృష్టి మ । నోజ్ఞంబుగాఁ జేయ
వలఁతివి రెండవ । బ్రహ్మవీవు

గీ. వరయశస్వి తేజస్వి త । పస్వి యనుచు
జనులు వినుతింప నెసఁగిన । ఘనుఁడవీవు
శాత్రవుల నిర్వరం జంపఁ । జాలవేనిఁ
బాలు త్రావెడు రాముఁడా । వలఁతి చెపుము !

గీ. రాజ్యమిచ్చెదఁ గైకొమ్ము ; । ప్రాణములను
ధారవోసెదఁ దనియుము ; । దయఁ దలంచి
నన్నుఁ గోరుము ; చక్కని । చిన్నవాని
రామభద్రుని నెడఁబాసి । బ్రదుకఁజాల.

ఉ. అక్కట ! సూర్యవంశ కల । శాంబుధి చంద్రుఁడు బాలరాఘవుం
డెక్కడ, భీకరాయుధము । లెక్కడ, దుర్గమమైన కాననం
బెక్కడ, మాంసభుక్కులయి । యేపుగఁ గ్రొవ్వినవారితో రణం
బెక్కడ, బల్మిమైఁ దునుము । టెక్కడ, యివ్విధిఁ గోరవచ్చునే ?

ఉ. పాడిఁదలంపుమయ్య, బల । వద్రిపుకోటి జయించు సైన్యమున్
దోడుగనిచ్చెదన్, దనుజ । దోర్బలమున్ హరియింప నేను బో
రాడెదఁ, బోరి ప్రాణముల । నైనఁ ద్యజించెద నంతెకాని, నో
నాడకుమో మునీంద్ర! విడ । నాడఁగఁజాలను రామభద్రునిన్."

ఉ. మానవుఁడంచు లోఁదలఁచి । మాధవు రామునిఁ బంపఁజాల నం
చానరనాథుఁడిట్లు తన । యజ్ఞత వెల్లడిఁజేయఁ బిన్న న
వ్వాననసీమఁదోప విని । యానని యమ్ముని మిన్నకుండె న ;
జ్ఞానము వెల్లడింపఁ దగు । నా యని నవ్వ వశిష్ఠుఁ డిట్లనున్.

ఉ. ఓనరనాథవంశ కల । శోదధిపూర్ణ శశాంక! రామునిన్
మానవుఁగాఁ దలంచి వెత । మాటలఁ బల్కెదవైననేమి, యు
ష్మానికి మ్రొక్కి వేగమె కు । మారుల ధీరుల యుద్ధవీరులన్
దానవవైరులన్ బనిపి । ధర్మపదంబును బ్రోవు మిత్రజిన్.

గీ. అధ్వరావనదక్షు లీ । యలఘు బలులు
సమర భీములు, క్రూర రా । క్షసులవలన
హానిచేకూరు ననుచు లో । నడల వలవ
దధిప! నీకుమారులకుఁ గ । ళ్యాణమగును.

ఉ. స్థాణునిచిత్తమందెవఁడు । సంతతమున్ నివసించు, నంబుజ
భ్రూణునిఁ గన్నవాఁడెవఁడు, । భూవర! రాముఁడుగాదె? దానవ
ప్రాణములన్ హరింపఁ బను । పందగు నిమ్మునితోడ; నిత్యక
ళ్యాణముఁ బచ్చతోరణము । నై విలసిల్లును నీపురంబిలన్."

దశరథుఁడు రామలక్ష్మణుల విశ్వామిత్రునితోఁ బంపుట

చ. అనవిని ఱేఁడు గాధిజున । కోదట వంగి నమస్కరించి, యో
యనఘ! త్వదీయభాషణము । లాగమబుుక్కులయంచు నధ్వరా
వనమున కీకుమారులను । బంపెద, నెవ్విధి నాదరింతువో?
వనమున నెట్లు ప్రోచెదవొ? । భారము నీయది యింత యేటికిన్.

గీ. అనుచు వచియించి బాష్పంబు । లను త్యజించి
తనకుమారుల మున్నిడ । దశరథుండు
"అనఘ! మజ్జీవనాధారు । లైన సుతుల
నొసఁగితిని నీకు" నని మిన్న । కుండె నపుడు.

మ. "భళిరే! ధన్యుఁడనైతి నీవలన స । ప్తద్వీప భూపాలదో
ర్బలనాశంకర దుర్మదాసురకుల । ప్రధ్వంస విద్యాంసులన్

బలులన్ బంపితివీవు మత్సవనమున్ । బాలింప, నాలింపుమా
తలపూవాడదు నీకుమారులకు నో । ధాత్రీశ! కళ్యాణమా."

గీ. అనుచు హర్షించి శ్రీరాము । నఘవిరాముఁ
గౌఁగిటంజేర్చి ముద్దాడి । గాధి సుతుఁడు
జనని యనుమతిఁ గైకొని । సత్వరంబ
వత్స! చనుదెమ్మనుడు భక్త । వత్సలుండు.

గీ. వల్లెయని తల్లిఁ గాంతామ । తల్లిఁ గాంచి
మస్తకమువంచి యెలమి న । మస్కరించి
జరిగిన యుదంతముం జెప్పి । జనకకుమని
యనుమతింగొని యమ్మాని । ననుగమించె.

గీ. బాణబాణాసనోగ్ర కృ । పాణములను
గవచములఁ బూని యమ్మాని । కాంతు ననుగ
మించు నబ్బాల వీరులఁ । గాచినంత
శూరులకు గుండె లదరవె । సుందరాంగి!

సీ. అర్ధేందునిభఫాలు, । నాశ్రితావనలోలుఁ,
బరరాజహారరరంహుఁ । బురుషసింహు
నరుణాంబురుహ నేత్రు । శ్యామసుందర గాత్రు,
సంగరోత్సాహు, నా । జాను బాహుఁ,
బాపనాశంకరు, । భక్తవశంకరు,
బలవంతు, ధృతిమంతుఁ, । బరమశాంతు
రవికులాంబుధిచంద్రు, । రంజిత మౌనీంద్రు,
సర్వలోకవ్యాప్తు । సజ్జనాప్తుఁ

గీ. జిత్కళోల్లాసుఁ, బీతకౌ । శేయ వాసు
నఘవిరాము, శ్రీరాము, లో । కాభిరాము

వివిధభంగుల వినుతించి । విప్రవరులు
విధ్య, యీరీతి మూర్తిభవించెననిరి.

గీ. పృథివి భారంబు వారింప । విప్రవరుల
సమరులన్, గోవులన్ బ్రోవ । నవతరించి
నట్టి యీరాకుమారుల । నభినుతింప
నగునె" యని మెంచి యెంతయు । నాత్మ నలరి.

గీ. బాణతూణీర చాప కృ । పాణములను
గవచములుఁ గ్రాల నేతెంచు । క్షాత్రి బాల
వీరపుంగవులం గూడి । వెలుపుఁ దక్క
అడవి వెంబడి యమ్మౌని । వెడలుచుండ.

శ్రీరాముఁడు తాటకను సంహరించుట

చ. అరుణరుచిప్రకీర్ణ నయ । నాంతక నీనికలన్ రహించి, భీ
కరశిత దంతకుంతచయ । ఖండిత మానవకాంర రక్త సి
క్తరసనయై, మృగాంత్రిమయ । కంధరయై, ధృత ముండలాగ్రయై
ధరపదఘట్టనంగదలఁ । దాటకవచ్చె నకాల మృత్యువై.

చ. గడగడఁ బాదముల్ వడఁకఁ । గా మునినాయకుఁడా పెఁజూచి లో
నదలుచుఁ జూచినాడవె న । రాశని ధిక్కృత భీకరాశనిన్ ?
దడయక యొక్క బాణమును । దానియురంబును నాటి వెల్వడన్
విడువుము, నాతియంచుఁ గరు । ణింపకుమా, రఘువీరపుంగవా!

మ. అనినన్ రాముఁడుమాసిచంద్రుఁగని" యుగ్రాస్త్రంబు సంధించి యి
వ్వనితన్ గూలిచి సర్వలోకసుమనో । వ్రాతంబు రక్షింతు నో
యనఘా" యంచు వధించె సాంద్రవన స । త్త్వా ఖేటకన్ శోణితా !
జినయుక్షేటక నిర్జనీకృత మహా । శృంగాటకన్ దాటకన్.

గీ. పార్వతీ! రామచంద్రుని । బాణ నిహతిఁ
బుణ్యజనకాంత యేగెఁబో । పుణ్యగతికి ;
నమ్మునీంద్రుండు శ్రీరాము । నభినుతించి,
యర్హుఁడని యెంచి యఖిల వి । ద్యల నొసంగె.

గీ. మౌని యొసఁగిన విద్యల । మహిమ వలన
క్షుత్పిపాసలు లేకుండె । సుందరాంగి ;
అంతకంతకు నతని దే । హంబు నందుఁ
బృఘుబలంబుఁ దేజంబు నా । విర్భవించె.

సూర్యాస్తమయ వర్ణనము

మ. ఇనవంశీయుఁ డొకండు నేటికొక స్త్రీ । నీరీతి హింసించునే
యని చింతించి విచారభారమున న । య్యర్కుండు మందోష్ణుఁడై
తనకై కుందు పతంగసంచయని నా । దం బాశలన్ బర్వఁగన్
జనియెన్ బశ్చిమదిఙ్మహాంబునిధికిన్ । స్నానార్థియై మానినీ!

సంధ్యాసమయవర్ణనము

గీ. తాటకాముఖోద్గత శోణి । తంబుఁ బోలి
సాంధ్యసమయంబు దీపించెఁ । జరమ దిశను ;
అసురమాయను దలఁపింప । నంత కంత
కంధకారంబు వ్యాపించె । నఖిల దిశల.

చ. కుధరతనూజ! రాక్షసులఁ । గూలిచి ధర్మపథంబుఁ బాదుకొ
ల్ప ధరణిఁ బుట్టినట్టి రఘు । వర్యుని యాదిజయప్రసిద్ధి, స
త్పృథఫలకంబునన్ సురలు । వ్రాయఁగ రాజిలు నక్షరంబులన్
విధమునఁ దోచెఁ దారకలు । విస్ఫుటకైరవ దీప్తివర్ధిలన్.

ఉ. అంతమునీంద్రుఁడా రఘుకు । లాంబుధిచంద్రులఁ గౌగిలించి, మీ
రెంతకుఁజాలరీ దనుజ । నింతకుఁ దెచ్చిన మీప్రతాపమున్
సెంత నుతింపఁజాలు రణ । శూరులు లేరు కుమారులార ! నా
వంతనశించెనంచుఁ బరి । పక్వఫలంబుల నిచ్చె మెచ్చుచున్.

గీ. ఆతఁడొసఁగిన ఫలముల । నారగించి
నిర్భయంబుగ మానితో । నిదురవోయి
వేకువన్ లేచి యబ్బాల । వీరవరులు
అమ్మునీంద్రున కిట్లని । రధికభక్తి.

మ. అనఘా! మే మొనరింపఁజాలుదుము దై । త్యధ్వంసకార్యంబుఁ బా
వనయజ్ఞంబునకుం గడంగుము, భవ । త్పాదంబులన్ గొల్చుచున్
వనముం గాచుచు నుందుమన్న విని వి । శ్వామిత్రుఁ డాఁగాక యం
చొనరింపన్ దొడఁగెన్ మహాధ్వరము ధై । ర్యోత్సాహముల్ నెక్కొనన్

రామలక్ష్మణులు సుబాహు మారీచాది దనుజుల సంహరించుట

గీ. అంత విఘ్నమాపాదింప । నాత్మ నెంచి
బింక మిగురొత్త హుమ్మని । హుంకరించి,
పండ్లు పటపటఁ గొఱుకుచు । బయలు వెడలి,
నీచుఁడైనట్టి మారీచుఁ । డేచె నచట.

గీ. త్రాచుఁబోలిన నీచు మా । రీచుఁ జూచి
రాముఁడనిలాస్త్రమును సత్వ । రముగ నేసెఁ;
దూలమనఁగఁ దదస్త్ర వా । తూలమునకుఁ
దూలి గిరగిరఁ దిరుగుచు । ధూళిఁబోలి

గీ. కడకు శతయోజనాంతమా । జడధినడుమఁ
బడియుఁ దక్కించుకొనె వాఁడు । ప్రాణములను;

పిదప నాగ్నేయమున బాల । వీరవరుఁడు
భస్మరాశిగఁ జేసె సు । బాహు దనుజు.

గీ. అంత లక్ష్మణుం డసుర సై । న్యము వధించె,
వనము నిష్కంటకంబయ్యె । ననుచు మునులు
బ్రాహ్మణులు సంతసించి దీ । వనల నిచ్చి
వేయివిధముల మెచ్చి ర । వ్వీరవరుల.

రామలక్ష్మణులు విశ్వామిత్రునితో మిథిలాపురమునకు వెడలుట

క. ప్రథమ ప్రధనంబుననే
ప్రథితాసురమారకు లన । భాసిలి పిదపన్
మిథిలాపుర ధనురధ్వర
విధిఁ జూడఁగ రాజసుతులు । వెడలిరి మునితో.

గీ. రాజఋషితోడఁ జని చని । రాజ సుతులు
కాడుచందాన నెంతయుఁ । బాడువడిన
గౌతముని యాశ్రమంబున । రాతి బండ
నొండు వీక్షించి రంత ర । ఘూద్వహుండు.

అహల్యాశాపవిమోచనము

గీ. గాధసుతుఁ జూచి యిట్లనెఁ । గరుణఁదోప
ననఘ! యియ్యది యెవ్వని । యాశ్రమంబు
ఇట్లు మరుభూమివైయుండ । హేతువేమి ?
ఒండు రాబండ నడుమ ని । ట్లుండుటేమి ?

గీ. అరయఁ గడు వింతగానున్న । దానతీవె ?
యనవుఁడు మునీంద్రుఁ డిట్లను । నఘవినాశ ?
ఈశ సన్నుత జగదీశ! । నాశరహిత !
ఈ వెఱుంగని వింత యెం । దేనిఁ గలదె ?

గీ. కోడిగముఁ గోరి కోడిద్యై । కోడెకాఁడు
వేలుపులఱేఁడు గౌతము । వెలఁదిఁ గూడె;
నమ్మునీంద్రుఁడు హరి సహ । స్రాక్షుఁ జేసె
నాతి నీరీతిఁ గావించె । నలిన నేత్ర!

చ. అలఘుచరిత్ర! నీదు చర । ణాబ్జరజంబును గోరుచున్నదీ
శిల, కరుణింపవే యనిన । శ్రీరఘురాముఁడు గౌతమున్ మదిన్
దలఁచి నమస్కరింపుచుఁ బ । దంబుల నించుక దాకినంతనే
శిల జలజాక్షియయ్యె ముని । శేఖరులెల్లను సన్నుతింపగన్.

గీ. అఘవిరాము, శ్రీరాము, లో । కాభిరాము,
సద్గుణస్తోము, జయధాము । సమర భీముఁ,
బ్రణతసుత్రాము, వీక్షించి । వంచె మోము,
నతుల శృంగార రసకుల్య । యాయహల్య.

అహల్య శ్రీరాముని స్తుతియించుట

గీ. తనకు చరితంబు కారణం । బున జనించు
సిగ్గునకుఁ దోడు మదిఁ జోద్య । మగ్గలింపఁ
జెమ్మటలుగ్రమ్మ నాకొమ్మ । సొమ్మసిల్లి
మ్రానుపడి డీలుపడియుండె । మౌనమునను.

గీ. పలుకనుంకించు, వెండియు । నులుకువలనఁ
గన్నుగవమూయు నెట్టెట్టొ । కట్టకడకు
మోమించుక యెత్తి శ్రీ । రాము నిట్లు
లలన వినుతించె నెలమి లో । నలమికొనఁగ.

గీ. నతశతానంద! యచ్యుతా । నందకంద!
దేహజశతకంద! వందిత । త్రిదశబృంద!

గిరిశ హృదయాంబుజ మిళింద! । హరిముకుంద!
అనఘ! గోవింద! నేత్రజి । తారవింద!.
చ. జయజయ రాజపుత్ర! సుర । సన్నుత దివ్య చరిత్ర! పాపసం
చయవనవీతిహోత్ర! ముని । శాపమొసంగిన కారణంబునన్
దయఁగల నీపవిత్రముఖ । దర్శనభాగ్యము నాకుఁ జేకురెన్
భయముతొలంగ నోవరద! । భక్తజనావన! లోకపావనా!.
శా. ఏనీదర్శన మబ్జసంభవుఁడు వి । శ్వేశుండు, నాకేశుఁడున్
మౌనుల్ జ్ఞానులుభక్తులున్ సతతమున్ । వాంఛించి ధ్యానింతురో
ఆసీదర్శనమప్రయత్నముగ ల । భ్యంబయ్యె నాకిట్లుడన్
శ్రీనాథాన్వయ వార్ధిశీతఘృణి! రా । మా! దేవ చూడామణీ!
మ. జలజాతంబుల నేలు నేత్రములు, శ్రీ । స్థానంబు వక్షంబు, భ
క్తులఁగాపాడు వరప్రదానమునఁ జే । తుల్, భూతలంబాదిగాఁ
గలలోకంబుల నెజ్జబొజ్జ, నిను న । క్కాణింపఁగా శక్యమే?
బలిచూడామణి నీనుపాదఘృణి, దే । వా! భక్తచింతామణీ!
గీ. భక్తపదపద్మములఁగొల్చి । బ్రతుకుకంటె
వాంఛ వేఱొండు లేదు నా । భావమునకు,
జలదనిభగాత్ర! భాస్కర । కుల పవిత్ర!
దశరథసుపుత్ర! పాప ల । తా లవిత్ర.
క. అని రాము నానతిం గొని
వనితామణి భర్తయుండు । పజ్జకు నేగెన్;
మునితోడ బాల వీరులు
చని చని వడిఁ జేరి రంత । చదలేటి దరిన్.

గంగావతరణ వృత్తాంతము

క. గంగన్, రంగత్తుంగ త
రంగన్, భర్గోత్తమాంగ, । భ్రమదురు భృంగీ

భృంగన్, బాపఘ్నాభి
షంగన్, భక్తానుషంగ, సాగర సంగన్.

గీ. కాంచి హర్షించి వీర రాఘవ వరుండు
అనఘ ! దీని యుదంతమాద్యంతముగను
నా కెఱింగింపవే యని నన్ మునీంద్రుఁ
డిట్టులనియె నుత్సాహంబు నెట్టుకొనఁగ.

గీ. అవి భవదీయ దివ్యపాదాంబుజాత
జాతమకరంద మనఁగఁ బ్రఖ్యాతికెక్కి
హరుని తలమానికంబయి యలరినట్టి
ఈనదికి సాటి యైనది యెందుఁ గలదె ?

గీ. దివిని మందాకిని యనంగఁ దేజరిల్లు
భువిని భాగీరథి యనంగఁ బొలుపుఁ గాంచు
భోగవతినాఁగఁ బాతాళమున రహించుఁ
బతితపావన విఖ్యాతిఁ బరిఢవిల్లు.

చ. జనులకు జీవనంబొసఁగఁ జాలినదంచు రజాపనోదనం
బున నతికెక్కెనంచు నురుపుణ్యఫలప్రదయంచు, లోకపా
వనసలిలౌఘయంచు, భవ ! పాపముఁ బాపఁగ నీసురాపగన్,
మునిఁగి మహాత్ములెల్లఱును బొందెద రక్షయమైన మోక్షమున్.

సీ. పతితపావన ! నీదు వంశంబునన్ మున్ను
జన్మించె సగరుఁడన్ చక్రవర్తి
సరసిజేక్షణ ! వాని కిరువురు భార్యలు
కేశినీ సుమతులన్ కీరవాణు
లందుఁ గేశిని, దుష్టునసమంజసుం గాంచె,
సుమతి యర్వదివేల సుతులఁ గనిరొ ;

నసమంజసుని పుత్త్రుఁ । డంశుమంతుఁడు సద్గ
ణాఢ్యుఁడు, శాంతుఁడు । నలఘుబలుఁడు

గీ. సగరుఁ డధ్వర మొనరించు । సమయమునను
అధ్వరాశ్వంబు నమరేంద్రుఁ । డపహరించి
భూరినిష్ఠను బాతాళ । మునఁ దపించు
కపిలమునివర్యు సన్నిధిఁ, । గట్టి వెడలె.

చ. నరవరుఁడాగ్రహించి సుర । నాయకుఁ డించుక తల్లడిల్లఁగా
నరువదివేల పుత్త్రులను । నాదటఁబిల్చి "కుమారులార ! య
ధ్వరహరి దొంగిలించె నను । వాని వధింపుఁడు వారువంబు న
త్త్వరముగఁ దెండు పొండనుఁడు । వారలు హుమ్మనిహుంకరించుచున్.

గీ. భూతలంబునఁగల దేశ । ములను జూచి
పురవరంబుల శోధించి । భూధరములఁ
జొచ్చి, వనములఁ బరికించి । సొక్కి సోలి
తగిన పరికరంబులఁ బూని । ధరణిఁ ద్రవ్వి.

గీ. తుదకుఁ బాతాళమునకేగి । వెదకి వెదకి,
ఘనునిఁ గపిలమునీంద్రునిఁ । గాంచి వాని
పజ్జదీపించు నధ్వరా । శ్వమును జూచి
అతని నోనాడి రెంతయు । నాగ్రహించి.

క. "మాతండ్రి యధ్వరాశ్వము
నీతీరున దొంగిలింప । నేటికి" ననినన్
ఆతఁడు వారల భస్మీ
భూతులుగాఁ జేసె నొక్క । మొగిఁ గోపాగ్నిన్.

గీ. తుదకు నచ్చోటి కంశుమం । తుండు వచ్చి
అధ్వరాశ్వంబుఁ గొనిపోయి । యాక్షణంబ

తాతకు నొసంగి, యధిక సం । తాప మొందెఁ
దనము పైతృవ్యుఁన్ నాక । మునకుఁ బనుప.

గీ. అల సురాపగా జలముల । వలనఁ గాని
అతి పవిత్రత లభియింప । దపుడు గాని
జనకులకు సద్గతి లభింప । దని యెఱింగి,
తపముఁ గావించి గంగకై । తనువుఁ దొఱఁగె.

క. కట్టకడకు భగీరథ । ఖ్యాతరుండు
ధరఁ గంపింపఁగా ఘోర । తప మొనర్చి,
శివుని మెప్పించి గంగను । నవతరింపఁ
జేసి కృతకృత్యుఁడై భువి । వాసిఁ గాంచె.

క. జనపావనమగు నీ గా
థను విని, నది స్నానమాడి, । దాశరథులు మే
లని, హర్షించుచు వడివడి,
జనకుఁడు పాలించు పురికిఁ । జనిరమ్మునితో.

క. చని నానాదేశాగత
జనవిభు సేనా హరికరి । సంఘాతస్యం
దన సంచలితన్ మిథిలన్
గనిరంతట దైత్యమత్త । గజపంచాస్యుల్.

క. ప్రమదా ప్రమద ప్రదస
త్ప్రమదావన గరిమఁ జూడ । వాంఛించెదవేన్,
ప్రమదామణి! సుమధామ
ప్రమదావనరాశి, మిథిలఁ । బరికింపఁ దగున్.

గీ. కూపములఁ దటాకంబుల । వాపికలను,
వరసరస్సులఁ గైరవ । పద్మములను,

ప్రకృతి శృంగారమునఁ గాలు । పర్వతములఁ
దొలుత నప్పురి నీక్షింప । వలయుఁ జూవె.

గీ. వరచతుష్పథంబుల, దివ్య । భవనములను
సౌధముల, హర్మ్యములను, బ్రా । సాదములను
విపణులను, నిత్యకళ్యాణ । వేదికలను,
జనులు వీక్షించినం జాలుఁ । దనివిదీఱు.

గీ. బ్రాహ్మణులు, క్షాత్రవంతులు, । వైశ్యవరులు,
శూద్రులున్, నీతిపరులు, వి । శుద్ధమతులు
భక్తివిజ్ఞానవైరాగ్య । వైభవమున
ఖ్యాతికెక్కినవార ల । జ్ఞాతనయన !

మ. దివిఁజుంబించెడు ధర్మహర్మ్యములపై । దీపించు పద్మాననా
నివహంబున్ బరికించు దుర్గ్వటుల దు । ర్నీతిన్ నివారింపఁగా
రవివీక్షింపఁగనీయఁ డుగ్రకిరణ । వ్రాతప్రసారంబుచే;
భువిచూడామణిఁబోలునప్పురము సొం । పుం బెంపునూహింపుమా.

గీ. పృథుతపంబును గావించి । వినుతికెక్కి-
నట్టి గాధిపుత్త్రుని రాక । నాలకించి,
జనకుఁ డెదురుగ నేతెంచి । సన్నుతించి,
అర్ఘ్యపాద్యాది విధులచే । నాదరించి.

క. మునినాయక క్షేమంబే
యని, బాలుర చందముఁ గని । హర్షంబెసఁగన్
జనవర కుల పాలకులో ?
మునికులతిలకులో ? యెఱుఁగఁ । బోలదె చెప్పుమా ?

క. కోదక లీదక లెత్తఁ జ
కోరము శశిఁగాంచి, ప్రీతిఁ । గొను చందమునన్,

వీరలఁగని నాహృదయము
గారాబముఁ బొందె ననఘ । కారణమేమో ?

గీ. "నేతి" యనుచు వేదములు వ । ర్ణించునట్టి
బ్రహ్మముభయరూపములూని । వచ్చెనేమొ
అహాహా!! యిబ్బాలకులఁ జూచి । నంత నాదు
హృదయమిపుడు బ్రహ్మసుఖంబు । సేవగించె.

క. అనవుడు విశ్వామిత్రుఁడు
జనకునిఁ గని యీవనినది । సత్యంబనఘా!
ఇనకుల తిలకులు దశరథ
జననాథుని సుతులువీరు । జగదాధారుల్.

గీ. రాముఁడీతండు ఘోర సం । గ్రామ భీముఁ
డతని తమ్ముఁ డీతఁడు లక్ష్మ । ణాహ్వయుండు ;
జన్మముంబొంది దనుజుల । సంహరింపఁ
దనుజులం బంపె దశరథ । జనవిభుండు.

క. బలవిక్రమ రూపంబులఁ
దలపోయఁగ వీరిఁబోలు । ధరణీవరు లి
య్యిలలో నెచ్చోనైనం
గలరే? జనసన్నుత జన । క క్షితినాథా.

గీ. తాటక సుబాహు మారీచ । దనుజవరుల
లీల నొకకోల నేలకుఁ । గూలనేసి,
దేవహిత యజ్ఞముం బ్రోచి । తేజరిల్లె
రాముఁడసురాద్రి నివహా సు । త్రాముఁడనఘ !

చ. అనవిని మేలుమేలనుచు । నమ్మునినాథుని సన్నుతించి, య
జ్జనకమహార్షి, "యీఘనుల । చందము నందము నెంతచూచినన్

దనివినిఁ బొందఁ దీమనము । ధన్యుఁడనైతి మునీంద్ర" యంచు భో
జనమిడి గౌరవించి వర । సౌధమునన్ విడియించె బాలురన్.

రామలక్ష్మణులు మిథిలాపురమున విహరించుట

క. మరునాడు బాలు రిరువురు
నరుణోదయవేళ, మౌని । యనుమతిఁ గొని య
ప్పురవరమునఁ గల వింతల
నరయఁగ వడి నిర్గమించి । రత్యాసక్తిన్.

క. బాలున్ రవికుల వర భూ
పాలున్ సంతత కృపాల । వాలున్ నత గో
పాలున్, మునిజనలోలున్
లోలాక్షులు రాజవీధి । లోఁ గని రెలమిన్.

సీ. పద్మాక్షు నీక్షించి । పద్మాక్షి యొక్కతె
జనవంద్యుఁ డితఁడంచు । సన్నుతించె;
రాజహంసనుజూచి । రాజాస్య యొక్కతె
హంసవంశ శ్రేష్ఠుఁ । డని నుతించె;
జలధరశ్యాముని । జలదవేణి యొకర్తు
తిలకించి మోహించి । జలదరించె;
సింహసంహనుని । సింహమధ్య యొకర్తు
పరికించి వలవంతఁ । బరితపించె;

గీ. అల యహల్యను గాపాడి । నట్టి యితని
పాదధూళికి శివుమేని । భస్మధూళి
కెట్టి భేదంబు లేదని । యింతియోర్తు
మెచ్చి యొక మచ్చెకంటితో । ముచ్చటించె.

గీ. రామచంద్రునకున్ మ్రొక్కె । రామ యోర్తు
లక్ష్మణునిఁ జూచి హాసించె । లలన యోర్తు
రామలక్ష్మణులం జూచి । భామ యోర్తు
ఎలమి ననిమిషనేత్రయై । నిలిచియుండె.

చ. "ముదిత యెఱుంగవే? జనక । పుత్త్రికఁ బెండిలియాడఁ గోరి య
మ్మదనుఁడు వచ్చె మిత్రుఁడగు । మాధవుతోఁ బరికింపు" మంచు నా
సదయునిఁ గీర్తిసాంద్రు ననుజన్మునితోఁ జను రామచంద్రునిన్
మదవతి యోర్తు చూపె నొక । మానినికిన్ నవ యౌవనాంగికిన్.

క. "తాటకను సంహరించిన
హాటకచేలుం డితండు" । యని యోర్తు జగ
న్నాటకసూత్రిన్ బురశృం
గాటకమునఁ గని తన చెలి । కత్తెకుఁ దెలిపెన్.

క. "వడి నడవికిఁ జని యొక్కు
మ్మడి విల్లెక్కిడి సుబాహు । మారీచుల యే
పడఁచిన బాలున్ గంటివె
పడఁతీ? యని రాము నొకఁడు । భార్యకుఁ జూపెన్.

గీ. ధరణికన్యకఁ బెండ్లాడఁ । దగిన వరుఁడ
హరకఠోర ధనుర్భంగ । మలఁతియగు నె"
అని తలంచి రాముని ఖ్యాతి । నాలకించి
ధైర్యముం బూని యొకవృద్ధ । తనివిఁ బొందె.

క. "మనజానకిఁ బెండ్లాడఁగఁ
జనుదెంచిన సకల రాజ । సంతతి లోపన్
ధనువుం దునుమం గలఁడీ
ఘనుఁ" డంచును రాము నొక్క । కాంత నుతించెన్.

మ. తనమోహమున్ గనినంతమాత్రమునఁ గాఁ । తా బ్రమదమిూత్తిరనన్
వినుతింపన్ బురవీథులంగడచి శ్రీ । విన్ రాజమార్గంబునన్
జని, సౌధంబుల భర్మహర్మ్యములఁ బ్రా । సాదంబులన్ మెచ్చి హె
చ్చినవేడ్కన్ రఘురాముఁడాక్షయెడగాఁ । చెన్ బుష్పితోద్యానమున్

ఉద్యానవనమున సీతారాముల యన్యోన్యావలోకనము

ఉ. అమ్మహనీయుఁడంత ముదమందుచు లక్ష్మణుఁ జూచి "చూచితే
తమ్ముఁడ! సొంపునింపు ప్రమదావనరత్నము నందనోపమా
నమ్మును, దీనిఁబోలిన వనమ్ము జనమ్ములు చూడరెందు ని
క్కమ్ముగఁ; బూలఁ గోయుదమె । గాధితనూజుని దేవపూజకున్.

క. అని తమ్మునితోఁ బ్రమదా
వనమును వీక్షింపఁ జొచ్చి । ఫలపుష్పములన్
గొని, యభ్రంకష కుజములఁ
గని, చని చని చూచె నొక్క । కాసారంబున్.

ఉ. సారసకైరవప్రకర । జన్మగృహంబననొప్పు సార కా
సారముఁ జూచి, యందుఁ గల । సారస పక్షుల రాజహంసలన్
సారెకు జూచి, మెచ్చి "నృప । చంద్రముఁడు పజ్జకుఁ జేరఁబోయి త
త్తీరమునందుఁ గాంచె సుద । తీమణి మన్మథుఁ గన్న సుందరిన్.

ఉ. జానకియంచు లోనెఱుఁగఁ । జాలక చక్కఁదనంబు మెచ్చి, "యహా
రా! నవమోహనాంగి యన । రాదె? వివాహితయేనిఁ బావనం
బైన మదీయమానసము । నందదయించునె ప్రేమ స్వప్నమం
దైన? రఘూద్వహుండ నక । టా! పరకాంతలఁ జూచువాఁడనే?

ఉ. పావనమై రహించు రఘు । వంశమునం దుదయించినట్టి వా
భావము కైతిఁగోరి పర । భామలఁ గూడఁగ నిచ్ఛగించునే?

ఈవనితాలలామ, జల । జేక్షణ, చక్కని కన్నెమిన్న" యం
చావరుఁడాత్మలోఁదలఁచి । యాదటఁజూచుచు నిల్చియుండఁగన్.

ఉ. జానకియున్ రఘూద్వహుని । చక్కఁదనంబునుజూచిమెచ్చి, యే
మానవభక్తయిట్టి యస । మానుఁడు సూనుఁడుఁగా రహించె, నా
మానస మీమనోహరుని । మానసవీధి భ్రమింపఁజొచ్చె, భూ
జానికుమారుఁడో మరుఁడొ । చంద్రుఁడొ యింద్రుఁడొ యాయుపేంద్రుఁడో.

ఉ. సంతసమయ్యెఁ గంతుని, వ । సంతు, జయంతు, దిసంతుకొట్టు నీ
కాంతుఁడెవండొ? యంతిపురి । కాంతలు సంతతముం జరించు నే
కాంతవనాంతరంబుఁ గనఁ । గాఁ జనుదెంచిన యీవయుండు భా
స్వంతుఁడొ? సంభ్రమింపకుము । స్వాంతమ! శాంతముఁబూనుమింతటన్.

మ. అదిరా! యాకనుదోయిసొంపు, భళిరా! । యామోమునందంబు; న
మ్మదనుం గన్నమహానుభావుఁడగు ని । మ్మాన్యుండు సామాన్యుఁడే?
హృదినూహింపఁగ, నారమావిభుఁడె యి । ట్లేతెంచెనో గాక, యే
సుదతీరత్నము వీని పేసరము పై । శోభిల్ల జన్మించెనో?

ఉ. ఎందును లేరు రాజవరు, । లెందును లేరు మనోహరాంగు లిం,
కెందును లేరు వీరవరు, । లెందును లేరు మహానుభావు లీ,
యందముఁ జందముం గలదె? । యక్కట! యీపురుషోత్తముం గనా
డెందము నొంగిలించె; విక । టించె సుమాయుధుఁడేమిసేయుదున్?

శా. ఏఁడీ చక్కనివాఁడు? లేఁడు భువిలో । నీమేటికిన్ సాటిగాఁ
జూడన్ గన్నుల నెత్తి యెట్టివరు నేన్; । శోకించి నాతండ్రి యె
గ్గాడుం గాక; మదీయనాయకుఁ డితం । డౌ; నిన్వరున్ గోరి పెం
ప్లాడన్ బ్రహ్మములేని గుట్టముఁ గతిన్ । స్వాంతంబు పర్వెత్తెడున్.

మ. హరకోదండవిఖండనంబునఁ గదా । ప్రాప్తించుఁ గళ్యాణ మి
వ్వరుఁ జేర్మించి ప్రతిజ్ఞలో మఱచితిన్, । భావింప నిబ్బాలుఁ డె

క్రూరాశిన్ భీకరకార్ముకంబుఁ దునుమం। గా నోపు? బ్రహ్మాది ని
ర్జరులారా? కరుణించి తోడుపడరే, ।రక్షింపరే? మ్రొక్కెదన్.

ఉ. పావనవంశసంభవు, న। పారకృపాకరు, సర్వలోక ధ
ర్మావనలోలు, ఫుల్లధవ। ళాంబుజపత్త్రవిశాలనేత్రు, నే
నీవనసీమఁ జూచి వరి। యించితిఁ, దోడ్పడుమమ్మ పెండ్లికిన్
జీవనధాత్రి, ధాత్రి! పుర। జిద్ధనురధ్వరదీక్ష పూర్తిగాన్.

క. అని జానకి ప్రార్థింపఁగ
వనితాకృతిఁ దాల్చి యంత। వసుమతి తన నం
దనఁ గౌఁగిలించి యిట్లనుఁ
"దనయా! ప్రేమించితీవు। దశరథ తనయున్.

మ. ధవళాబ్జాక్షుఁడు మాధవుం డఖిల దై। త్యశ్రేణి శిక్షింప, వా
సవు రక్షింప జనించెఁబో దశరథ। క్ష్మాపాల పుత్త్రాకృతిన్;
శివుచాపంబుఁ బుటుక్కునం దునిమి నీ। చిత్తేశుఁడై భార్గవ
స్తవముం గైకొని యింటికిం జను మన। స్తాపంబు నీ కేటికే?

క. అరయఁ జతుర్దశ భువనో
దరుఁడీ దశరథతనయుఁడు, । తనయా! ధరణీ
ధరముల బంతులఁ జేయున్,
హరచాపముఁ ద్రుంచు టేమి। యతనికి లెక్కా?

క. ఈ రీతి నెఱుకపఱచిన
ధారుణి, సీతాసఖియను। తలఁపుం గొని యా
శ్రీరాముఁ డుండఁ దగ దని
యారామముఁ బాసి వెడలె। ననుజని తోడన్.

ఉ. పిమ్మట ధాత్రి, పుష్పవన। వీథినిఁ జొచ్చి, సుమాళిఁ దెచ్చి, దా
పమ్మగఁ గుచ్చి, మెచ్చి, సుకు। మారికి నిచ్చి, వచించె నిట్లు "చా

పమ్మనుమ్రించి నీదుకర | పల్లవమున్ గ్రహియించు రాము కం
ఠమ్ము నలంకరింప లల | నా! సుమదామము నీకొసంగితిన్.

చ. అదె చెలికత్తెలెల్లరును | తాంతములంగొని యేగుదెంచిరో
మదగజయాన! లోన నను | మానము మానుము, రామునిన్ వరిం
చెద"వని పల్కి యవ్వసుధ | శీఘ్రముగన్ దనయింపుఁ బొసె; లో
నదవదఁ జెందుచున్ సకియ | లందఱువచ్చిరి పుష్పరాశితో.

గీ. "ఒంటిమెయి నుంటివే మచ్చె | కంటి!" యనుచుఁ
బుష్పహారంబుఁ దిలకించి | "పుష్పగంధి !
హారముం గ్రుచ్చితే" యంచు | నభినుతించి
జానకిం గౌఁగిలించిరి | సకియ లెలమి.

చ. చెలులు వచించు పల్కులకు | సీత కడుంగడుఁ బ్రీతిఁ గాంచి, వా
రలు గొని తెచ్చినట్టి సుమ | రాజికి నెంతయు సంతసించి, ము
ద్దులొలుకు ముచ్చటల్ జగపి, | తూరుపుఁ జూచి, బిరాన లేచి, తాఁ
దొలుతగమించెఁ, బుష్పముల | తోఁ జెలికత్తెలు వెంబడింపఁగన్.

క. శ్రీరాముఁడు లక్ష్మణుతో
నారామము నుండి వెడలి | యతిరయమున, లో
నారామఁ దలఁచి మెచ్చుచు
గారామున, విడిది కేగె | గాధిజు డలరన్.

గీ. వారు గొని తెచ్చినట్టి పు | ష్పములఁ గాంచి
ప్రమదవనమున కేగిన | వయస నెంచి
రాము నెమ్మోముఁ బరికించి | రాజమౌని
సర్వము గ్రహించి యెలమి నా | శీర్వదించి;

గీ. పూజఁ గావించి బాలురఁ | బుణ్యఖనుల
నిష్టమృష్టాన్నముల భుజి | యింపఁ జేసి

వరిపురాణ గాథలఁ జెప్పి । భావములను
మోదమిగురొ త్తఁగన్ గొంత । ప్రొద్దుపుచ్చి.

సూర్యాస్తమయ వర్ణనము

మ. వనజాతాక్షుఁడు జానకిన్ వలచె, మ । ద్వంశీయుఁ డప్పేరుఁడే
జననాథోత్తముఁడేన్ గడల్పుటకు దు । స్సాధంబుగానుండు భ
గ్నునికోదండము రేపుతుల్యించు నమరుల్ । కొండాడఁగన్, గర్మ సా
క్షిని నేస్నానముఁ జేసివత్తునని క్రుం । కెన్ సూర్యుఁడస్తాంబుధిన్.

చ. జలజసఖుండు పద్మినుల । సంగతిఁగాంచియుఁ దృప్తిలేక సా
నుల కనురాగమిచ్చి కడు । నొచ్చి వసూత్కరహీనుఁడయ్యుఁదన్
వలచినయట్టి పుష్పవతి । వారుణిఁగూడఁగ వచ్చినంత, దో్
జలరుహనేత్రి చల్లిన ప । సంత మనంగ రహించె సంధ్యయున్.

గీ. పశ్చిమ దిగంతమున సంధ్య । ప్రజ్వరిల్లి
నంత సంయమీశ్వరుఁడు స్నా । నార్థమేఁగె;
సాంధ్యకృత్యంబులందీర్చి । శౌచ మొంది
వార్చి యర్చించి రఘుపురు । వందనంబు.

మ. అలమెన్ మోదుగుపూచెనాఁ జరమసం । ధ్యాకాంతికూపెట్టచున్,
బులుగుల్ గూండ్లకుఁ బాఱెఁగాముకులవ్యా । మోహంబుతోనంధకా
రలతల్. దిక్కులఁ బ్రాకెఁ దత్సుమములై । రాజిల్లె చుక్కల్ జగం
బలసెన్ దమ్ములసొంపుఁ బెంపణఁగె నా । కల్లాడదే మ్రాకునన్.

చంద్రోదయము

గీ. చటుల గాఢాంధకారమున్ । సకల దిశల
గరములం జించి చెండాడి । కలువ చెలువ
చెలువమిగురొత్త వెలలేని । వలపు లలర
నుదయగిరి వీథిఁ జంద్రుఁడ । భ్యుదయ మొందె.

క. శీతాంశుఁ బుట్టినవానిన్
జేతోభవు మేనమామ । క్షీరాబ్ధిసుతున్
సీతావదన సమానున్
సీతాంశునిఁ జూచి చూచి । శ్రీరాముఁడనున్.

చంద్రోపాలంభనము

క. చేతోజాతుని నవకం
జాతాస్త్రము ధిక్కరించు । సంపదఁ గల యా
సీతాముఖ బింబమునకు
నీతండు సమానుఁడనిన । నేనోపుదునే ?

సీ. హాలాహలానల । జ్వాలానుజుఁ డనంగ
జడధిలో జనుఁడయి । వాడమకున్న
విరహులు దుఃఖింప । వేధించువాఁడను
బహుళ కళంకంబుఁ । బడయకున్నఁ
బర్వకాలంబున । వైభవం బుడివోవ
సైంహికేయునివాత । గ్రస్తకున్న
వలపుకత్తెలఁగల్వ । చెలువల నలరింపఁ
జెల్లెలుండు గృహంబుఁ । జెఱపకున్నఁ

గీ. జెలఁగి చక్రవిద్వేషియై । మెలఁగకున్నఁ
బగలు సత్ప్రభచ్యుతి వెల్ల । బాఱకున్నఁ
దమ్ములకుఁ గీడు గూర్చు రే । ద్రిమ్మరీడు
ఈడుగానోపు సీతాము । ఖేందునకును.

క. అని చంద్రోపాలంభన
మున సీతాముఖవిలాస । ముం బొగడుచు లోఁ

జనియోవఁ దలఁచి యలరుచు
వనజాక్షుఁడు మోడ్చె నేత్ర । వనజాతములన్.

గీ. శివుని ధనువును ఖండించి । సీతఁ బెండ్లి
యాడ నీకేయి యాటంక । మయ్యె ననుచు
నించుకంత రాముండు ని । దించి యుండఁ
దెల్లముగ నంత భక్తునఁ । బెల్లవాఱె.

సూర్యోదయము

క. విదళించుచుఁ దమసంబును,
వదలించుచు భృంగ సంఘ । బంధముఁ, బ్రజలన్
మెదలించుచుఁ, గెందమ్ములఁ
బొదలించుచు నినుఁడు తూర్పు । పున నుదయించెన్.

ఉ. కౌముదిఁ బాసెఁ జందురుఁడు । కైరవముల్ ముకుళించె, నాయుడు
స్తోమము కాంతిఁ దక్కె, రవి । తూర్పునఁ దోఁచి రహించినంత; శ్రీ
రాముని యాగమంబుఁ గని । రాజవరుల్ దరహాసహీనులై
మోములవాంచి బింకమును । బొంకముఁ బాసినరీతి నత్తఱిన్.

గీ. శూరుఁడగు లక్ష్మణుండంత । సోదరునకు
మౌనివరునకు నెలమి న । మస్కరించి,
హరకఠోరధనుర్భంగ । మాత్మఁ దలఁచి,
భావి శుభసూచకంబుగఁ । బలికె నిట్లు.

చ. "నరవరులెందఱున్న రఘు । నాయక! యీవ వలంతివాఁడ వీ
శ్వరునికఠోరకార్ముకము । వంపఁగఁ ద్రుంపఁగ; దృక్పథంబు పై
నరిగొను నంధకార నిచ । యంబుఁ గరంబుల సంహరింప భా
స్కరునకుఁగాక చుక్కలకు । శక్యమె కాంతి యొకింత గల్గినన్.

సీ. పరరాజ నక్షత్ర । వైభవంబు నశింప,
నఖిలదిక్కులఁ దేజ । మావరింప,
లోకంబులున్ భక్త । కోకంబులు రహింప,
సమర పద్మామోద । మతిశయింప,
ద్విజ సన్మునీశ్వర । ద్విజసంఘము నుతింప,
సజ్జన భ్రమరముల్ । సంభ్రమింప,
మేదినిం గల ప్రజల్ । మేల్కాంచి శ్లాఘింప,
వంశ మున్నత కీర్తిఁ । బ్రిస్తరింప

గీ. కాలగళ ఘోర ధనురంధ । కార పటలి
లీల నొక కేల విదళింపఁ । జాలుదీవు ;
భానువంశ ప్రదీప! దీ । వ్య ప్రతాప !
రమ్యతరకీర్తిసాంద్ర! శ్రీ । రామచంద్ర !

మ. అనియారీతిరఘూద్వహున్ పృథులశౌ । ర్యౌదార్యసీఘూర్వహున్
గని సౌమిత్రి వచించుచుండఁగఁ శతా । నందుండు వేంచేసి, "య
జ్ఞనకక్ష్మాపతి పంచె రం" డనిన, వి । శ్వామిత్రుఁడా సద్యశో
ధనులన్ దోడ్కొని యజ్ఞశాలకుఁ జనెన్ । ధాత్రీశ్వరుల్ భీతిలన్.

### మునితో రామలక్ష్మణులు యజ్ఞశాలఁ బ్రవేశించుట

మ. "అదిగో వచ్చిరి వచ్చి"రంచుఁ బ్రజ లా । హా యంచు నగ్గింపఁగా
నెదురేతెంచి, బహూకరించి, జనకుం । "డేతెంచినారింక మా
కొదవం దీర్పఁగ"నంచు నాసనములన్ । గూర్చుండఁగాఁ బెట్టి, స
మ్ముదమే పారఁగ ముప్వరందనిపెఁ దాం । బూలాది మర్యాదలన్.

చ. కటకట!: ఖడ్గకాండశర । ఖండిత వీరకులంబు మాబలం
బటమటఁ జెందునే? శివశ । రాసన మొంతటి? దంచు నవ్వుచున్

పటపట మాటలాడు నృప । వర్యులచే వరవీరకోటిచేఁ
గిటకిటలాడు శాలఁ బరి । కించి హసించిరి రామలక్ష్మణుల్.

గీ. సకల శాత్రవ సంతతి । సంహరించి
తేజరిల్లిన సంగ్రామ । ధీరుఁ డొకఁడు
"వీర రసమిట్లు మూర్తిభ । వించె" ననుచు,
రామచంద్రుని వీక్షించి । ప్రస్తుతించె.

సీ. కుటిలభూపాలుఁ డొ । క్కరుఁడు రాముని జూచి
బీభత్సముఖుఁడని । భీతిఁ జెందెఁ,
గపటదైత్యుఁ డొకండు । కంజాక్షు నీక్షించి,
దండధరుండంచు । బెండు వడియె,
సుందరాంగులు రాము । సౌందర్యమున్ మెచ్చి,
యభినవమరుఁ డంచు । నభినుతించి,
రసఘులు మౌను లా । యభిరాముఁ దిలకించి,
నారాయణుం డంచు । నతులొసంగి

గీ. రతనిఁ బరికించి జనక భూ । పతి, మహర్షి
యనుచుఁ జింతించి యొంతయు । నతిశయించె,
యోగివరుఁ డితఁడనియొక్క । యోగి యెంచె,
సుప్రసన్నాత్ముఁడని యొక్క । సుజనుఁ డలరె.

గీ. ధీరుఁడగు రాముఁ జూచి శా । స్త్రియుఁ డొకఁడు
సకలశాస్త్రీయ మత రహ । స్యములకెల్ల
నెల్లయనియెంచి మిక్కిలి । యుల్లసిల్లి
అతని గురువుగ భావించె । నాత్మయందు.

గీ. "ఇంత చక్కని బాలు నే । కాంత కాంచె
నామె జన్మంబు సార్థక । మయ్యె" ననుచు,

వృష్టి యొక్కర్తు శ్రీరాము । శుద్ధ శాంత
మూర్తిఁ దనివోవఁ జూచి లో । ముద్దలాడె.

సీ. వికసిత శ్వేత పద్మాక్షుఁ । బీనవక్షు,
సంగరోత్సాహు, సుందరా । జానుబాహు,
రాముని జూచినంతనె । రాజవరుల
గుస గుసలు హెచ్చె, హెచ్చిన । యెసక మఱఁగె.

ఉ. "ఇందుకళా కిరీటునకు । నీతఁడు సాటి యనంగ నొప్పు, న
స్పందిత ధైర్య శౌర్య గుణ । వంతుఁడనంతుఁడు సందియంబు లే
దందగరాని పంక్తికయి । యత్నులు సాచితి మింక సీతకై
వందర నేటి" కంచుఁ దమ । వాంఛఁ ద్యజించిరి కొందఱు క్షితిన్.

ఉ. చక్కనివాఁడ యెక్కరణి । జానకిఁ బెండిలియాడు? నక్కటా!
చెక్కు చెమర్చినంత నిజ । చేష్టలఁదక్కి పసుంపు బాలకుం
డెక్కడ! యీశ్వరుండు ధరి । యించి త్యజించిన ఘోర కార్ముకం
బెక్కడ? చూడ శక్యమగు । నే?"యని యెంచిరి కొందఱు క్షితిన్

గీ. జాల మింకేటికని మురుల్ । సంభ్రమింప,
జనకుఁడౌనని సమయ మా । సన్నమయ్యె
ననుచు సీతకై చెలులను । బనిపినంత,
వల్లెయని యామె శాలకు । బయలు వెడలె.

సీతా సౌందర్యాభివర్ణనము

గీ. వసుధ దీపించు నుపమాన । వస్తు వితతి
జనక పుత్త్రిక వర్ణింపఁ । బనికిరావు;
దేవ దానవ మానవ । స్త్రీ సమాజ
మామె పదసేవఁ గావింప । -నర్హ మగును.

గీ. అతుల వాచాల భారతి । యలంతి యయ్యె
నీవు నష్టాంగివైతివి । నీరజాక్షి !
రతి యనంగుని వనిత, శ్రీ । రమణి చపల ;
జనక సుత సాటిగానోపు । సతులు గలరె ?

మ. వనితా! మారుండు, సర్వలోకముల శో । భన్ రజ్జువుం జేసి, పా
వనశృంగారము మంధరాచలముంగా । భావించి బంధించి; నూ
తనలావణ్యపయోనిధిన్ దరిచినం । తన్ దోచు శ్రీలక్ష్మియే ;
జనకక్ష్మాపతి పుత్రి, కానియెడ నీ । సౌందర్య మిట్లుండునే ?

గీ. లీల, జయమాల యొక కేలం । గ్రాల నలరు
సీత నీక్షించి నృపులు ని । శ్చేష్టులైరి ?
దాశరథిం జూచి లజ్జించి, । తలను వంచె
సర్వభువనైకమాత, భూ । జాత సీత.

గీ. సద్గుణస్తోము శ్రీరాము । సన్నుతించి,
ప్రేమ మీఱంగ మూర్తిభ । వించె ననుచుం
గొమ్మ తనవాలుం జూపులం । గ్రుమ్మరించి
చెలులతోం దండ్రి పజ్జను । నిలిచి నంత.

వందిమాగధులు జనకుని ప్రతిజ్ఞం బ్రకటించుట

క. జనకుండు వందిమాగధ
జనులం గని "నాదు ప్రతిన । జననాథులకున్
వినిపింపుం" డనిన వారలు
ఘనవాక్కుల నిట్టులనిరి । కవితా సరణిన్.

క. మోహావశంబున సీతో
ద్వాహముం గాంక్షించినట్టి । పార్థివులారా !

బాహుబల చంద్ర మండల
రాహువు, ఫాలాక్షధనువు । రండు గ్రహింపన్.

ఆ. బాణ రావణాది । పాషాణకాయులు
కేల నెత్తలేక । కూలఁబడిరి ;
కొండఁబోలినట్టి । కోదండ మియ్యది ;
రండు రాజులార ! । బెండువడక.

ఉ. మానవనాథులార! యభి । మానముతోఁ బనిలేదు, మీరు స
న్మానముఁ గోరువారలను । మాట నిజంబగు, నైన నేపుమై
నేనృపవర్యుఁడీ ధనువు । నెక్కిడఁ జాలు, నతండె యీసభన్
జానకిఁ బెండ్లియాడుటకుఁ । జాలినవాఁడగు నెల్లభంగులన్"

క. ఈరీతి వందిమాగధు
లా రాజులఁ జూచి పలుక, । నందఱు దురహం
కారావేశంబున హుం
కారముఁ గావించి సీతఁ । గాంచిరి గిరిజా !

రాజుల ధనుర్భంగ ప్రయత్నము

సీ. "ఏపాటి యీచాప । మెక్కిడఁగా" నంచు
నొక్కండు హుమ్మని । హుంకరించె
"బ్రహ్మాండమయ్యె నీ । ప్రతిన" యంచు హసించి
యలవోక నొకఁడు మీ । సలను ద్రిప్పె,
"ఈశ్వరు కృపయున్న । నెక్కిడ లేకేమి"
యని మెంచి నన్నొక్కఁ । డభినుతించె ;
"బరిభవింపఁగఁ జేయు । ప్రతిన యియ్యది" యంచు
నత్యుగ్రుఁడై యొక్కఁ । డాగ్రహించె ;

గీ. "సీత తలఁదన్న చక్కని । చెలువ మిన్న
యుర్వి లభియింపదే యని" । యొక్కఁ డలిగెఁ,
"దరుణి దండకు? హరుని కో । దండమునకు
దండ" మని యెంచి యొక్కండు । బెండు వడియె.

క. మీసము లేరీ యనుచున్
మీసములం ద్రిప్పి త్రిప్పి । మృత్యుంజయ బా
ణాసన మాకర్షింపగ
నాసించుచు రాజసింహు । లరిగిరి గిరిజా!

సీ. అవలీలఁ దునిమెద । నని పల్కి యొక్కండు
కేల నెత్తఁగలేక కూలఁ బడియె,
వదనంబు జేవురిం । పఁ గడింగి యొక్కండు
రక్తమున్ భళ్ళునఁ । గ్రక్కి వెడలె
మీసంబులను నుల్పి । రోసించి యొక్కండు
హుమ్మని గుంజించి । యుర్వ కొఱఁగె,
తనయిష్టదైవంబుఁ । దలఁచుచు నొక్కండు
కెంగేలఁబట్టి గ్రు । క్కిళ్ళు మ్రింగె,

గీ. వేగముగ నేగి బలమునై । లాగి లాగి
చెమ్మటలఁ గ్రక్కి యొక్కండు । సొమ్మసిల్లె,
విల్లు గదలింపఁ జాలక । విడువలేక
సీతఁ జూచుచు నొక్కండు । చేష్టలుడిగె.

గీ. వసుధ నొకలీలఁ గదలింప । వచ్చుఁగాని
దీనిఁ గదలింపఁ బూనిన । హాని యొదవు,
బలుసు కూరైనఁ దినవచ్చు । బ్రదికి యున్న
ననుచు నొకఁ డేఁడు తనస్థలం । బునకు వెడలె.

గీ. అవనిఁ బ్రఖ్యాతికెక్కిన । యతుల బలులు
పల్లటీల్దాటి చెల్లఁబో । పల్లటిలిరి,
ఏనుఁగు లడంగె దోమల । నెవ్వఁ డడుగు
నని తలంచిరి తక్కిన । మనుజవరులు.

గీ. ఎత్తవచ్చిన రాజుల । సత్తు ద్రుంగి,
అంతకంతకు బసువెక్కి । యతిశయించి,
కోండవలెనుండె నాదుకో । దండ మతివ,
దానిఁ గదలింపఁ జాలరీ । మాన ధనులు.

గీ. భయదతర్జన భర్జన । వాక్యములకు,
వశమునకు రాని వర పతి । వ్రతను బోలి,
అవని నాథాభిమాన ప్ర । యత్నములకు
సంచలింపక యుండె నా । చాప మబల.

గీ. భూవరుల భావముల దైన్య । మావరింపఁ
జెన్ను మీఱిన మోములు । చిన్నవోయె,
వారి శౌర్యంబు పరిహాస । పాత్రమయ్యె
నకట వైరాగ్యహీన స । న్న్యాసమట్లు.

జనకుఁడు రాజులనోదార్చ సంతాపించుట

క. వనితా వినుమంతట న
మ్మనుజాధిపు లుక్కుఁదక్కి । మాన వ్రతులై
తనదిక్కుఁ జూడ నత్తఱి
జనకుండు వచించె నిట్లు । సంతాపమునన్.

ఉ. మానవనాథులార! యభి । మానవశంబున వచ్చినారు సం
స్థానములన్ దొఱంగి, హర । చాపము నెక్కిడశక్యమా నె? మా

జానకిఁ బెండ్లియాడు బల । శాలి జగంబునఁ బుట్టలేదె ? తే
జోనిధి యొక్కఁడేన్ గలఁడె? । శూరులవంశము గొడ్డుపోయెనే?

చ. ఇరువది బాహుదండముల । నీసునఁగంబుఁ గదల్చినట్టి యా
సురపతివైరి రావణుఁడు । సొమ్మసిలెన్ గదలింపలేక యా
హరధనువున్, సహస్రకరుఁ । డైన మహాబలశాలి బాణుఁడున్
ధరణిధరంబుగాని యిది । ధర్మముగాదని యేగె నింటికిన్.

మ. హరకోదండము నెక్కు-పెట్టఁ గలరే । యత్యల్ప భూపాలు రి
ద్ధరణిన్ జానకి కన్యకాత్వమున సం । తాపించు గాకింతకున్
వెరవింకెయ్యది? భూతలంబకట ని । ర్వీర్యంబునన్ బాడఁ జెన్
దురహంకారము సంహరింపుఁడిఁక మీ । దోర్గర్వముల్ ఖర్వముల్.

చ. అనఘుఁడుక్షత్రియుండు సమ । యంబు దప్పెనె?వీరుఁడొక్కఁడేన్
ధనువునువంచియున్న లల । నామణిశోడ నమేయ సద్యశో
ధనము లభించియుండును గ । దా? ధను వించుక యేన్ జలింపదే?
వనజభవుండు నాసుతకు । వ్రాయఁడుగాక వివాహయోగమున్.

గీ. అఖిలభూపాలు రేతెంచు । టట్లుండె
దేవతలుఁ గిన్నరులుఁ బూర్వ । దేవతలును
వేషధారులై వచ్చిరి । బెండు వడిరి
అక్కటా పృథ్వి నిర్వీర । మై నశించె.

ఉ. ఆశలనుండి పెండ్లికి దు । రాశలతోఁ జనుదెంచినార లీ
వైశస ముప్పతిల్లె నవి । వాహితయై మనుగాక సీత వీ
యాశయముల్ ఫలింపవు, ని । రాశలతోఁ జనుఁడింక నాగ్రహా
వేశము లేటికిన్? నిజ ని । వేశములన్ సుఖియింపుఁ డెల్లఋన్.

లక్ష్మణుని యాగ్రహము

ఆ. వె. జనకుఁడిట్లు వలుక । సభ మౌనపడి యుండె
గండుమీనాక్షి లక్ష్మ । ణుండు మిగుల

నాగ్రహించి లేచి । యగ్రజన్మునిఁ జూచి
కటము లదర నధర । పుటము లెగయ.

ఆ. వె. మోము జేవురింప । బొమముడి విచలింపఁ
ప్రళయసంధ్యఁబోలి । ప్రజ్వలింప
నేత్రరక్తకాంతి । నృపవరు లాలింప
నిష్ఠురలనియె రోష । మినుమడింప.

ఉ. "కార్యముమించివచ్చె జన । కక్షితినాథుని పల్కువింటె, లో
ధైర్యముఁ బాదుకొల్పి, హర । ధర్మముఁ ద్రుంపుము, శాంతమూని దో
ర్వీర్యముఁ జూపవేన్ దొలఁగుఁ । బేరును బెంపును, భూతలంబు ని
ర్వీర్యమెయన్న ధూఱు రఘు । వీరులఁ వీనులఁ జొచ్చె నక్కటా.

ఉ. దండము దండమంచు రిపు । తండము బెంబడంగ, దీర్ఘ దో
ర్దండము లెత్తి గాధిజుని । దండకునేగి నమస్కరించి, వే
దండము పుండ్రిమున్ దునుము । వల్లవలీలను ఫాలనేత్రు కో
దండముఁ ద్రుంచి సీత విరి । దండను గొమ్ము శుభప్రదమ్ముగన్.

ఉ. అండజయాన సీత భవ । దాననముం దిలకించె నింకఁ గో
దండముఁ గొమ్ము; లేద పద । దాసుఁడ నాకు ననుజ్ఞనిమ్ము, బ్ర
హ్మాండముఁ బెల్లగించెద, శ । రాసనమేటికి? నగ్రజుండ నీ
వుండగ నేను విల్ దునుము । టొప్పదు సోదర ! సజ్జనాదరా !

మ. ఇనవంశోద్భవుఁడైన వీరుఁడకటా! । యెన్నండు నీరీతిఁ బ
ల్కిన నైరింపఁడు, వీరరాఘవుఁడు నే । క్షింపంగ నౌనే? సభన్
జనకక్ష్మాపతి యెగ్గులన్ బలుకునే? । శాంతింపఁగా నెల్లి దుం
డనె? నీతమ్ముఁడ నానతిమ్ము ధనువున్ । డాకేల, గొంపోయెదన్.

సీ. నీవానతిచ్చిన । నిఖిల క్షాత్రవులఁ జెం
డాడి, మోదించి చెం । డాడువాఁడ

నెల్లకొండలఁ గేల । నల్లలఁ గదలించి
క్షితి తల్లడిలఁ బెల్ల । గించువాఁడ,
బ్రహ్మాండభాండంబు । బ్రద్దలు గావించి
చిందఱవందఱఁ । జేయువాఁడఁ,
గమలనాళముఁ బూను । గంధేభముం బోలి
ఫాలనేత్రునివిల్లుఁ । బట్టువాఁడఁ

గీ. బట్టి శతయోజనంబుల । వఱకు వెడలి,
కడువడిం ద్రిప్పి విసరెదఁ, । గాకయున్న
ధన్విఁ గాకుందు నీకుపా । దములఁ గొట్టి
శపథముం గొంటి, నాకర్మ । సాక్షిసాక్షి.

గీ. అనిన విని రాముఁడిట్లనె, । "యంతవాఁడ
వౌదు వొక్కింత శాంతింపు । మనఘ! గురువు
లనుమతించినఁ జాలు నీ । ధనువుఁ దునిమి,
అతులభూపాలసుతుల సం । స్తుతులఁ గొందు.

చ. పరమపవిత్రమైన రఘు । వంశమునందు, సమస్తలోకభీ
కరదనుజావళిం దునుము । గా జనియించితి, జంకుఁ దక్క యీ
శ్వరధనువున్ జయించి,యను । జా! వినుజానకిఁ బెండ్లియాడి యీ
గురువుల పాదపద్మముల । కుం గుసుమాంజలినే నొసంగెదన్

గీ. శివునికోదండముం దున్మి । సీతఁ బెండ్లి
యాడకున్న నాచంద్రతా । రార్కముగను,
పృథులసత్కీర్తి మనకుఁ బ్రా । ప్తించు టెట్టు?
లోగ్గఁదగుఁగాక, గుర్వాజ్ఞ । నొందుదాక.

చ. అనవుడు మౌని రామువిన । యంబునకున్ గడు సంతసించి, యి
ట్లనియెను:-ఫాలనేత్రునిశ । రాసనమున్ వడినెక్కువెట్టి, యి

వలఁతియె యంచు నెంచిబహు। భంగుల వేల్పులసన్నుతించి, దృ
క్కులు నిగిడించి, జానకి ర। ఘుప్రవరున్ దిలకించె నాదటన్.

గీ. తనదుకన్నీరు కృపణుని। ధనముఁ బోలి
నేత్రకోణద్వయంబున। నిల్చియుండ,
నువిద రామునిఁ దిలకింప। నోడి హృదయ
బంభరముఁ జేర్చెఁ దత్పాద। పద్మములను.

చ. ధరణితనూజ, యాతురతఁ। దన్ బరికింపఁగ నుత్సహించి, భూ
వరులఁ దృణీకరించు తన। బల్మిరహింపఁగ రాముఁ డత్తఱిన్.
గరుడుని వైఖరిన్ భయద। కార్ముకసర్పముఁ జూచినంత, సో
దరుఁ డగులక్ష్మణుండు, భుజ। దర్పమునన్ వచియించె నివ్విధిన్.

ఉ. "శ్రీదయితుండు, రాముఁడు, వి। శృంఖలవీరుఁడు, భూతలంబుపైఁ
బాదయుగంబు మోపి, పుర। వైరిశరాసన మెక్క వెట్టెనో
యాదివరాహమా! కమఠ। మా! భుజగాధిప! దిగ్గజంబులా
రా దయఁ గల్గి యిత్తఱి ధ। రన్ భరియింప ధృతిన్ వహింపుఁడీ

చ. సత్వముఁ జూపఁగాదు, నృప। చంద్రులఁ గేరఁగఁ గాదు సీత క
న్యాత్వముఁ బాప, వీరవతి। యై ధరణీసతి ఖ్యాతికెక్క, మా
తత్వముఁ జాట, లోకనుత। ధన్విరఘూద్వహుఁ డుత్సహించుచున్
సత్వర మేగుదెంచె హర। చాపము నెక్కిడ నాలకింపుఁడీ.

చ. అనుజుఁడు లక్ష్మణుండిటు ల। హంకృతిఁబల్కఁగ నాలకించి, మ
ద్ధనువుధరింప నేగు గుణ। ధాముని రామునిఁ జూచి నంతనే
మనుజవిభుల్ మనోమురభి। మానములన్ ద్యజియించిమెచ్చి రా
జనకుఁడు వానిభార్యయును। జానకియున్ వినుతించి రెంతయున్.

గీ. రామచంద్రుని శౌర్యవా। రాశినడుమ,
నామకార్ముకరత్నంబు। నావఁ బోలె,

తారకుఁడు లేఁడు సకల భూ । ధవుల యందు;
రమ్యతరగాత్రి! పర్వత । రాజపుత్రి!

చ. జలమునుబొందఁజాలని తృ । షాపరితప్తుఁ డకాల మృత్యువుం
గలిగినపిమ్మటన్ జలముఁ । గన్గిన నప్పుడు లాభమేమి యన్
దలఁపున, జానకీరమణి । తన్ బరికింపఁగ, నామెభావమున్
దెలిసి హసించె రాఘవుఁడు । ధీరవరుండయి, సుప్రసన్నుఁడై.

గీ. ఎండిన పొలంబు వానకై । యెదురుచూచు
చొప్పునన్ దన్ను జనకుండు । చూచుచుండ,
బొమ్మలం బోలి పరికింప । భూమిపతులు,
మునికి మ్రొక్కి రాముండు మ । ద్ధనువు నెత్తె.

గీ. నారిఁగూరిచి లాగినం । త నె లతాంగి!
పెద్ద ధ్వనితోడ ఫెళ్ళున । విఱిగె విల్లు;
మింట మెఱుపు తళుక్కునన్ । మెఱసి నీల
జలదమున లీనమై మ్రోఁగు । చందమునను.

ఆ.వె. నారిఁబట్టిలాగు । నరపతి కేకీతి
ధర్మవృండు ననఁగ । ధర్మవకట
ఫెళ్ళుమనుచు విఱిఁగె, । భీకరరావంబు
భూమిపతుల మూర్ఛఁ । బొందఁజేసె.

సీ. బ్రహ్మాండభాండంబు । పగిలెనాఁ గుహార కం
దరములు ఘూర్ణిల్లి । ధ్వనుల నీనఁ
గందరాంతరసుప్త । కంఠీరవము లేచి
డంబుగఁ బ్రత్యుత్త । రం బొసంగఁ,
గుంజాంతరోన్నిద్ర । ఘోర దర్శనము శ
తఘ్నియన్ భయమునఁ । దల్లడిల్లఁ,

బరకామినీ బాహు । పరివృత రావణ
శ్రవణకటాహముల్ । సంచలింప

గీ. ధ్యానగతినుండు భార్గవుం । డదరి పడఁగఁ,
బాలకడలిని వెన్నుఁడు । మేలుకొనఁగఁ
బ్రళయపర్జన్య గర్జాను । బంధ మనఁగ
సంచరించె ధనుర్భంగ । జనిత రవము.

శా. ఆకోదండము రెండు ఖండములుగా । నారావ మొక్కుమ్మడిన్
లోకాలోకముఁ దాకి, సంద్రముల క । ల్లోలధ్వనింగూడి, ది
గ్వ్యాకీర్ణంబయి, భూనభోంతరము లు । త్కంపింప ఘూర్ణిల్లఁగా
నాక్రందించెఁ జలించి భార్గవుఁడు కా । లజ్ఞాన కుద్విగ్నుఁడై

చ. కమఠవరాహదిక్కరులు । క్ష్మాస్థలియున్ విచలించె, భాస్కరా
శ్వములు పథంబుఁదప్పె, సుర । వైరులగుండెలు బ్రద్దలయ్యె, న
య్యమరులు సంతసించి జయ । మంచు నుతించిరి, హెచ్చరించి రె
ల్లమరులు, వైరిభూపులు క । లంగి తొలంగిరి కాందిశీకులై.

గీ. వెన్నెలంగాయు క్రొన్నెల । వన్నె నీను
రామచంద్రుని చిఱునగు । మోముఁ జూచి,
గాధిపుత్త్రుండు దుగ్ధప । యోధిఁ బోలి,
పులకలను నిండుటలలతోఁ । బొంగి పొరలె.

గీ. ఆకసంబున నచ్చర । లాడి పాడి
రఖిల సిద్ధులు సాధ్యులు । నమర వసులుఁ
జిత్తమిగురొత్తఁ బొగడి యా । శీర్వదించి,
రవని సుమల కోలాహల । మతిశయించె.

సీ. ఎండఁ బొడిన పైరు । వృష్టిఁగాంచిన రీతి,
రాశి మనోవీధి । రాణఁ దనరె,

స్థలహీనుసకు మంచి । తావు చేకురినట్లు,
జనకుండు తోషిత । స్వాంతుఁ డయ్యెఁ,
దమ మంతరించిన । తఱి దీపతతిఁబోలి,
నృపసమాజము కళా । హీన మయ్యె
వక్షోదరంబును । బడసిన చాతక
పోతముం బలె సీత । మోద మొందెఁ,

గీ. చంద్రునిఁ జకోరమీక్షించు । సరణి నపుడు
ఘనుని రాముని సౌమిత్రిఁ । గాంచి యలరె,
జలధి మథనావసరమున । నలలఁ బోలి,
కాహళ మృదంగ వేణు శం । ఖములు మ్రోఁగె.

గీ. బాలకెంగేల నొకపుష్ప । మాల గ్రాల
డెందమున మహోత్సాహం బు । సందడింప,
నదనముఁ వంచి, మందాక్షు । భావమునను
దాశరథిఁ జేరి నిలిచె ధ । రిత్రి బోలి ;

గీ. స్నేహవశమున మదిఁ దోచు । సిగ్గు వలన,
జంకి నిల్చిన జానకి । సరణిఁ జూచి,
ఎలమిఁ జెలులు శతానందుఁ । డెచ్చరింప,
లలన పూదండ రాము న । లంకరించె.

సీ. కమ్మని పూఁదావి । క్రిమ్మి గుబాళింపఁ
బొలుపొందె వేల్పుల । పూల వాన,
పువ్వారు బోణులు । నివ్వాళు లొసఁగంగఁ,
బొదలె నెల్లెడలఁ గం । బూర తావి,
భూసురాశీర్వాద । ముల వేదములతోడఁ
గడల ఘూర్ణిల్లె మం । గళ రవంబు,

పుణ్యాంగనలపాట । పణ్యాంగనల యాట
యింపు సొంపుఁ గూర్చె । నెల్ల దిశల

గీ. వంశవృత్తాంతమున్ గద్య । పద్యములను
కడఁగి నుడివిరి వందిమా । గధులు బుధులు ;
ఆశుభముహూర్తసమయంబు । నభినుతింప
నలవియే ? పార్వతీ ! చూడ । వలయుఁ గాక.

గీ. శిష్టులడర, నసంతుష్టి । దుష్టులకల
బ్రాహ్మణులు వేదవాక్కులఁ । బ్రస్తుతింప,
జానకీనేత్ర బంభర । సంచయంబు,
రాఘవుని పాద పద్మ మ । రందమానె.

గీ. జానకీ రామచంద్రుల । సరణిఁ జూచి,
వైరిభూపతుల్ మోముల । వంచుకొనిరి ;
పద్మినీ భాస్కరుల వైభ । వంబుఁ గాంచి
ముకుళితములైన కైరవం । బులను బోలి.

గీ. అలయహల్యను బ్రోచిన । యట్టి యీప
దాబ్జములు నాకు శరణము । లని తలంచు
సీత భావంబు గ్రహియించి । ప్రీతచిత్తుఁ
డయ్యె శ్రీరామచంద్రుఁ డ । యంబుజాక్షి.

ఉ. ఆసమయంబునన్ జనకు । నాత్మజ నారఘురాముఁజూచి, పే
రాసలఁబాసి కొందఱు భ । యంపడి యేగిరి, కొందరెమ్మెయిన్
మోసముఁజేసి సీతఁ గొని । పోవఁదలంచిరి; బాలుఁడెట్లొ బా
ణాసన మెక్కువెట్టె నని । యాజికిఁ జీరిరి కొందఱుత్తఱిన్.

చ. జనకుఁడుయుద్ధయత్నముల । చందముఁగాంచిహసించియిట్లనున్ :-
జనపతులార! మీకుఁగల । శౌర్యము, ధైర్యము, బాహువీర్యమున్

జనులకుఁ దెల్లమయ్యె హర । చాపముఁగేల స్పృశించువేళ రా
ముని రణభీమునింగనియుఁ । జోరఁదలంతురె హీనవిహీనులై.

గీ. లక్ష్మణు ప్రచండ క్రోధాన । లంబునందు
శలభములఁబోలి మీరలు । చావనేల ?
బ్రతికి బలుసాకుఁ దినవచ్చు । రాజులార !
బెదురువడిరిరి యిన్లకుం । బొండు లెండు.

సీ. హరికి వాహనమైన । గరుడుని స్థానంబుఁ
జెలఁగి కాకంబు కాం । క్షింపఁ దగునె
మృగలోక భీకర । మృగరాజు విఖ్యాతి
మృగధూర్తకంబు వ । రింపఁ దగునె
ఒరుల సంపదకుఁ జూ । పోపమిఁ గల క్రోధ
శీలుఁడు సుఖము వాం । ఛింపఁ దగునె
పరకాంతలను జూచి । వలచి పైఁబడు కాము
కుఁడు నిష్కళంకంబుఁ । గోరఁ దగునె

గీ. మొసఁగఁజాలక బీదల । కొసఁగ లేక
బ్రదుకు లోభి శాశ్వతకీర్తిఁ । బడయఁ దగునె
ఈశ్వరద్వేషి మోక్షంబు । నెనయఁ దగునె
క్షితి తనూజను మీరు కాం । క్షింపఁ దగునె?

క. ఈరీతి జనక భూవరుఁ
డా రాజుల కోడ నయ భ । యంబులు దోఁపన్
వీరఘటా కంఠీరవు
శ్రీరాముని దోర్బలంబుఁ । జెప్పుచు నుండెన్.

పరశురాముని యాగమనము

సీ. మహి నాటుకొనఁజొచ్చు । మత్తేయాంఢలఁ బోలి
జీబుగ జడలెల్ల । జీరులాడ

బాలేందుఁ బోలిన । ఫాలభాగంబు తిరి
పుండ్రాంకితంబయి । పొలుపు నింప
నాజాను పర్యంత । హస్తయుగంబునఁ
బరశువు, జపమాల । భయముఁ గొలుపఁ
గటిసీమఁ గట్టిన । గైరిక వసనం బ
కాల సంధ్యాకాల । కాంతిఁ గ్రాల

గీ. బాణ బాణాసన కృపాణ । తూణవితతి
తనశరీర పశ్చాద్భాగ । మున రహింప
వదన ముదయార్క బింబమై । ప్రజ్వలింప
వచ్చె హతభూధవుండగు । భార్గవుండు.

సీ. ప్రాగ్దిశనుదయించు । పౌర్ణమేచంబుఁబోలు
నారక్తభీకరా । స్యంబువాని
భ్రుకుటచేఁ గుటిలమై । వికటదృష్టింగ్రాలు
తరుణారుణాబ్జ నే । త్రములవాని
రుండమాలనుబోలు । రుద్రాక్షమాలికా
లంకృత దీర్ఘగ । ళంబువాని
నిసువ్రిక్క నున్నత । శిరములంబలెనొప్పు
ఘన వృషస్కంధ యు । గంబువాని

గీ. సమిత భస్మావలిప్త దే । హంబువాని
వీర రసమిట్లు మునిగ నా । విర్భవించె
నని నుతింపఁగ నేతెంచి । నట్టివానిఁ
బరశు రామునిఁ జూచిరా । ధరణిపతులు.

ఉ. ముచ్చటదీఱఁ బెండ్లికని । పొంకముగన్ జనుదేర, భార్గవుం
డిచ్చటికేగుదెంచె, వధి । యింపఁగ, గానకు జింకవేటకై

వచ్చినవానిఁ గోపిలుపులి పైఁబడి, చంపినయట్ల లయ్యె నం
చచ్చటి రాజులెల్లను భయంపడి రెంతయు సంచలించుచున్.

చ. తమతమ నామముల్ వరుసఁ దప్పక మెల్లఁగ నుచ్చరించి, గో
త్రములను, వంశచిహ్నములఁ దండ్రులనామములన్ వచించి, శ
స్త్రములఁ ద్యజించి, యాపరశురాముని పజ్జను మోఁకరించి, పా
దములకు మ్రొక్కి, రాజులు పదంబులు తొట్రిలనిల్చి రత్తఱిన్.

చ. జనకుఁడు వచ్చి, పాదజలజంబులఁ బట్టి నమస్కరించి, సీ
తను బిలిపించి, భక్తి మెయిఁ దచ్చరణంబుల మ్రొక్కఁబంచి, య
య్యనఘుని దీవనల్ వడసి యాపెను లోనికిఁ బంపె; గాధినం
దనుని యనుజ్ఞ పై నతులొనర్చిరి నవ్వుచు బాలవీరులున్.

గీ. రామలక్ష్మణులం జూచి రాముఁ డంతఁ
జిత్తమునఁ బొంగి తనకు నాశీస్సు లొసఁగె;
నతని యాశీస్సులం బొంది యధికభక్తి
గురువు పజ్జకు సేరి రయ్యిరువురపుడు.

చ. అలఘులమంచుఁ బెండ్లికయి యాతురతన్ జనుదెంచినట్టి రా
జులఁ గని రామలక్ష్మణుల చొప్పుఁ గనుంగొని, యోలగంబునం
దలబలమాలకించి, యుసుమంతయు నేమియెఱుంగనట్లు చూ
పుల నటియించి భార్గవుఁడు భూవరులెల్లను దల్లడిల్లగన్.

గీ. నృపకులంబిట్లు లేతేర హేతువేమి ?
చెప్పుఁడనినంత, జనకుండు చెప్పుచుండఁ,
బుడమి బీటలువాఱిన పోలుపుఁ జెలువు
నలికనేత్రు ధనుష్ఖండములను జూచె.

పరశురాముని యాగ్రహము

చ. కనుఁగొని యాగ్రహ మూర్ఛితజనకా! శివకార్ముక మెవ్వఁ డివ్విధిన్
దునియలఁ జేసి, శంభునకు ద్రోహ మొనర్చె సాహసించి, నా

కినుకకుఁ బాత్రుఁడయ్యెఁ బరి । కించెదఁ జూపుము లేకయున్నఁ జే
రోఁ్కనుమనివంత రాఘవుఁ డ । కుంఠిత వీరవరేణ్యుఁ డిట్లనున్.

గీ. విప్రకులవర్య! శివువిల్లు । విఱిచినట్టి
దాసుఁడను నేను సెలవిండు । దోసమున్న ;
ననిన విని భార్గవుండంత । నాగ్రహించి
యెల్లదిక్కులఁజూచి క । న్నెఱ్ఱఁ జేసి.

చ. మనమునజంకుఁగొంకువిసు । మానమొకింతయు లేని రామచం
ద్రునిఁ దిలకించి సేవకుఁడు । దోసమొనర్చునె మూర్ఖ? ఫాలనే
త్రుని నిరసింపగన్ ధనువుఁ । దుంపఁగవచ్చునె? చెప్ప కేమి యీ
ధ్వనియె మదీయకర్ణములఁ । బట్టి ననుంగోని తెచ్చెఁ జెచ్చెరన్.

ఆ.వె. చంక దుడ్డుఁబూని । శరణార్థి వైతివో ?
శివుని ధిక్కరించు । సేవకుఁడవా ?
యోఘవరుఁడ వౌదు । యుద్ధంబు సిద్ధంబు
పోడువ కుండ నిన్ను । విడువ విడువ.

ఉ. బాలుఁడవో? దురాత్మ! పుర । వైరికి ద్రోహమొనర్చినట్టి చం
డాలుఁడవో? విన్ముడు నర । నాయకులెల్లఱు రాజశేఖరున్
హేళనసేయఁగన్ దలఁచె । నేఖలుఁ డాతనిఁ గార్తవీర్యునిం
బోలినవైరి నేఁ దునుమఁ । బోలుఁ గఠోర కుఠార ధారలన్.

గీ. అని వచించిన భార్గవు । నభినుతించి
యవని నాథులు మోదించి । రాత్మలందు
నంత ముఖమున దరహాస । మంకురింప
నీసడించుచు లక్ష్మణుం । డిట్లులనియె.

క. బాలుఁడా ? ధిక్కృతపశ్య
త్ఫాలుఁడా ? యద్ధ్రిముతుల్య । ఫాలుఁడా ? జిత భూ

పాలుఁడో? హతకిల్బిష జం
బాలుఁడో? నీవెఱుఁగఁగలవె? భార్గవరామా.

క. హంతవ్యుఁడె విప్రుఁడు? బహు
మంతవ్యుఁడ యని తలంచు । మముఁ జిక్కెదవో?
క్షంతవ్యుఁడవే? భార్గవ!
గంతవ్యుఁడ వౌను నీవు । కాలుని పురికిన్.

గీ. అమితకోపియై చండాలుఁ । డనఁగ నొప్పు
నీవెఱుంగని ధర్మ మొం । డేని గలదె?
చిఱుత విల్లొండు విఱిచిన । చేతకిట్లు
తగవులాడినఁ జెల్లునే? । ధరణిదేవ!

మ. శివుఁడో మాధవుఁడో ధరించు ధనువేన్ । జింతింపఁగా నేల? భా
ర్గవ! యేకార్ముకమైన మాకలఁతి; దో । ర్గర్వంబుచే నెన్ని ధ
ర్మువులన్ ద్రుంచము బాల్యచాపలమునన్, । గోపించి భాషింప ధ
ర్మవె? మాకియ్యది యొక్కలెక్కయగునే? । మూర్ఖించినన్ జెల్లునే.

గీ. అనిన విని భర్గుమని మండి । యౌడు గఱచి,
గాత్రమంతయుఁ గంపింపఁ । గటము లదర,
గండ్రగొడ్డలి తనకేల । గంతులిడఁగఁ
బలికె నీరీతి సభలోన । భార్గవుండు.

శా. ఔరా? రాజకుమార! నీకు మరణం । బాసన్నమయ్యెం జుమీ
ఈరీతిన్ గడిమీఱి భార్గవుని న । న్నెగ్గాడుదే? చూడవో
ఘోరంబైన కుఠారమున్? శివమహా । కోదండమత్యల్పమా?
ఏరైనన్ వినినన్ సహింపఁ గలరా? । యీకారు లింకేలరా?.

శా. నానా క్షత్ర విలుంఠన క్రియ ననూ । నఖ్యాతిఁ బెంపెక్కి రా
జానా గోష్ఠలి; యుద్ధరంగమున న । న్నీడాడి పోరాడెదో?

మానింగా నొక విప్రుఁగాఁ దలఁచి సం। భాషించినం జెల్లునే ?
ప్రాణాశంగలవాఁడవేన్ దొలఁగుమో । వైతండికా! కొండికా!

క. అన విని లక్ష్మణుఁ డిట్లను
ననఘా మాకెల్ల ధనువు । లలయ సమంబుల్
వినుఁడు పురాతన మియ్యది
ఘనమా యిఁక దీనికింత । గాసిల నేలా ?

క. గాసిలిన నేమి లాభం
బీసుంగొని వాదులాడ । నేటికి శివబా
ణాసనమును రాముండట
వీసంబున్ వంచలేదు । ఫెళ్ళున విఱిగెన్.

క. తల్లిన్ జంపిన వానికిఁ
జెల్లునె ? యాకీతి నీతిఁ । జెప్పఁగ నకటా !
ఉల్లంబొల్లదు బ్రాహ్మణ
తల్లజు వధియింపఁ నిన్ను । దయఁ బ్రోచితిఁ బో.

క. భర్గుని శిష్యుండవు నై
సర్గము కోపంబు నీకు । శాంతింపఁ దగున్
స్వర్గము మోక్షము చెపుమా
భార్గవ! యీవింటికొఱకు । వగవం దగునా ?

క. కోపము తాపముఁ గూర్చున్,
దాపంబున నెట్టివాఁడు । ధర్మచ్యుతుఁడై
పాపంబుఁ జేసి పశ్చా
త్తాపంబును బొందు హీన । దశకుం గుంకున్.

ఉ. నావుడు భార్గవుండు గళ । నాదము దిక్కుల నావరింపఁగా
భూవరులెల్లరున్ భయముఁ । బొందఁగ నిట్లను "బాలకుండవన్

భావమునన్ సహించితిని । పాడిదలంపక రాచబిడ్డనన్
గావర మంతకంత కెసఁ । గన్ వెడపల్కులఁ బల్కుచుంటివో ?

ఉ. ఈవిధిఁబల్కుచుండ ధర । ణీశ్వరులన్ వధియించె నేపునై
నీవఱ కక్కటా పరశు । వేటికి నిన్ను వధింపకున్నదో ?
ఈవొసరించు పుణ్యమది । యెట్టిదొ ? లక్ష్మణ ! చెప్పకేమి నీ
చేవకు జంకిగాదు ముని । శేఖరు గాధిజుఁ జూచి యోర్చితిన్.

చ. కఱకఱ గండగొడ్డలిని । క్షత్రియవర్యుల కంఠనాళముల్
నఱికితి సర్వభూతలము । నన్ దనియించితి విప్రకోటి; న
న్నెఱుఁగవు బ్రాహ్మణుండని ము । నీశ్వరుఁడంచు మదిందలంచి ప
ల్లఱుపులఁ బెక్కులాడెదు బ । లాఢ్యునికైవడి క్షాత్రడింభకా.

చ. కొఱకొఱ ధిక్కరించెదవొ ? । క్రూర కఠోర కుఠార ధారకున్
వెఱవకె విల్వవోపుదువొ ? । నీతలిదండ్రుల నేడిపింపఁగా
నఱమఱలేకయిట్లు దిగ । నాడెదు భార్గవు ; నిన్నుఁగన్నవాఁ
డెఱుఁగును నన్ను బాలకుఁడ । వేటికిఁ బ్రేలెదు కాఱుకూతలన్.

గీ. బ్రాహ్మణ బ్రహ్మచారిని । భార్గవుఁడను
శాపమునఁ జాపమునఁ జంపఁ । జాలినట్టి
పరశురాముని నిరసించి । బ్రతుకఁ గలవె ?
బాలకుఁడవీవు సైరింప । వలసె మాకు.

గీ. కార్తవీర్య బాహు సమూహ । గహన దహన
మీ కుఠారంబు నేమిగా । నెంచితొక్కొ ?
పరకామినీ గర్భ ని । ర్భేదకంబు
నిస్తులము మత్పరశ్వథ । నిస్వనంబు.

గీ. నరపతి కులంబు చెఱకని । నఱికి నఱికి
మెప్పువడసిన విప్రుఁడు । త్రుప్పు వట్టె

రాఘవర! నీవకంత శా । ణోపలమున
వాఁడిఁ బెట్టెదఁ బోరాడ । వచ్చెదేని.

గీ. అనిన విని చాలు మేలు మే । లని వచించి
పరశురాముని బరికించి । పరిహసించి,
అట్టహాసంబుఁ జేయుచు । నిట్ట నిల్చి
లక్ష్మణుఁడిట్టులనియె ని । ర్లక్ష్యముగను.

ఉ. అడ్డెడు నీవు ద్రావఁ దగి । నంత వచించితి పూరడిల్లు మే
ఎడ్డమి మాకు వాటిలునొ? । యీనృపులెల్లఱుఁ జూడ మాటికిన్
గొడ్డలిఁ జూపి చూపి యొక । గొడ్డములాడినఁ జెల్లునో క్రొ? మా
కడ్డగ నిల్వనోపవు ధ । రామర వంశ పయోధి చంద్రమా!

గీ. గొడ్డలిం జూపి యిది ప్రాణ । గొడ్డమనుచు
మమ్ము బెదరింపఁదగునె బ్రా । హ్మణవరేణ్య!
బూరటిల్లంగ బుగ్గలు । ఫూత్కరించి
ఎగురఁగొట్టెదవే కొండ । నీవఁ బోక?

గీ. భూమిదేవుల గోవులం । బ్రోచుకొఱకుఁ
బ్రాణములనైన నర్పించు । రాఘవులము;
పరశువుఃబూని వచ్చిన । వాఁడవయ్యు,
బ్రాహ్మణుఁడ వీవు సైరింప । వలసె మాకు.

కం. భృగుకుల తిలకుఁడ వాపయి
జగదభినుత మునివరుఁడవు । చంపందగునే?
నెగజూచిన గోహత్యయు.
నెగజూచిన బ్రహ్మహత్య । యేమనవచ్చున్.

గీ. పాపమున కపకీర్తికి । భయముఁ జెంది
జంకితింగాక శర శరా । సన కుఠార

మునిని వీక్షించి పర్వెత్తు । మూఢుఁ డెవఁడు ?
ఇంతకొక విఁటికై యింత । పంతమేల ?

క. అన విని యా సౌమిత్రిం
గని కనుఁగవఁ గెంపు దోఁప । గాధిజుఁ గని య
జ్జనపతి సంఘముఁ గని, య
జ్జనకుని, రాముని, మిగిలిన । జనులన్ గనుచున్.

మ. కుటిలభ్రూకుటి ద్వేష రోష జనిత । క్రోధాగ్నికిన్ మూలమై
నిటలాక్షున్ దలఁపింప నేత్రయుగళిన్ । నిర్నిద్రమై రౌద్రము
త్కటసంధ్యారుచిఁబోలి దిక్తటములన్ । గ్రమ్మంగ గర్జించి య
జ్జటివర్యుం డనివార్య శౌర్యమున వి । శ్వామిత్రుతో నిట్లనున్.

ఉ. కాలుని వీటికేఁగుటకుఁ । గాళుల నోరికొలందిఁ బేలె నీ
బాలకుఁ డెంతయున్ గుటిల । భావుఁ డధర్మ పథార్జితాఘ జం
బాల నిమగ్నమానసుఁడు, । భాస్కరవంశ కళంకుఁ డింక నే
జాలము సైపఁజాల ముని । చంద్రమ ! వీని వధింతు వ్రేల్మిడిన్.

ఆ. వె. తానశించి మఱియుఁ । దనకులంబు నశింపఁ
జేసికొనఁగ నన్ను । గాసిఁ బెట్టె,
వాసికెక్కినట్టి । భార్గవు నెదిరించి
బ్రతుకఁ గలఁడె యెట్టి । రాచవాఁడు ?

ఆ. వె. బాలకుండు వీఁడు । బ్రదికించుకొను మింక
మనుజుల ప్రతాప । మహిమఁ దెలిపి,
జంకుఁ గొంకుఁ దక్క । జంకింప నూకించె,
బాడువడుండ వీని । విడువఁ దగునె ?

చ. అనవుఁడు లక్ష్మణుండు పరి । హాసముఁ జేయఁ దలంచి యిట్లనున్
మునివర! కాందిశీకులగు । భూపులఁ జంపి యనేక భంగులన్

ఘనముగఁ జెప్పుకొంటివి జ। గన్నుత కీర్తియుఁ గొంటివింక ని
న్ననఘుఁడు గాధినందనుఁ డ। హర్నిశమున్ వినుతింపఁ జాలునే?

గీ. నలువను హసించి, వానియా। దలను దన్ను
శివుని నిరసించి, వేనోళ్ళ। చిలువఁ జెగడి,
భవదమోఘ ప్రతాపమున్। బలముఁ, జలము,
నెల్లభంగుల నుడివె నీ। యేక ముఖము.

గీ. అంతతోఁబోక, యకట! య। హంకరించి,
గాధినందను నొకవంది। గా నొనర్పఁ
దలఁచి, వర్ణింపుమనియెదు। ధరణిదేవ!
ఈవ వర్ణింపరాదె? యా। పోవుదాక.

గీ. ఈవు గొడ్డలి చేఁబూని। యెసఁగునాఁడుఁ
ఏము జనియించి యుండమా। హేతువునను,
సేగి లేకుండ నీయాట। సాగివచ్చె
భార్గవా! కోపమేటికి। బ్రాహ్మణునకు.

గీ. అకట! నిన్నాశ్రయించిన। యారువురును
శాత్రవులు, వారి నెమ్మెయిఁ। జంపుఁ దేని
అనఘు శ్రీరాము గెలిచిన। యట్ల వినుము
ప్రాతవింటి కింతటివంత। రోఁత గాదె?

గీ. ఎగ్గులన్ మోము శోభిల్లు। నే మహాత్మ!
క్రోధభరమునఁ జిత్త సం। క్షోభమునను
దుఃఖముజనించు, జ్ఞానంబు। తొలఁగిపోవు
ధైర్యముంబూనఁ దగునందురి। తత్వవిదులు.

గీ. సమరకార్య ధూర్వహుఁడైన। శౌర్యశాలి,
యుద్ధ సన్నద్ధుఁడై నిల్చు। యోధుఁ జూచి,

పండవలె దంభవాక్యముల్ । పలుకఁ జెపుము,
భూసురవరేణ్య! నీకేల । కంఠ శోష.

చ. అనవిని భార్గవుండపుడు । దగ్ర మహోగ్రహవిగ్రహోగ్రుఁడై
జనులను జూచి, భీకర ని । శాత కఠోర కుఠార ధారలన్
దునిమెద వీని, నాయెడల । దోసము లేదని లేచినంత నే
కని తడిమించి వచ్చెనని । గాధిసుతుండు హసించి యిట్లనున్.

గీ. సజ్జనుండవు భృగువంశ । సంభవుఁడవు
బ్రాహ్మణుండవు, బాలుని । వాక్యములకు
నాగ్రహింతువె? సజ్జను । లాగ్రహింప
రితని గుణావగుణముల । నెన్నఁ దగునె ?

గీ. ఇతని యపరాధ శతమున । కించుకంత
నాత్మ శాంతింపరాదె మ । హానుభావ
అనిన నౌనని గాధేయు । ననునయింపు
వాక్యముల కిట్లని వచించె । భార్గవుండు.

సీ. ఆగ్రహించి యరాతి । నిగ్రహించు స్వభావ
ముంగలవాఁడను । భూసురుఁడను,
మీఁదుమిక్కిలి యొందు । మీఁదు లేని కుఠార
మను నాయుధంబుఁ గ । లట్టి వాఁడఁ,
గోధశీలుండ, మ । ద్గురు వైరి రఘురాముఁ
డెదుట నిల్చె, నితండు । వదరుచుండె,
శాంతింప వేడెదు । శాంతింప వచ్చునె ?
నీశీలముం జూచి । నిన్నుఁ జూచి,

గీ. ఓర్చితినిగాక, లేకున్న । నార్చి పేర్చి
పరశువుం ద్రిప్పి యీతని । శిరముఁ ద్రుంచి,

ఒజ్జల ఋణంబుఁ దీర్పక । యుందు నోటు ?
జనవరధ్యేయ! గాధేయ! । ముని విధేయ!.

క. అని విని పకపక నవ్వుచు
మునివరు ననె లక్ష్మణుండు । పొంతకుఁ జని నీ,
ఘనత నెఱుంగమె యకటా ! !
వినుమెవ్వఁ డెఱుంగకుండు । విశ్వజనీనా !

క. జననీ జనకుల ఋణమును
గొనకొని మునుదీర్చి యిపుడు । గురువు ఋణంబున్
ఘనముగఁ దీర్పఁగ వచ్చితి
వనఘా! నిను మెచ్చవచ్చు । నార్యులు సభలన్.

గీ. క్షత్రియ కులాంతమని పర । శ్వధముఁ జూపి
మాటి మాటికి బెదరించి । మాటలాడె
దా దినము లంతరించిన । వార్యవర్య !
ఇంతకొక వింటి కింతటి । వంత తగునె ?

క. వాదింపవచ్చి యెత్తిన
వాదింపవా? యెంతటి నేఱ । వాదివా? వినుమా
ఖేదించు ఖడ్గవాది, ప్ర
మోదించుచు కార్యవాది । మునికుల తిలకా.

గీ. కార్యముఁ బరిష్కరింపఁగఁ । గాంక్షయున్నఁ
బెద్దలున్నారు గద; వారిఁ । బిలువఁ దగదె?
పెద్దలకుఁ దోఁచు గురువు ర । క్షింపరాదె ?
నీవలనఁ గాదు తగవును । న్నిర్ణయింప.

గీ. పుట్టినది విల్లు, రఘుకుల । పుంగవుండు
వంచెనో లేదొ తునుకలై । వసుధఁ బడియె ;

గతసలిలసేతుబంధన । కాంక్ష యేటి
కొకటికిన్ నాలుగిచ్చెద । మోర్వరాదె ?

గీ. పరమ పావన కాషాయ । వస్త్రములకు
మహిమ దీపించు రుద్రాక్ష । మాలికలకు
సాధుజన విప్రులకు నమ । స్కార శతము,
క్రూర తర హేతులకుఁ దిర । స్కార శతము.

క. జననిం జంపిన విప్రుఁడు
జనపాలురఁ జంప నింక । జంకునె కలనేన్ ;
జనకద్రోహిన్ దునిమిన
జనులకు నుపకారమగునె ? । జమదగ్ని సుతా !

గీ. ఇట్లు సౌమిత్రి, క్రోధవా । క్యేంధనములఁ
బ్రజ్వలింపఁగఁ జేసె భా । ర్గవుని కోప
వహ్ని; నంతట శీతల । వారిఁ బోలు
వాక్యముల రామచంద్రుండు । పలికె నిట్లు.

గీ. తమ ప్రతాపంబు నించుకం । తయు నెఱుంగఁ
దక్షుఁ డీక్షింపకంతుఁడు, । ప్రజ్ఞలేని
బాలకుండు తన్నెదిరింప । వచ్చుఁ గాక
బ్రాహ్మణ వరుండు శాంతింప । వలయుఁ గాదె.

క. సమశైశమగు నెయ్యము, వి
య్యముఁ, గయ్యము, మంతనంబు । నాటయు సంభో
గము, సద్విద్యాభ్యాసము
సములకు శోభిల్లునండ్రు । సంయమివర్యా !

క. తల్లియుఁ దండ్రియు నొజ్జయు
నుల్లమునన్ దలఁతువాని । నొప్పఁదికింపన్

జెల్లదె? శాంతింపరె ముని
తల్లజ! యీరీతిఁ గినియ । ధర్మంబగునే?

క. జ్ఞానులు, ధీరులు, విప్రులు
మానులు, బాలుఁడు దెగడిన । మన్నించిన మీ
మానసము మార్పుఁ జెందదు
లోనించుక శాంతమూని । లోఁగొనుఁడితనిన్.

గీ. రాముఁ డీరీతి భార్గవ । రాముతోడఁ
బలుకుచుండంగ, సౌమిత్రి । భార్గవుఁగని,
వికటముగఁ బల్కె నుంకింప, । భృగుకులుండు
అబ్జనేత్రుని కిట్లనె । నాగ్రహించి.

గీ. అతుల కనకోప మితగాత్రుఁ । డైననేమి?
పాప పంక కళంకిత । భావుఁడగుటఁ
బరమ పాపాత్ముఁ డకట! యీ । బాలకుండు
గరళ కంఠుండమ్మా, క్షీర । కంఠుఁడగునె?

గీ. అనిన విని నవ్వి లక్ష్మణుఁ । డనియె నిట్లు
గరళకంఠుఁ డెవ్వఁడు నీ । గురువుగాక,
అయ్యదెట్లుండె వినుము, పా । పాలవాల
మైన క్రోధంబుఁగల విప్రుఁ । డనఘుఁడగునె?

గీ. అనఘ! యుచితానుచితముల । నరయఁ డెపుడు
జగతికిన్ బ్రీతికూలుఁడై । సంచరించుఁ,
గ్రోధి యెట్టిఁడో మీరలె । ఱుంగ రొక్కొ?
కోపమును సంహరింపుఁడు । తాపమణఁగు.

గీ. బ్రాహ్మణుండవు, తపసివి । భార్గవుఁడవు
దాసుఁడను నేను, కోపింపఁ । దగునె దేవ?

తాపమేటికిఁ దనిసిన । చాపమునకు ?
నాసనముఁ గొండు, రండాగ్ర । హాంబువలను.

గీ. భూసురవరేణ్య ! శాంతంబె । భూషణంబు,
విశ్రమింపుఁడు, వాదించి । విసిగినారు ;
తగినపనివాని రప్పించి । ధనువొసంగి
బాగుగావింపవచ్చు వి । వాదమేల ?

క. అనవుఁడు సౌమిత్రిం గని
జనకుఁడు భీతిల్లి నేత్ర । సంజ్ఞను వలదం
చు నివారించె; ననంతర
మినకులవరుఁ జూచి రాముఁ । డిట్లనెఁ గినుకన్.

గీ. ఘోర విషపూరిత స్వర్ణ । కుంభమట్లు
కుటిల కలుషితచిత్తుఁడీ । క్రూరుఁడకట
నన్ను బాధింపనున్నాఁడు । మిన్నకున్న
హానిచేకూరు, సైరింప । నగునె చెపుమ.

గీ. నిర్మలాత్ముఁడవని యెంచి । నిన్నుఁ గాంచి
మునివరుండైన గాధేయు । మోముఁ జూచి
నేను సైరించుకొలఁది మ । న్నింపకుండ
ధిక్కరించుచె నీతమ్ముఁ । డుక్కులుంచు.

క. చాపము రోషం బేటికి
నీపాపని సంహరింప । నినకుల తిలకా !
కోపించి జలముఁ గైకొని
శాపించిన నుక్కడంగి । చావక యున్నే ?

చ. అనవిని లక్ష్మణుండు విన । యంబు నటించుచు లేచిపల్కెఁ బో
ననుచితమంచుఁ బల్కఁ దగ । దంచు రఘుప్రవరుండు నేత్రసం

జ్ఞను ప్రకటించి యిట్లనియె, । జ్ఞానులు మానులు పిన్నవానిపైఁ
గినిసి శపింపరాదు, పరి । కింపుఁడు మంచియుఁ జెడ్డ నాత్మలో.

ఉ. నేరమొనర్చువాని గమ । నింపక యక్కటా! పిన్నవానిపై
నీరసమూని యాయుధము । నెత్తుట ధర్మముగాదు నీరకం
ఠీరవ! చాపభంగము త్రి । నేత్రుని గౌరవహానియౌన్ భవ
త్క్రూర కుఠారధార సను । దుంచునుగాక యశంబుచేకుఁడున్.

గీ. దయయొ కోపంబొ వధయొ బం । ధనమొ లేక
యేమి చేయంగ వచ్చునో । యో మహాత్మ
శిక్షకర్హుండ భవదీయ । సేవకుండ
నన్ను విడనాడి చంపుదే । పిన్నవాని.

గీ. నేర్చియో నేరకో మీకు । నేనొనర్చు
నేరమున కన్య శిక్షింప । నీతియగునె ?
ధీరులగు మీర లాత్మ శాం । తింప నొందు
లోంగవఁ బరికించి శిష్యులఁ । బ్రోవఁ దగదె ?

సీ. అన విని రఘురాము । నఘువిరామునిఁ జూచి
భృగువంశ సంభవుం । డిట్టులనియె
విను నాకు కినుకకు । వెరవెఱుంగిన వాఁడు
నీతమ్ముఁ డుండఁ జిం । తింప నేల ?
కుటిలాత్ముఁడయి నన్నుఁ । గోపింపఁ జేసిన
వాని వధింపదీ । పరశువకట !
నరవర గళఖండ । న ఖ్యాతిఁ బరగిన
పరశువీ క్షత్రియా । ర్భకుని విడిచె

గీ. నేను కోపించి చేసిన । హాని యేమి ?
జీవ ముండఁగ రిపుని నీ । క్షించుచుంటి

శత్రుని వధియింప నాకేలు । జంకుచుండె
నాయుధము కుంఠితంబయ్యె । హేయముగను.

సీ. ప్రళయకాలానల । జ్వాలలం బోలున
మన్యాగ్నికిన్ మేను । మండుచుండె
దుష్టరాజులఁ జంపి । తుష్టిప్రవర్తిన గండ
గొడ్డలి నా ప్రాణ । గొడ్డమయ్యెఁ
బ్రతికూల విధి నన్ను । బాధించి సాధింప
నొక డింభకుని జిహ్వ । నుక్కుఁ జేసె
అసలను శిక్షించు । నభ్యాసముఁ గలట్టి
డెందంబు పరమాణ । మొందకుండె

గీ. ప్రాణముండఁగఁ గరమునఁ । బరశువుండ
బుణ్యసాగరమైన బ్రా । హ్మణ్యముండ
బాలునకుఁజిక్కి జీవచ్ఛ । వంబనైతి
హృదయమునకింక శాంతి యే । రీతినుండు.

క. అనవుఁడు లక్ష్మణుఁ డిట్లను
జననుత బాధించి నిన్ను । సాధింపంగన్
ననువంటి వాని కగునే ?
మనమున శాంతింపుఁ డఖిల । మానవు లలరన్.

గీ. కుసుమ వర్ణంబు మించు వా । క్కుల వచించు
సతుల కరుణాపయోధి! భూ । పతి విరోధి!
మిమ్ము సృజయించినట్టి దై । వమ్ముఁ దిట్టి
యాత్మ శాంతింపుఁడింక మీ । యఘములింక.

క. అనినన్ విని యుగ్రుండయి
జననాయక సంచయంబు । సంతోషింపన్

జనకుంగని భృగునందనుఁ
దనియెన్ భీకర ఘనాఘు । నారవ సరణిన్.

మ. జనకా! వింటివె పల్లిదంబులను వా । చాదోష భూయిష్ఠ మీ
తని జిహ్వాగ్రము గాధినందనుని వ । క్త్రింబున్ విలోకించి రా
ముని తత్త్వంబును జూచి బాలుఁడకటా । పోనిమ్మునోనాడ ని
మ్మని సైరించుకొలందిఁ బెచ్చుపెరిగెన్ । బ్రాణాశ లేకెంతయున్.

ఉ. ఎక్కడిబాలకుండు? వధి । యించెద నాకనుదోయికిన్ వ్రణం
బక్కట! వీఁడు కూరుఁడు య । మాలయ దర్శన లాలసుండు నీ
విక్కడనుండి యీఖలుని । నేమిటికిన్ దొలఁగింపఁ జేయ విం
కొక్కక్షణంబునోర్వ నతు । లోగ్ర పరశ్వథ ధాటిఁ జూపెదన్.

గీ. అనిన విని నవ్వి లక్ష్మణుం । డనఘ వినుఁడు
కనుల మూసిన వ్రణమెట్లు । కంటబడును?
అనిన రాముండు రాముని । గని దురాత్మ!
తమ్ము శిక్షింప కాలింపఁ । దగునె నీకు?

చ. అలవుఁదలంపుఁ డక్కట దు । రాత్ముఁడు మోఱకుఁడుల్లికుట్టు ప
ల్కులు ననుదొవ్వనాడఁ బుయి । లోడఁడు క్రొవ్విన నాచబిడ్డఁడీ
ఖలుఁడు,భవత్సహోదరుఁడు । క్షత్రియవంశ కళంకుఁడింక నే
నలిగిన వీనిఁబ్రోవగల । వా? చెపుమా రఘువంశసంభవా?

ఉ. తెంపరియై ధరామరునిఁ । దెక్కొని తిట్టిన వీని నాలుకం
ద్రుంపఁగరాదె? నేజననిఁ । దున్మిన దోసము నెంచి నచ్చుటం
కింపఁగఁజొచ్చె; బాలుఁడని । కీడుఁదలంపమి నింతపుట్టెఁగా
కంపరఁ బోలు వాక్కులకు । నక్కట!! నేను సహించువాఁడనే?

ఉ. తమ్ముని పెంకెపోకడ య । ధర్మపథంబని మందలింప వా
క్కుమ్మకె నాడు నెగ్గులకు । నూకొని మెల్లఁగ మిన్నకుంటివి

పిమ్మోయి మిన్నకుంట యది । హెచ్చరికించిన యట్లగాదె ? యీ
ఎమ్మెల నేపనేర్చితో ? స । హింపఁడు భార్గవుఁ డింత యేటికిన్.

ఉ. ఇమ్మెగ నీవు వచ్చినను । యించు వయంబు నటించి, ప్రాణ గో
ష్ఠమ్మెగ నుండు బాలున కొ । డంబడఁ జేయఁ దలంచినాఁడవే?
తమ్ముఁడు నీకుముద్దయినఁ । దప్పనె గొడ్డలి వ్రేటు ? వాఁడు నీ
సమ్మతిలేక వాక్ప్రదర । జాలము నాయెడ నాటఁజొన్పునే ?

చ. వెఱిఁడివాఁడు వీవెరవు । పెంపునఁ బ్రెగ్గడవౌదు, తమ్ము ప
ల్లఱపుల మందలింపక క । టా కపటాత్ముఁడవైతివింక, నే
నఱమరఁదక్క నీదు విన । యంబుఁదలంచి సహింపరాదు, మి
మ్మఱవరసేసి గొడ్డలికిఁ । బ్రాణములన్ బలిగాఁ గ్రహించెదన్.

మ. మదమేపారఁగ సోదరుండు చెగడన్ । మన్నించి శాంతింపుఁ డం
చదనుంగాంచి మదీయకోపశిఖిఁ జ । ల్లార్పంగ భాషించెదీ
వదిరా! యిట్టి దంభనాటకము నం । దత్యంతమున్ నేర్పరుల్;
ఇదిగో గొడ్డలి, లెండు రండిప్పుఁడు మి । మ్మెవ్వాఁడు గాపాడునో?

చ. అఱచుచు నిట్లు భార్గవుఁడు । దగ్రి మహోగ్రకుఠారమెత్తినన్
వెఱచినయట్లు లక్ష్మణుఁడు । పెప్పెపెయంచునటించి, మోమునన్
జిఱునగవంకురింప, నిరు । చేతుల నెత్తి నమస్కరించి, వాఁ
డెఱచి వచింపఁబోవ, రణ । ధీరుఁడు రాముఁడు నేత్రసంజ్ఞచే.

గీ. వలదు వలదన్న నతఁడు మా । ర్వలుకకుండ
వినయ భారావనతశీర్ష । మునను వెడలి
కౌశికునిఁ జేరె; నంత భా । ర్గవునిఁ జూచి
రాఘవుండిట్టులనియె న । మోఘఫణితి.

మ. వనజాతోద్భవవంశపావన, స్వభా । వజ్ఞాన సంపన్నుల
య్యును, మీరవ్విధిఁజూపఁగాఁదగునె య । త్యుగ్రప్రతాపంబు బా,

లుని వాక్యంబులఁ జిరకింగొనరు సు । శ్లోకుల్, విచారింపుఁడో
యనఘా! శాంతమె భూషణంబగుమహా । ర్యశ్రేణి కెల్లప్పుడున్.

క. అనవుఁడు భార్గవుఁ డిట్లనుఁ
ద్రినయను చాపంబుఁ ద్రుంచి । తెలియని గతి, నీ
తిని నాకీగతిఁ దెలుపఁగఁ
జనుదెంచితి వీర నీకు । సరణియుఁ దెలిసెన్.

చ. ఇలఁగలయెల్ల భూపతుల । నీవబలాఢ్యుఁడ వౌదువోయి, యీ
పలుకుల కేమి లెమ్ము, పుర । వైరి విరోధివి, చాలునింక వా
క్కలహము; కుత్సితంబునను । కార్యము లేదు; చెలంగి లావు చే
వలఁ బ్రకటించి నాకినుకఁ । బాపుము, జంకెద వేని వధించెదన్.

చ. నినుఁ దునుమాడి, నీయనుజు । నిన్ వధియించెదఁ గాక, కాచుకొం
డనుచుఁ గుఠారమెత్తిన, ధ । రామర చంద్రునిఁ జూచి నవ్వుచున్
వినయభరానతాస్యమున । వీరుఁడు రాఘవుఁ డిట్లు పల్కె, మీ
కినుకకుఁ బాత్రులౌ ఖలులఁ । గీటడఁగించిన దోసమున్నదే ?

గీ. అర్భకునియందు, నాయందు । నాగ్రహించి
తప్పుల గణింపవచ్చునే । ధరణిదేవ ?
ఓర్మివహియింపుఁ డకట యొ । క్కొక్కవేళ
సరళభావంబునందు దో । షము ఘటిల్లు.

గీ. క్రోధి సరళస్వభావంబుఁ । గుటిలమనుచు
నాత్మఁ జింతించి యెంతయు । నాగ్రహించు,
కుటిలచంద్రుని రాహువు । కోరదెందు
గోపముఁ ద్యజింపుఁడీ మన । స్తాపమేల ?

క. ఇదె నే నొదల వంచితి
నదె మీరెత్తిన కుఠార । మక్కట నన్నున్

ముదముప్టం జేసి లక్ష్మణు
సహనము నొనరింపుఁ డాత్మ । శాంతిం బొందన్.

క. సభ మిమ్ము మెచ్చుకొనన మా
యుభయుల వధియింపుఁ డింక । నుర్వీసుర మీ
యభిమత మీడేరుంగద;
ప్రభు భృత్యుల కెంత యుద్ధ । పద్ధతి గలదే?

మ. చను నే కోపము, పావనంబయిన వే । షంబున్ విలోకించి పై
గనము గ్రాయుధ సంచయంబుఁగని లో । కస్తుత్య మా లక్ష్మణుం
డనుమానంబున నేమియో పలికె; నా । యజ్ఞానితో నేమి? మీ
ఘనకీర్తిన్ వినియుండుఁగాక మిముఁదాఁ గ । న్నార వీక్షించెనే?

మ. ముని లోకోన్నత! భీకరాయుధ చయం । బున్ బూని యేతెంచు న
మ్మనుజుం జూచి యెదిర్చి పల్కుటరయన్ । మా వంశమర్యాద; చే
ధనువున్ మీ తనువున్ వచస్సరణియున్ । దర్కించి మా వాఁడు ప
ల్కిన పల్కుల్ గణియింపరాదిఁక మనః । క్లేశంబు మీ కేటికిన్

గీ. పిన్నయయ్య మావాఁడు వి । వేకి మీరు
కేవల మునీంద్రులైన జం । కించు వాఁడె
పావనంబైన భవదీయ । పాదరజము
శిరమునందాల్చుఁగాక యో । క్షితి సురేంద్ర!

మ. శరణంబంటిని దేవ! బాలకుల య । జ్ఞానంబు సైరింపుఁ డె
క్కరణిం బోరెదువాఁడ మీకు సముఁడన్ । గానోపనూహింప గాఁ
జరణం బెక్కడ శీర్ష మెక్కడ మహా । శాంతస్వభావంబె యా
భరణంబౌ వసుధామరేంద్రునకుఁ గో । పంబింకఁ జాలింపరే.

గీ. వ్రణము భేదించి రక్షించు । వైద్యరీతి
లోక కంటకుఁ దునుమ నౌఁ । గాక యకట!

వాదులాడుచుఁ దనపల్కు । పట్టుదలకు
నెల్లవారల నఱికినఁ । జెల్లు నొక్కొ?

గీ. స్వల్పనాముండ రాముండ । క్షత్రియుఁడను
పరశురాములు భార్గవ । వంశభవులు
నేను మీకుఁ దుల్యుండనే । నిర్మలాత్మ?
ఓడకుఁడు నేన యోడితి । వేఁడుకొంటి.

గీ. అనిన నాలించి భార్గవుం । డాగ్రహించి
తెలిసెరా రామ వానికిఁ । దీసిపోవు
చెప్పెద నొకింత తాళుము । చేతకాని
వానిగా నన్ను భావింప । వచ్చు నీవు.

చ. శరసముదాయమాహుతిగఁ । జాపముస్రుక్కుగఁ గోపమగ్ని గాఁ
బరబలమింధనంబుగ నృ । పాలవరుల్ పశుసంచయంబుఁగాఁ
బరశువుఁబూని యుగ్రతర । భండనయాగ మొనర్చినాఁడ నే
నిరువదియొక్కమారు లను । రేంద్రుఁడు భీతిలి తల్లడిల్లగన్.

శా. వృద్ధబ్రాహ్మణుఁడంచు భార్గవుని దో । ర్వీర్యంబు లక్షింపవ
శ్రద్ధంజూచి హసించెదీవు, పురజి । చ్చాపంబు భగ్నంబుగా
నౌద్ధత్యంబునఁ గన్నుఁగానవకటా । యజ్ఞుండ వేమందు నా
యుద్ధప్రక్రియ నీవెఱుంగఁ గలవా । యోచింపుమా రాఘవా?

క. నుసివిల్లు విఱిచి భుజముల
పసఁ జూపితి వెల్ల రాజ । వర్యులు వొగడన్
గసిదీఱ నిన్ను లక్ష్మణు,
నసిధారం ద్రుంచి గర్వ । మణఁచెదఁ దృటిలో.

చ. అనవుఁడు రాఘవుండు విన । యానతకంధరుఁడై వచించె ని
ట్లనఘ! యొకింత లోనరసి । యానతి యీఁదగు, స్వల్పదోషమున్

ఘనతరమంచు నెంచి, మముఁ । గాసిఁగఁ జేసిన లాఘమ్ముననే
ధనువు తనంత నేవిఱిఁగెఁ । దాకినయంత నె; గర్వమేటికిన్.

చ. పసఁగలవిల్లొ, లేక నుసి । వాఱిన విల్లొ, స్పృశించినంతనే
విసవిస ఫెళ్ళునన్ విఱిఁగి । పృథ్విఁబడెన్; బఱికింపు డింతకున్
బొసఁగెఁబ్రమాదమీవరుసఁ । బొక్కెదవేల? మముసంహరించి సం
తసమున నింటికింజనుఁడు; । తామసి తామసి గాకయుండునే?

సీ. బ్రాహ్మణోత్తము నిరసించు । వాఁడెవండు?
మిమ్ము నిరసించునన్ప్రి భా । వమ్మె యున్న
మ్రొక్కి భక్తితో నిల్చి మీ । మ్రోల నిల్చు
యోధుఁడెచ్చటైన నుండునే । సాధువినుత?

సీ. అధికబలుఁడైన బలహీనుఁ । డైన నేమి?
కలహమునఁగోరి యెదిరించి । కాలుఁ ద్రవ్వి
తొక్కఁ ద్రొక్కనిఁ జేరిన, । నుక్కుఁ దక్కి
మిన్న కుండునె మీసంబు । లున్న వాఁడు?

సీ. క్షత్రియుండు జంకెఁ జెప్పెడు । కయ్యమునకు
భయముపడువాఁడు భూపుఁడే? । పామునందు
పొగడుకొనుచుంటి నని నన్నుఁ । బెగడవచ్చుఁ,
గదనమే రాజులకెదు. । సదన మనఘ!

సీ. పార్థివుఁడు బ్రాహ్మణుంజూచి । భయము పడిన
బ్రాహ్మణునకద్ది గౌరవా । స్పదము గాదె?
బ్రాహ్మణులు భార్గవులు మీకు । భయము పడుట
గౌరవార్థంబ యగుఁగాక । వీర వినుత!

క. అనిపలికిన శ్రీరాముని
ఘనవాగ్గంభీర భావ । గౌరవమునకున్

దన బుద్ధి కవాటంబును
మునివర్యుఁడు తెఱచి యిట్లు । మునుకొని యనియెన్.

చ. చివికిన ప్రాతవిల్లొకటి । చేకొని ఫెళ్ళునఁ ద్రుంచినంతనే
శివునకు నీవు సాటియనఁ । జెల్లునె? యొల్లదు నామనంబు? భా
ర్గవుఁడను భర్గుశిష్యుఁడ, జ । గంబుల నెల్ల జయించినట్టి రా
ఘవ!నను ధిక్కరించెదవు, । కంజభవుండవొ? మాధవుండవో?

క. ఏనాటిదొ శివచాపం
బీనా నారాయణుధను । వెక్కుడుఁ గలదే?
నానా విధ వాక్కుల నను
నోనాడుటగాదు, చేకొ । నుము పేరుఁడవేన్.

క. నాసరి వీరుఁడు లేఁడని
యీసునఁనేఁ బల్కుచుంటిఁ । నింతేమిటికన్ ?
నాసందేహముఁ బాప శ
రాసన మిపు డెక్కు వెట్టు । మానవుఁ బొగడన్.

క. అని యిచ్చిన యాధనువుం
గొనినంతనె భార్గవుని య । కుంఠిత తేజం
బినకుల తిలకుం గలసెన్ ;
ఇరు తేజం బబ్బురెరి । నెనసిన రీతిన్.

క. భళి భళి వంచెనొ లేదో
ఫెళ ఫెళ మని విల్లు విఱిఁగి । పృథ్విం బడియెన్,
గళవళ మొందెన్, ముఖమునఁ
గళలన్నియు సన్నగిల్ల । ఝల్లనుచుఁ డంతన్.

చ. దడదడగుండె కొట్టుకొనఁ । దాలిమిఁ దక్కి, భయంబు పెంపునన్
గడగడఁ బాదముల్ వడఁకఁ । గాఁ, జెమట చెమ్మట లొనన బునన్

జడిగొనఁ, గంటనీరొలుక, నందియమేటికి విష్ణువంచుఁ దాఁ
దడఁబడి తజ్జ్ఞునిఁగాంచి దాశరథిన్ వినుతించె నీవిధన్.

పరశురామకృత శ్రీరామస్తుతి

సీ. జయ జయ రఘువంశ సరసీజ వనభాను!
జయ దైత్య వంశ సంచయ కృశాను!,
జయ జయ సురవిప్ర జన ధేను హితకారి,
జయ ధర్మ రక్షణాశయవిహారి!,
జయ జయ మునినుత స్థాణు మానస హంస!,
జయ సర్వదేవతా సత్ప్రశంస!,
జయ జయ సుందర జలదసన్నిభ గాత్ర!
జయ వేద సన్నుత సచ్చరిత్ర!,
గీ. గరుడవాహన కల్మష గహన దహన!
లోక మోహన! శాశ్వత శోకవహన!,
పరిణత సుత్రామ! నిర్జిత పరశురామ!,
రామ! సద్గుణారామ!, సంగ్రామ భీమ.
క. ఆలింపుము నామనవిని,
పాలింపుము నీదు భక్త వర్యులఁ గరుణన్
దూలింపుము పాపంబుల,
నేలింపుము ధర్మపథము నృపవర్యులచే.
గీ. ఇట్లు వినుతించి తనబుద్ధి నేవగించి,
విన్నఁబాటున సభఁజూచి చిన్నవోయి,
అంధకారమై యజ్ఞాన మావరించె,
సంచుఁ జింతించి, శ్రీరాము మంచి నెంచి.

చ. పులకితగాత్రుఁడై పరశు । వున్ బడవైచి, నమస్కరించి, "భ
క్తుల యపరాధమున్ మఱచి । కోరిన కోరిక నిచ్చువాఁడవో
జలరుహనేత్ర! నాయెడ దో । సంగుపొసంగె, క్షమింపు"మంచునో,
కలికి! తపింప భార్గవుఁడు । కానకు నేగెఁ బ్రబోధితాత్ముఁడై.

క. భర్గునిశిష్యుం డరిష
డ్వర్గముఁ దూలింపలేక । పామర జననై
సర్గముఁ బొందునె, యోహో
భార్గవుఁడని కౌశికుండు । పక పక నవ్వెన్.

గీ. అంతవాఁ డింతయయ్యె మే । మెంత యనుచు
సూర్యబింబోలు శ్రీరాముఁ । జూడ లేక
ఘూకలముకైవడిన్, గాంది । శీకు లగుచు
నొదలల వంచి వెడలి ర । య్యవని ధవులు.

గీ. సర్వదేవతా పుష్ప వ । ర్షంబు గురిసె,
దుందుభులు మ్రోఁగెఁ, బౌరులా । నంద మొంది,
రంత నజ్ఞానమను మేఘ । మంతరింప
నలరి రెల్లఱు భయ దుఃఖ । ములఁ దొలంగి.

గీ. పెన్నిధానంబుఁ బొడఁగన్న । పేదఁ బోలి
జనకుఁ డానంద జలనిధిన్ । మునిఁగి తేలె,
చంద్రు నుదయంబునఁ జకోర । శాబ మట్లు
సీత విగత సంతాపయై । చెలువుఁ గాంచె.

సీత వివాహ సన్నాహము

క. తనయక జనకుఁడు కౌశిక
కడకుం జని, యుష్మదీయ । కరుణన్ గృతకృ

తున్ఁడవైతిని, కర్తవ్యముఁ
గడువడి నెలవిండవనుఁడు । గాధిజుఁ డనియెన్.

చ. వినుము, వివాహమాశివుని । విల్లుతునింగిన యంతనే ఘటి
ల్లెను, కులసంప్రదాయమున । లీల వివాహ మహోత్సవంబు నీ
వొనరుపవచ్చు, వేగమె.యు । యోధ్యకువిప్రులఁబంపి, సర్వమున్
వినిచి, ధరాతలేశుఁ బిలి । పింపుము, భూవర! యీ వెఱుంగవే?

క. అనవుఁడు మేలని యప్పుడ
జ్జనకుఁడు, సమయంబుఁ జూచి । సత్వరముగ న
జ్జననాథోత్తము దశరథు
వినయంబుగఁ బిల్వఁ బంచె । విప్రజనంబున్.

గీ. ఇవ్విధిన్ విప్రవస్యుల । నెలమిఁ బనిపి,
హితులఁ జుట్టాల, వర పుగో । హితులఁ బిల్చి,
శోభవైవార దేవేంద్ర । వైభవముగఁ
బొంకిమిగుఁరొత్తఁ బురము న । లంకరించె.

గీ. నీలములు పత్రఫలముల । లీలఁ గ్రాలఁ
బద్మరాగంబు లతుల పు । ష్పములుగాగఁ
కనక కదళీ విరాజిత । ఘన వివాహ
మంటపంబొండు నిర్మించె । మనుజ విభుఁడు.

సీ. తద్వితానముఁ జూడ । నద్వితీయము, మంచి
ముత్తియంబుల సరుల్ । పొలుపు మిగిలెఁ,
బలువన్నియల నీను । బంభర వితతితోఁ
బిట్టలతోఁ బూల । చెట్టు లలరె,
శృంగార మిగుఁరొత్త । బంగారు కలశంబు
లందంపు నెంతయు । నంద మొసఁగె,

నాత్మీయులగు వారి । కాహ్లాద మెసఁగంగ
గగనవీథిన్ బత్రా । కంబు లెగిరెఁ

గీ. జంచలాదేవి సామాత్మ్య । రించి, యందు
జన్మముం బొందెఁ, దచ్ఛోభ । సన్నుతింప
నలవియే యెట్టివానికి । నైనఁ గాని,
దానిఁ జూచిన యతఁడె పో । ధన్యతముఁడు.

మిథిలాపుర బ్రాహ్మణు లయోధ్యకు వెడలుట

గీ. జనకుఁ డొసఁగిన శుభలేఖ । సంగ్రహించి
ఉర్వి సురవర్యులప్పు డ । యోధ్య కేగి,
దశరథేశుని పూజా వి । ధానమునకు
నలరి, శివ ధనుర్భంగంబుఁ । బలికి రిట్లు.
గీ. రాజ! రాజిత సద్గుణ । రత్న భూష,
పురుషసింహుల విశ్వ వి । భూషణులను,
కాశ సంకాశ కీర్తి ప్ర । కాశకులను,
పుత్త్రకులఁ గాంచి, ధన్యత । నుండవైతి.
గీ. తపనుఁడు కృశించె వారి ప్ర । తాపమునకు,
శశి కళంకితుఁ డయ్యె ద । ద్యశమునకును,
రామలక్ష్మణులం బోలు । రాజసుతులు
మూఁడు లోకంబులను లేరు । భూతలేంద్ర.
చ. భువిఁ గల వీరులా జనకు । పుత్త్రికఁ బెండిలియాడఁ గోరి తా
శివ ధనువున్ గదల్పఁ జని । చేష్టడి గయ్యాది యట్టులుండె, మే
రువుఁ బెకలింపనోపు నసు । రుల్ విబుధుల్ ధృతిఁ దక్కి రక్కటా
ఎవ నితరంబు సీతను గ్ర । హించి యశోధనుఁడున్ గడింపఁగన్.

కం. లాస విలాసంబునఁ గై
లాసము నాడించినట్టి । లంకాపతియున్
వీసము నైనన్ హరుని శ
రాసముఁ గదలింపలేక । యణఁగి మణంగెన్.

గీ. అంతటి శరాసనంబు ని । శ్చింత తోడఁ
గమలనాళంబు గ్రహియించు । గజము భంగిఁ,
గేల నవలీల నెత్తి భం । గించె నహహా
రాముఁడు నరుండె, యాది నా । రాయణుండు.

గీ. భార్గవుఁడు వచ్చి, శ్రీరాము । బల పరాక్ర
మ క్రమంబును బరికించి । చక్రధరుఁడు
గాక నరమాత్రుఁడే యంచు । గర్వమడఁగ
వలఁగొని నుతించి, నిజ తపో । వనముఁ జేరె.

ఉ. రామునిఁబోలుధైర్యగ ప । రాక్రమముం గలవాఁడు లక్ష్మణుం
డీమహనీయులం గెలువ । నెంతటి వీరులకేని శక్యమే ?
సామజసంచయంబు హరి । శాబములంగని సంచలించు న
ట్లా మనుజేశులెల్ల భవ । దాత్మజులంగని జంకిర త్తఱిన్.

కం. అనిపలికిన నుప్పొంగుచు
జననాథుం డాలకించి, । సత్వరము వసి
ష్ఠుని సన్నిధికిం జని తా
వినిపించెఁ గథాక్రమంబు । విప్రులవలనన్.

చ. విని, శుభలేఖఁజూచి, రఘు । వీరుల ఖ్యాతికి సంతసించి, య
జ్జనకుఁడు ధన్యుఁడయ్యె భువి । జాతను సీతను గాంచిపెంచె; స
జ్జనుల కయాచితంబుగనె । సంపద చేకురునండ్రు; నిర్ఝరుల్
వననిధి సంగమించుట, స్వ । భావమొకింతయుఁ గామ్యమున్నదే.

ఉ. ధన్వికి రక్షితార్తికి, సు। ధాకర కీర్తికి, రామమూర్తికిన్
దన్వినొసంగి తన్విఁగని । నన్ జనకుండు, ధరిత్రియుండ రా
జన్వతియై రహించు, దను । జవ్రజ ఘోరములున్ నశించు, న
గ్న్యాన్వయమున్ బవిత్రమగు । నాశయమున్ ఫలియించు భూవరా.

ఉ. నీవును దేవులుం గలసి । నిత్యము నొజ్జల గౌరవించి, భూ
దేవుల గోవులన్ మఱియు । దేవతలన్ దనియింతు రెంతయున్
ధీవరులన్ సుపుత్త్రికుల । దివ్యులఁగాంచి రహించితిరు భూ
దేవి సుఖింపనింక నరు । దే? యను దేరక చూచుచుంటివే ?

గీ. పయనముంగమ్ము సీతావి । వాహమునకు
సకల కళ్యాణ సమయంబు । సంభవించె;
ననిన గురువర్యునకు మ్రొక్కి । యాక్షణంబ
తనదు పయనంబుఁ జెప్పి దూ । తలను బంపి.

గీ. అంతిపురికేగి, కాంతల । నంత నిల్పి
ఎలమి వృత్తాంతమంతయుఁ । దెలియఁ జేసె;
ఘన ఘనాఘన గర్జనా । కర్ణనమున
నెమ్ములంబోలి యలరి రా । నెలత లపుడు.

గీ. నృపుఁడు దేవేరు లెల్లరు । నీశుభంబు
గాధినందను కరుణచేఁ । గలిగె ననుచు,
బీదలను బిచ్చగాండ్రను । విప్రవరులఁ
దనియఁజేసిరి ధనవస్త్ర । దానములను.

గీ. జనకీరామ కళ్యాణ । సమయ మనుచు
నిఖిలలోకంబు లలరె, వ । ర్ణింపరాని
శోభఁదళుక్కెత్తె, దశరథ । క్షోణి విభుని,
సీమ యెల్లెడ నూహింప । లేమ? లేమ!

గీ. స్వర్ణకలశాన్వితంబు, ధ్వ । జవ్రజంబు,
మత్తకాశినీ శృంగార । మంజులంబు,
అఖిల విప్రవేద నినాద । ముఖరితంబు,
అతుల శోభాస్పదం బయో । ధ్యాపురంబు.

గీ. వందిమాగధ స్తుతిగీత । వైభవమున
నెగడు నంతఃపురంబు వ । ర్ణింపఁ దరమె?
సద్యశస్స్ఫూర్తి, దేవతా । చక్రవర్తి
యా రఘూద్వహుఁడచ్చట । నవతరించె.

గీ. పెండ్లిపయనంబు కొఱకుఁ బ్ర । స్థిని విభుఁడు
సిద్ధముగనుండుఁ డనినంతఁ । జిత్తమునిడి
సుతులు, మంత్రులు, వరపురో । హితులు, హితులు,
బుధులు, గృతమనోరథులు, సా । రథులు రథులు.

చ. అనిలునికంటె మిక్కిలి ర । యంబునఁ బర్వెడు నుత్తమాశ్వముల్
మునుకొనియుండఁ, జామర స । మూహముతోఁ, దివిదాకు శ్వేతకే
తనములతోఁ, విభూషితవి । తానముతోఁ, గడుసొంపు నింపు స్యం
దనములఁ దెచ్చిరా దశర । థ క్షితినాథవరేణ్యు నానతిన్.

గీ. ధవళ మేఘోపమాన గా । త్రములఁ గలిగి,
విమల హరి నీలవర్ణ క । ర్ణములఁ గలిగి
చెలువు దీపించు వారువం । బుల గ్రహించె
నినుని రథమట్లు దశరథో । ర్వీశు రథము.

సీ. గజయూధ గళబృహ । ద్ఘంటా నినాదంబు
శ్రావణాంబుద రావ । సామ్యమొందె
వేదరాశి సమాన । విప్రజనాకీర్ణ
శిబికాది వాహన । స్థితి రహించె

బహువస్తు సామగ్రి । భారావనత ఖర
క్షుద్రాశ్వ వృషభోష్ట్రి । కోటి వలెలె
వరపుర స్త్రీ మనో । హర గాన మాధురి
మంగళ ధ్వనులతో । సంగమించె
గీ. వందిమాగధ పండిత । ప్రతతి చెలఁగ
సకల దాస దాసీ విలా । సంబు లెసఁగ
సంబుసులఁబోలి వివిధ వా । ద్యములు మ్రోఁగ
నిర్భరానంద మప్పుడా । విర్భవించె.
సీ. నృపుఁడు ప్రసన్నుఁడై । నియతిమై గురువర్యు
నొక్క రథంబున । నెక్కఁ జేసి
విఘ్నేశుఁ బార్వతిన్ । వినుతించి పరమేశ్వ
ర ధ్యాన మొనరించి । రథము నెక్కి
అల బృహస్పతితోడి । యమరేంద్రునింబలెఁ
గుల గురువర్యుతోఁ । గొమరు మిగిలి
నిజకుల మర్యాద । సుజనులఁ బూజించి
వేదప్రచోదిత । విధులఁ జేసి
గీ. అతుల తుంగ తురంగ ఘీం । కృతుల తోడ
దర్పితోద్దండ గజ బృంహి । తముల తోడ
జనుల కోలాహలంబాక । సంబుదాక
మునివరుని యాజ్ఞ శంఖంబుఁ । బూరటించె.
గీ. సకల జనులపైఁ బుష్ప వ । ర్షంబు గురిసె
నమరకాంతల సంగీత । మతిశయించె
రామ రామ సీతారామ । రామయనుచు
నందజును స్యందనంబుల । నలరి రఘుడు.

శుభశకున సందర్శన ప్రాప్తి

గీ. దక్షిణక్షేత్రమునఁ గాకి । తారులాడె
వనమయూరంబు వామది । క్కునకు వెడలెఁ
త్రివిధ వాయువు లనుకూల । రీతి వీచె
ఖంజరీటంబు పొరిఁబొరిఁ । గానవచ్చె.

సీ. సంతానయుత పుణ్య । కాంతలు పూర్ణకుం
భములతోఁ నెదురుగ । వచ్చి రెలమిఁ
గూర్మిమై దూడల । కున్ బాలు చేపెడు
ధేనువు లందందుఁ । గానవచ్చె
ఘృతదధి గోక్షీర । యుత కుంభముల తోడ
గొల్లలు గన్పట్టి । రెల్లకడలఁ
బుస్తకంబులఁ బూని । భూసురోత్తము లిర్వు
రేతెంచి యాశీస్సు । లిచ్చి చనిరి

గీ. మత్స్యములఁ బూని చనుదెంచె । మనుజుఁ డొకఁడు
దక్షిణపు దిక్కునుండి మం । దలుగ వెడలి
హరిణబృంద మానంద మ । హాంబునిధి త
రంగములనంగఁ దోఁచె భూ । పసుతుఁ డలర.

గీ. అతుల మంగళాకరుఁడు క । ల్యాణ మయుఁడు
తపసులకుఁ ద్రాత, యభిమతా । ర్థ ప్రదాత,
యగురఘూద్వహు దివ్యక । ల్యాణవేళ
నహహా!! శుభసూచక ప్రాప్తి । కక్కజంబె.

చ. పరుఁడు, పరాత్పరుండు గుణ।వంతుఁడు రాఘవుఁ, డాదిలక్ష్మి త
త్కరము గ్రహింపఁబట్టె, జన।క క్షితినాథుఁడు యాజ్ఞవల్క్య స
ద్గురుకరుణాకటాక్ష కలి। తుండగు వేది వివాహకర్త; య
న్నరపతిమాత్రికెందు శకు।నంబులయందుఁ గొఱంత యుండునే ?

దశరథుని మిథిలానగర ప్రవేశము

గీ. ఇట్లు పయనంబు సాగించి । యినకులుండు
ధరణి ధరముల నదులఁ గాం । తారములను,
జనపదంబుల దాటి యు । త్సాహమునను
మిథిలకేతెంచె నుద్వాహ । విధికి నంత.

చ. తనయుని పెండ్లికై దశర । థ క్షితినాథుఁడు తర్లివచ్చె, నా
జనసముదాయముల్ సముద । సామజ సంచయమున్ దురంగ వ
ల్గనములఁ జూడుఁడంచు నబ । లల్ తరితీపుగ ముచ్చటింపఁగన్
విని జనకుండు మేలనుచు । విప్రులతో నల గాధిపుత్రుతో.

చ. ఎదురుగ వచ్చి యా దశర । థేశుని మిక్కిలి గౌరవించి పై
సదయ వసిష్ఠ శిష్ఠ ముని । సత్తముఁ గాంచి నమస్కరించి, స
మ్ముదమున మంత్రులన్ హితుల । భూసురులన్ గడు నాదరించి మా
పదరజ మస్మదీయ గృహ । పావన కారణమంచు నవ్వుచున్.

గీ. ఏకరీతిఁ జుట్టాల బ । హూకరించి,
వచ్చితిరె యంచుఁ గొందఱఁ । బల్కరించి,
పిన్నగవున మఱియుఁ బ్రి । సన్న దృష్టి
సరస వాక్కులఁ గొందఱ । సత్కరించె.

మ. మదినుప్పొంగుచు నంతటన్ దశరథ । క్ష్మాపాలచంద్రుండు, వే
సదయుండై తనుఁ జూడవచ్చు ముని వి । శ్వామిత్రు వీక్షించి, త
త్పదపద్మంబులఁ బట్టి మ్రొక్కుటయు నా । తండ్రో ధరానాయకా!
ఇదిగో నీదుకుమారులన్ బురుష మ । త్తేభంబులన్ గొమ్మనెన్.

గీ. గురువులన్ మంత్రులన్ భూమి । సురులఁ జూచి
వందనంబుల నర్పించి, । బంధు జనుల
సేవకుల నాప్తులం జేరి । క్షేమ మడిగి
ఘనుఁడు రాముండు తమ్ములఁ । గౌఁగిలించె.

సీ. దశరథేశుని కజ్జ సో । దర చతుష్ట
యము రహించెఁ జతుర్వర్గ । మనఁగ నహహా!
పౌరులుప్పొంగి యానంద । వార్ధి మునిఁగి
వివిధభంగుల నుడివిరి । విసుఁగులేక.

గీ. "జానకీ రామ చంద్రుల । సన్నుతింప
నలవియే? శోభ కావాల । మనఁగ నుంద్రు,
రాజులిరువురుఁ బుణ్య క । ర్మముల కవధి
భూతు" లని మెచ్చి రప్పుడా । పురము వారు.

కం. జనకుని సుకృతం బహహా!
జనులెల్లను సన్నుతింప । జానకి యయ్యెన్;
వినుఁడా దశరథు పుణ్యము
మునివర్యులు మెచ్చ రామ । భూపతుఁ డయ్యెన్.

ఉ. ఈధరణీశులిద్దరు మ । హిన్ గతజన్మమునన్ మహేశ్వరా
రాధన మెన్నొనర్చిరో? ధ । రాసుత నీరఘురాముఁ జూడఁ బూ
ర్వాధునిక క్రియా శుభ ఫ । లానుభవంబు లభించె మాకు ను
ద్బోధముఁగల్గె; నీపురము । పుణ్యము దెట్టిదొ చెప్పశక్యమే?

గీ. తరుణి! కోమల శ్యామల । తనువుఁ జూడు
మబ్జముల నేలు కన్నుల । యందముఁగను
మెంత చక్కనివాఁడొ యీ । యినకులుండు?
ఎంతనోచెనొ మనసీత । యితనికొఱకు."

కం. ఈరీతి నగర వాసులు
శ్రీరాముని సీతఁ జూచి । చెప్పుకొనఁగన్
హేరాళానంద సుధా
సారంబున స్నాతులైరి । సకల జనంబుల్.

సీ. అంత ననంత శు । భాక్రాంతమన నొప్పు
సంతత శ్రీమంత హే । మంతమునను
మార్గశీర్షాహ్వయ । మాసంబునన్ శుభ
తిథివార నక్షత్ర । విధి గ్రహించి
గ్రహయోగములఁ జూచి । ఘటికల లెక్కించి
కడకు గోధూళి ల । గ్నంబు నందుఁ
బణవ శంఖ మృదంగ । వాద్యంబుతోఁ బుణ్య
కామినీ మంగళ । గాన మెసఁగ

గీ. భూసురుల వేదనాదంబు । బోరు కలఁగ
జనకుని పురోహితుండు స । జ్జన హితుండు
ఆశతానందుఁ డానంద । మతిశయిల్లఁ
గోరి యేతెంచె మగ పెండ్లి । వారిఁ బిలువ.

గీ. వావివరుసలఁ గల్పించి । బాంధవులను
లెండు రండని యెల్లఱ । లేవ నెత్తి
అల వసిష్ఠునితోఁ గూడి । యాక్షణంబ
పెండ్లిచవికకుఁ దోతెచ్చెఁ । బెండ్లివారి.

మ. జనసమ్మోహనమై పవిత్రయుతమై । సౌందర్య భూయిష్ఠమై
మునిసేవ్యంబగు రామురూపమును నే । ముద్దాడితిన్ బాడితిన్
గనులన్ బాష్పములన్ ద్యజించితిఁ గన । ల్గాలాబ్దముంబోలు నా
తనిదేహంబున స్వర్ణవస్త్రము తటి । త్సంకాశమై రాజిలెన్.

గీ. ధ్యానయోగ్యంబు మంగళ । దాయకంబు
రాముని వివాహ వేషంబు । రమ్యతరము
చూచి యానందముంబొంది । సుందరాంగి
మైమఱచి కనుల్ మోడ్చి త । న్మయుఁడ నైతి.

చ. అరసము హెచ్చదే, శత స। హస్ర సుమాస్త్రులధిక్కరించు సుం
దరుఁడు, వివాహ వేషమును। దాలిచి, విశ్వవిమోహనుండనన్,
దురగము నెక్కి రా నహహా!। తోయరుహానన! యేమి చెప్పుదున్
గరుడి తురంగవల్గనముఁ। గాంచె, శిరంబును వంచె లజ్జచే.

గీ. హరి మనోగతి యెఱిఁగి యా। హరి నటించు
చందముం జూడవలెఁ గాక। చంద్రవదన!
నవతటిల్లతా కలిత ఘ। నాఘనంబు
వన మయూరంబు నాడించు। పగిదిఁ దోచు.

సీ. తనకున్న యెనిమిది। కనులతోఁ జూచియుఁ
దనివిఁ బొందక యుండె। వనజ భవుఁడు,
ధాతకంటెను నేను। ధన్యుండ నని చూచి,
నెమ్మిఁ బొంది రహించె। నీసుతుండు,
కనలి తన్ను శపించు। గౌతము వినుతించె
నానందవశమున। నమర విభుఁడు,
ద్విసహస్ర నేత్రంబు। లెసఁగఁ జూచితి, నే న
హీనుండ ననియె న। హీశ్వరుండు

గీ. నేను పదునేను కన్నులన్। దెఱచి చూచి
పొందు నానంద మత్యంత। మిందువదన;
రెండుకన్నుల గలవారు। తృప్తిఁ బడయ
నోపుదురె రామభద్రుని। రూపుఁ జూచి.

గీ. పణవ శంఖ మృదంగ ని। స్వనము మ్రోఁగ
బ్రాహ్మణులతోడ దేవేంద్ర। వైభవమున
వచ్చు మగపెండ్లివారిఁ దా। మెచ్చుకొనుచుఁ
జేసమిగురాస్త నంత, నా। సీతమాత.

ఉ. శ్రీరఘురామచంద్రుఁ, సర । సీరుహపత్ర విశాలనేత్రుఁ, న
మ్మారునిఁ గన్నవాని, నస । మాన కళానిధి నాదరింపఁ, గ
ర్పూరపుటారతిం గొని, ప్ర । మోదముతో నెదురేగి, పజ్జకున్
జేరి, సగౌరవంబుగను । జేర్చె మనోజ్ఞ వివాహవేదికన్.

చ. జనకుఁడు మున్ వసిష్ఠముని । సత్తము చిత్తము పల్లవింపఁగన్
ఘనముగ గౌరవించి, యల । గాధిజుతో నిది మీ ప్రభావమం
చు నుడివి, వామదేవముని । సోముని నచ్యుల నాదరించి, యా
సనముల నిచ్చి, పంక్తిరథు । శౌరిగ నెంచి నుతించె నెంతయున్.

గీ. పంక్తిరథుఁ బరమేశ్వర । భావమునను,
పూజఁ గావించు జనకునిం । బొగడి జనులు,
కోర్కెలీడేఱ నేత్ర చ । కోరములను,
గనిరి శ్రీరామచంద్రునిఁ । దనివిదీఱ.

కన్యాదాన మహోత్సవము

గీ. అంతటన్ లగ్నమేతెంచె । నని వసిష్ఠ
ముని, శతానందుతోఁ జెప్ప, । విని యతండు
పట్టమహిషికిఁ దెలిపె, న । ప్పడఁతి మిన్న
సీతఁ దోడ్కొనివచ్చె నె । చ్చెలులతోడ.

సీ. జనకుఁ డంతట లేచి । సన్మునీంద్రులు స్వస్తి
నుచ్చైస్స్వరంబున । నుచ్చరింపఁ,
గోర్కెలీరికలెత్తఁ । గులదేవతలఁ గొల్చి
చెలువార మధుపర్క । ముల నొసంగి,
తపయుక మంగళ । ద్రవ్యంబులం గూర్చి,
మహితప్రధాన హో । మం బొనర్చి,

పణవ శంఖ మృదంగ । బహుళ వాద్యంబుల
ధణ ధణ ధ్వని దిగం । తముల మ్రోఁగ,

గీ. భూమిసుర వేదనాదంబు । బోరుకలఁగ
భార్యతోఁ గూడి బంగారు । పళ్ళెరమునఁ
బరమ పావన శ్రీరామ । పాదములను
హర్షమిగురొత్తఁ గడిగి కృ । తార్థుఁడయ్యె.

సీ. ఏపాదములఁ గొల్వ । హృదయంబు విమలమై
కలికాల పాపపం । కంబుఁ బాయు,
నేపదంబుల ధూళి । రూపటి శిలయైన
సతికి సత్యోత్తమ । గతి నొసంగె,
నేయంఘ్రియుగ్మంబు । నెల్లఱు సేవించి
మోక్షఫలంబును । బొందుచుందు,
రేచరణద్వయి । యెల్లయోగుల మనః
కమలంబులందు భృం । గంబులయ్యె,

గీ. నాదు హృదయ దీర్ఘికను సం । తతము నెయ్య
వరుణపద్మంబులై యుండు । నంబుజాక్షి!
అట్టియఘములఁ గడిగిన । యలఘుమతుల,
భాగ్యమెట్టిదో వర్ణింప । వశమె మనకు?

గీ. నన్నుఁ ద్రిభువనంబులఁ, బావ । నముగఁ జేయు
గంగఁ గాంచిన యడుగులఁ । గడిగినంత
జనకుఁడు మహర్షియై జగ । జ్జనకుఁడయ్యె,
నహహ సునయన సునయన । యై రహించె.

గీ. లోకపరిపాటిఁ బాటించి । లోకవినుత
వేద మర్యాద నారఘు । వీర వసన

కాత్మకన్యక నొసఁగి, ధ । రామునకు
నఖిల దానంబు లొసఁగి ధ । న్యాత్ముఁడయ్యె.

గీ. క్ష్మాధరవిభుండు పార్వతిన్ । జంద్రమౌళి,
కమృతవారాశి శౌరికి । నాదిలక్ష్మి
నొసఁగిన విధాన రామున । కొసఁగెఁ గన్య
నని నుతించిరి జనకుని । నఖిలమునులు.

గీ. ప్రతిమణిస్తంభసీమను । ప్రతిఫలించు
జానకీ రామచంద్రుల । సొబఁగుఁగాంచి,
అహహా!! బహురూపములఁదాల్చి యా । యనంగుఁ
డంగనంగూడి యేతెంచె । ననిరి జనులు.

గీ. రమణిశిరము సింధూర ప । రాగమున న
లంకరింపఁగఁ గరములు । సంకుచించెఁ
గమలయుగ్మంబు రాముని । కరయుగంబు,
శీతభానుని బింబమా । సీతముఖము.

గీ. మంగళమయంబు శోభాత । రంగితంబు
నఖిలజన సమ్మతమునైన । యా వివాహ
వైభవంబును వర్ణింప । వశమె యేక
ముఖముఁ గలిగిన కవికి నం । భోరుహాక్షి.

సీ. అంత వసిష్ఠుని । యానతిఁ దలఁదాల్చి
జనకుఁ డూర్మిళ లక్ష్మ । ణున కొసంగ
“నీమె యీతని కీతఁ । డీమెకుఁ దగుననన్”
మాండవిన్ భరతుని । మగువఁ జేసె
మునులు సంతోషింప । భువన విశ్రుతకీర్తి
శ్రుతకీర్తి శత్రుఘ్ను । సతిగఁ గూర్చె

జాగ్రదాది తురీయ । సంగతి జీవునిం
బలె మండపముచూడఁ । జెలువుమీఱెఁ

గీ. దన క్రియా చతుష్టయమున । దశరథుండు
వరచతుర్వర్గ ఫలములఁ । బడసి నట్లు
హార్షముప్పొంగ ధనవస్తు । వర్షమునను
యాచకుల బాంధవులను బ్రా । హ్మణులఁ దనిపి;

క. సుతులన్ దత్సుతులన్ నిజ
సతులన్ గుణవతులఁ గూడి । సద్బంధుజనా
శ్రితులున్ స్వపురోహితులున్
హితులున్ దనుగొల్వ విడిది । కెలమిం జనియెన్.

గీ. బాంధవులఁజూచి యాశ్రిత । ప్రతతిఁ జూచి
అవనిసురులను జూచి వి । య్యంకుఁ జూచి
తనపురోహితు మున్నిడి । జనక విభుఁడు
ఎలమిఁ గరముల జోడించి । యిట్టులనియె.

క. పొరపాటు లెట్టి పెండ్లికిఁ
బరిపాటిగ నుండు నప్పుడు । పాటింపక నన్
గరుణన్ క్షమింప వేఁడెద
ధరణీసురకల్పభూజ । దశరథ రాజా!

క. తమకంబున దుఃఖంబును
తమసంబున బ్రుంగి, యిపుడు । ధన్యుఁడనైతిన్
దమ సంబంధముచే, ను
త్తమగతి చేకూరె మాకు । దశరథరాజా!

గీ. కూఁతులను నీకొసంగితిఁ । జేతులారఁ
ఏలుబడి నీది యింక నా । కేల చింత,

అనిన దరహాసముం జేసి । జనక విభునిఁ
గౌఁగిటం జేర్చి యాతండు । గౌరవించె.

గీ. అట్లు వియ్యంకులిరువురు । నతులతోష
వారినిధిఁ దేలి మునుఁగుఁగ । బంధుజనము
మాటలన్ బాటలన్ మేరు । మఱచియుండ
సీత రాముని జూడఁ గాం । క్షించుచుండె.

క. ఆనలినాక్షుని రాముని
మానిని వీక్షింప మాటి । మాటికిఁ దలఁకున్,
మానసము ప్రేరణంబునఁ
దానించుక చూడఁగాని । తనియక యుండున్.

ఉ. ఆ యబలాలలామ తన । ప్రాణవిభున్ దిలకించి, ప్రేమతృ
ష్ణాయుతదృక్పరంపర, ప । దాంబురుహంబుల బంభరంబులై
కాయసరోవరంబునఁ బ్ర । కాశముఁ బొందుచు నీఁదుచేఁపలై
హాయిగ సంచరించె నహ । హాయని మానస ముల్లసిల్లఁగన్.

గీ. ఆమె కౌశేయ పరిధాన । మతుల శోభఁ
బ్రాంతరారంభ వేళఁ బ్రా । గ్భాగమునను
దోచు నరుణార్క విభవంబుఁ । ద్రోచిపుచ్చు,
నేమనందు సౌదామని । నీసడించు.

ఉ. పాడుచు నాడుచున్ సకల । బంధుజనంబులు ముచ్చటించఁగన్
మూఁడుదినంబు లప్పగిని । ముద్దుల సుద్దులఁ బ్రొద్దుపుచ్చి తా
వేడుకతోడ జేఁడు తన । పీటికి నేగఁ దలంచినంత నే
మాడలఁ జేసెలన్ హయుల । మత్తగజంబుల స్యందనంబులన్.

గీ. వస్త్రముల నవ్యకాంచనా । భరణములను,
దాస దాసీ జనంబుల । వేసడముల,

వెంటఁ గొనివచ్చి, జనకుండు । ప్రీతితోడ,
నఖిలజనములు మేలన । నరణమిచ్చె.

గీ. నేఁడు కొడుకుల కోడండ్ర । తోడ నహహా !!
దశరథ నృపుండయోధ్యకుఁ । దరలు ననుచు,
నల్ప సలిలస్థ మత్స్యంబు । ననుకరించి
జనకవిభు రాణివాసంబు । సంచలించె.

చ. సునయన దుఃఖబాష్పములు । చూపుల నంకిలిపెట్ట, మెల్లఁగన్,
గనులనుదుడ్చుకొంచు, జన । క క్షితినాథుని బిడ్డఁజేరి య
క్కునఁగదియించి, తక్కుఁగల । కూఁతులనాదటఁగౌఁగిలించి, యి
ట్లను:-"వినుఁడత్తమామల స । మాదరణంబును బొందుఁడెల్లఱున్.

గీ. పతులయాజ్ఞకు లోఁబడి । వాగలిచ్చు
మెచ్చిన విధాన సతతంబు । మెలఁగవలయు,
ప్రీతిఁ బాయక లోకవి । ఖ్యాతిఁ గొనుఁడు,
సిరులఁ దులదూఁగుఁ డనుచు నా । శీర్వదించె.

చ. మునుకొనియెక్క బ్రాహ్మణుఁడు । ముందటమార్గముఁజూప, రాఘవుం
డనుజులఁగూడి, పేర్మిమెయి । నాప్తులుమిత్రులు వెంబడింపఁగన్
జనకుని వానియంతిపురి । చానలఁ దక్కిన బంధుసంఘమున్
గని తన పీఠికిన్ సెలవుఁ । గైకొని యేగఁదలంచి వచ్చినన్.

సీ. మనపుణ్య పరిపాక । మనఁగాదె యిప్పురి
పరమపావనమయ్యె । భామలార !
అది యదృష్టమ కాక । యహహా!! సీతకు మంచి
మగుడు చేకూరెనే । ముగువలార !
కలుప్రదీటఁ గుమారుఁ । గనుపారఁ గాంచెనే
కౌసల్యఁ బోలఁడే । కాంతలార !

జనకుఁ డెంతటి తప । స్సంపన్నుఁడో వీని
పదములఁ గడుగంగఁ । బడఁతులార !

గీ. పేదకుం గల్పకంబు ల । భించినట్లు,
మరణశీలున కమృతంబు । దొరకినట్లు,
మనకుఁ బ్రాప్తించె నితని ద । ర్శనము తరుణు
లార! యని రాముఁ జూచిర । పౌరసతులు.

క. మనమనిశంబు భృశంబని
మనమున రఘురామ రూప । మాణిక్యంబున్
జొనిపి సుఖించినఁ జాలదె
యని కొందఱు లోఁదలంచి । రత్తఱి గిరిజా !

సీ. రూపరాశుల, సర్వ । పాపనాశుల రాజ
తనయుల వీక్షించి । సునయనాది,
రమణులెల్లఱుఁ గప్పు । రంపు టారతి నిచ్చి
స్నాతులఁ గాఁజేసి । సత్వరముగ
షడ్రసోపేత భో । జనమునఁ దనియించి,
వలిపంపు జలతారు । వలువ లొసఁగి,
గౌరవించిరి యంత । ఘనుఁడు రాముఁడు లేచి,
మగువలం జూచి న । మస్కరించి,

గీ. పూజ్యపాదులు మాతండ్రి । పుచ్చె మమ్ము
సకల సౌభాగ్యవతులార । సత్ప్రసన్న
మనములన్ మమ్ము దీవించి । యనుమతింపుఁ
డనిన నిట్లనె సునయన । వినయముగను.

సీ. పరిపూర్ణ కాముండ । వైరిషట్క జేతవు,
పరిణామయంబు భా । వ ప్రియంబు

భవదీయ భావంబు, । పరమపావనమూర్తి
వఘ వినాశన వర్తి । వతుల కీర్తి
వమిత కృపాస్ఫూర్తి । వఖిల భక్తుల గుణ
గ్రాహకుండవు, మమ్ము । మోహాహతుల,
నాదరింపుము, సీత । నాదటఁ బాలింపు
మేలింపు మనుజుల । నితర సుతల
గీ. జ్ఞానులకు శిరోమణివివు । సదయ హృదయ !
రామ సద్గుణారామ ని । న్నేమనందు,
ననిన ముఖమున దరహాస । మంకురింప
సెలవుఁ గైకొని వెడలె నా । శ్రీవిభుండు.
గీ. అనుజులం గూడి శ్రీరాముఁ । డరుగుచుండ
స్త్రీలదృక్కులు వెన్నంటి । తిరిగెఁ గాని
మానసంబులు కటకటా! । మగిడిరావు
వారివిరహవ్యథ వచింప । వశమె గిరిజ !
చ. చిలుకలు ముద్దుముచ్చటల । చే, మురిపంబులచే మరాళముల్,
పలుకులచేత శారికలు, । లాస్య విలాసముచే మయూరముల్,
అలరినవాట సీత విర । హవ్యథ కెంతయు నేడ్చెఁ గాక, దృ
క్కుల జలధారలూర జన । కుండుఁ గడుంగడు నేడ్వవచ్చునే ?
గీ. జనకుఁ డంతటఁ బరివార । జనముఁ గూడి
పెండ్లివారలతో నేగి । పెద్దలైన
వారి యనుమతిఁ గొనివచ్చి । భక్తితోడ
ఘనుని శ్రీరామచంద్రునిఁ । గాంచి పలికె.
సీ. గాఢంబుగా నిన్నుఁ । గౌఁగిలింపఁగనిమ్ము
రామ శ్రీధామ! ని । న్నేమనందు ?

ముని మహేశ్వరచిత్త । వనరుహ మార్తాండ
అరిషట్కము జయించి । నట్టి ఘనులు
నాకారహిత చిదా । నందంబు నిర్గుణ
బ్రహ్మంబు గ్రహియింప । వశముగాక
తల్లడిల్లుచునుండ్రు; । తర్కింపఁ జాలక
నిగమంబు లేవేళ । "నేతినేతి"

గీ. యనుచు ఘోషించు చుండునో । వనజనేత్ర!
శుద్ధచైతన్య మత్యంత । సుఖదమగును;
అనఘ; నినుఁగాంచి ప్రేమించి । యనుభవించి,
భవమహోదధి నీదఁగఁ । బాలుపడితి.

గీ. అహహా! భవదీయ మహిమంబు । నగయ వశము
నిర్గుణంబును సగుణంబు । నీవ యగుచు
నామనము భగవచ్చర । ణంబులందు
లీనమైయుండఁ గోరెద । భానుకులజ!

క. అని యిట్లు పలికి జనకుఁడు
వనజాక్షునిఁ గౌఁగిలించి । బాష్పజలంబుల్
గనుదోయి జాఱవిడిచెన్
ఘనమగు తన ప్రేమరసముఁ । గార్చిన కరణిన్.

గీ. అతని భావంబు గ్రహియించి । యంబుజాక్షుఁ
డట్లయగుఁగాక యని మంద । హాస మంది
తానసుండయి వినతుఁడై । యనుమతిఁ గొని
యనుజులంగూడి దశరథు । ననుగమించె.

చ. వినయవిధిన్ రఘూద్వహుని । వీక్షించి, యజ్ఞసదనుఁడు గాధినం
దనునకు మ్రొక్కి, దేవ! సుర । నాథున కేని లభింపరాని ద

ర్శనము లభింపఁజేసి, సరి । రాజులలో ననుఁ బెద్దఁజేసితే
మని వినుతింతు ననుచు విన । యానతుఁడై చనె నాత్మసీమకున్.

క. హితులుఁ బురోహితులు శ్రితులు
నతిశోభన్ వెంబడింప । హస్తిం బెనఁగన్
గతిపయ దివసంబుల కా
క్షితిపాలుఁ డయోధ్య కేగె । సీతాపతితో.

గీ. సుతులతోఁ గూడి దశరథ । క్షితివరుండు
వచ్చెనను వార్త నాలించి । పౌరవరులు
యోధుల కసాధ్యమైన య । యోధ్య నహహ
చక్కఁగ నలంకరించిరి । జలజగంధి!

చ. సురచిరగాత్రి యప్పురము । సొంపుల పెంపు నుతింప సాన? సు
స్థిరమతి నిర్జరాకులు మ । థింప జనించు పయోధికన్యకన్
బరిణయమాడి కేశవుఁడు । వచ్చిననాటి వికుంఠసీమయై
కరము విరాజిలెన్ సురలు । కన్నుల పండువుగాఁగ నత్తఱిన్.

చ. మదనవిలాసినీసదృశ । మానిను లా రఘురామమూర్తిఁ ద
త్సుదతి నిజూచి మెచ్చుచుఁ బ్ర । సూనములన్ వెదఁజల్లి, పూజకున్
అదనిది యంచుఁ గప్పురపు । టారతి నిచ్చి నుతించి రంత స
మ్మదజనరాశి ఘోషవలె । మంగళరావము లొప్పె నెల్లెడన్.

సీ. హర్మ్య గవాక్ష ని । ర్యద్ధూప ధూమముల్
శ్రావణమాసాబ్ద । చయము గాఁగఁ
బురకామినీ ధృత । పుష్ప గుచ్ఛంబులు
వరబలాకంబుల । వరుస గాఁగ
మహాప్రాంగణ బద్ధ । మణిమయ తోరణ
పంక్తి దేవేంద్రచా । పంబు గాఁగ

నూత్న వధూహార । రత్నకాంతిచ్ఛట
తరళ విద్యుల్లతా । తతియుఁ గాఁగ
గీ. ఘనఘనారావములు గర్జి । తములుగాఁగ
బ్రాహ్మణులు చాతకమయూర । రాజగాఁగ
మునులుఁ బౌరులుఁ గర్షక । జనులు గాఁగ
నమరుల సుగంధ జలవర్ష । మతిశయించె.
సీ. చాలకాలముదాక । జపియించి తపియించు
యోగీశ్వరుఁడు మోక్ష । మొందినట్లు
అక్షయ క్షయసంక । టాక్రాంత రోగి సు
ధారస ధారలఁ । ద్రావినట్లు
ఆగర్భ నిర్భాగ్యుఁ । డైన కుంభ నిఖిపేద
కనక నిధానంబుఁ । గాంచినట్లు
అభినయంబున సంజ్ఞ । నాశయం బెఱిఁగించు
మూఁగవాఁడొగి వాణిఁ । బొందినట్లు
గీ. పుడమిఁ దడఁబడి మార్గంబు । నడిగి యడిగి
తడవుకొనెడు నంధుఁడు దృష్టిఁ । బడసి నట్లు
రాజపత్నులు చెప్పఁ ద । రంబుగాని
అతుల సంతోష మొంది ర । య్యవసరమున.
గీ. జానకీ రామచంద్రుల । సంగతమున
నతుల మంగళాన్వితమైన । యయ్యయోధ్య
కొంతకాలంబుదాక నే । చింతలేక
అతివ ! యానంద వారాశి । యన రహించె.
గీ. అంత నొకనాఁడు గాధేయుఁ । డాశ్రమమున
కరుగ నూహించి సభకేగి । నంత నృపుఁడు

ఆసనం బిచ్చి పూజించి । యాదరించి
తనుజసహితుండై పాదవం । దనముఁ జేసి.

గీ. శిష్టజనవర్య! యుష్మదా । శీస్సు వలన
సకల సౌభాగ్యములు మాకు । సంఘటిల్లె
సుతులఁ బ్రోవుడు నను గృపన్ । జూడుఁడనుచు
మగుడ మ్రొక్కిన దీవించి । మౌనివరుఁడు.

గీ. పోయివచ్చెద నని, రాము । మోముఁ జూచి
మందహాసంబుఁ గావించి, । మందగతిని
మార్గముం బట్టి, పురినుండి । నిర్గమించె
రాముఁ డేతేర గొంత దూ । రంబుదాక.

చ. సరసిజనేత్రుఁ డంచు ముని । సంఘముచే నుతిఁగొన్న జానకీ
వరుని వివాహవైభవముఁ । బాడినఁ బల్కిన, నాలకించినన్
స్థిరమగు శ్రీసమృద్ధియు, వి । శేషసుఖంబు, నపార ఘోర సం
సరణపయోధినిస్తరణ । శక్తియుఁ జేకురుఁ జూవె పార్వతీ!

చ. పరమపవిత్రమైన భగ । వద్గుణజాలము నాలకించి దు
స్తరభవవార్ధిదాటితివి । ధన్యతఁ గాంచితివో ధరాధరే
శ్వరసుతనుజా! రఘూద్వహుని । పాదయుగంబు స్మరించినంత, నే
నరుఁడు పవిత్రచిత్తుఁడయి । నారకవార్ధిఁ దరింపకుండునో.

గీ. దుష్టకలికాల భక్షిత । దుర్జనులకు
రాఘవుని దివ్య నామస్మ । రణమె దిక్కు;
రామనామామృతంబును । ద్రావినంత
ఘోర తాపత్రయాగ్ని చ । ల్లారుఁ జూవె.

మ. మనమా! చెప్పెదనొక్కవార్తవిని సం । భావింపుమా, యింక దు
ర్జనసాంగత్యముఁ బాసి, యీకపట సం । సారంబు వర్జింపుమా;

అనఘుం బై, భవవార్ధిపోతమగు బ్ర । హ్మానందకందంబు, రా
మునినామంబును సంస్మరింపఁదగదే । మోక్షంబు సిద్ధించెడున్.

చ. రవికులపావనుండయిన । రాముని కీర్తి నుతించుచుండె కవి
ప్రవరుల జీవనంబనుచు । వాణి పవిత్రముగా రచించితిన్
గవివరులార! రాఘవు జ । గన్నుత దివ్యచరిత్రవార్ధి నే
కవియుఁ దరింపఁజాలునె? న । గంబును పంగువు దాటనోపునే?

మ. శివకోదండ విఖండనార్జిత యశ । శ్రీధామ! శ్రీరామ! భా
ర్గవరామ ప్రియుతోరునామ! నతసు । త్రామా! బలోద్దామ! భ
క్తహితానావనకామ! భూధవసుధా । ధామా! పరంధామ! యి
య్యవనిన్ నీనుకథాక్రమం బెసఁగుఁబో । యాచంద్రతారార్కమున్.

కం. రాజ శిరోమణి పూజిత
రాజేంద్ర! సు రేంద్ర మకుట । రత్న సమూహా
భ్రాజిత పదరాజీవా
రాజీవ విశాలనేత్ర! । రమ్యచరిత్రా!

మాలిని. సుగుణ మణి కలాపా । స్తూయమానప్రతాపా!
వినత జనక తాపా । భిన్న ఫాలాక్షచాపా!
సగుణ విగుణ రూపా । సన్నుతాశేష భూపా!
జగ దవనకలాపా । జానకీ పుష్పరోపా!

గద్య. ఇది శ్రీభాగవతుల నృసింహశర్మ విరచిత శ్రీతులసీ రామా
యణము సందలి బాలకాండము సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు.



 శృంగార సుధా సముద్ర

# పూర్ణచంద్రోదయము.

చాలమంది చందాదారులనుండియు, తదితర భాషాభిమానుల నుండియు, పూర్వకవి ప్రణీతమైన, ఈమృదుమధుర మనోహర గ్రంథము సతిశీఘ్రముగ ప్రకటింపవలెనని మాకు మిక్కుటముగ జాబులు వచ్చుచున్నవి-సాధ్యమైనంత శీఘ్రముగ చందాదారులకు మిక్కిలి చౌకగా అనగా ( 0—12—0 + ఖర్చులు 0—7—0 చేరసి రూ. 1—3—0 కు) చక్కని కాగితముపై ముద్రించి, మనోజ్ఞముగ దిట్టముగు బైండు చేయించి పంపుటకు ప్రయత్నించుచున్నారము.

ఈ అముద్రిత తాళపత్రగ్రంథము కొంత ధనవ్యయముజేసి సంపాదించి, చక్కగ పరిష్కరించితిమి.

గ్రంథకర్త:—చెన్నూరి శోభనాద్రికవి. 200 సం॥లకు పూర్వము వాఁడని కీ॥ శే॥ కం. వీరలింగముగారిచే గొనియాడఁబడినవాఁడు.

ఇది 4 అశ్వాసముల మృదుమధుర ప్రబంధము. గద్య పద్యాత్మకము-600 సంఖ్యగలది—చందాదారులు భాషాభిమానులు పరిగ్రహించి ప్రోత్సహించిరేని, అణంగియున్న పూర్వకవి ప్రణీతములగు అముద్రిత గ్రంథముల సంగ్రహించి పరిష్కరించి ప్రచురింప బూనుకొందుము—భాషాభిమానులు, చందాదారులు మాకుఁదోడ్పడుదురని విశ్వసించుచున్నారము.

ఆంధ్రసోదరులారా!

మన పెద్దలు కష్టపడి యుత్కృష్టగ్రంథముల రచించి తత్ప్రచారభారము మనపైఁబెట్టినారు—మూలమూలల నణగియున్న అముద్రిత గ్రంథముల బ్రచురించుట ఆదరించుట మనవిధియని యెఱుంగవలెను.

కం॥ కల నవలలెన్ని చదివినఁ
గలకాలము గ్రాలు కావ్య • కన్యకు సరియా?
" వెలకాంత లెందఱున్నను
కులకాంతకు సాటిరారు • గువ్వల చెన్నా".

ఇట్లు
భాగవతుల నృసింహశర్మ,
వేగుఁజుక్క గ్రంథమాల, బరంపురం—గంజాంజిల్లా.



# గాంధిశతకము

"గాంధిశతకము, భారతీ గళనిబద్ధ
కనకపతకము, వ్యామోహ కలుషితాత్మ
సలిల కతకము, చదివించి సంతసించి
సన్నుతింపని సరసులు జగతిలేరు".

అని కొనియాడఁబడినది. 108 సీసములు. చక్కని ముద్రణము. విలువ 0—4—0 మచ్చుకొక పద్యము.

సీ. కోటినూల్పు ములిచ్చి ♦ కోపటీవానినిఁ
గొనవలెననుమాట ♦ యన్యతమగునె?
చక్కని రాటంబు ♦ చనుదెంచె ద్రోవలో
బండి తీయుండన్న ♦ వ్యర్థమగునె?
తలితప్పివచ్చిన ♦ ధాతకు నైనను
చేకు మే కౌనన్న ♦ నింపుగనదె?
కడకు దైవము తోడు ♦ పడకున్న నూలు కు
త్తుక ద్రుంచు ననినంత ♦ దోసమగునె?

గీ. కాలమనుకూలముగ నున్న ♦ గార్యమగును;
పురుషకారంబు ఫలసిద్ధి ♦ మూలమగును
ఎన్న కేమనుకొన్న మా ♦ కేమికొఱఁత.
సాంద్రధీకంధి! శ్రీకర్మ ♦ చంద్రగాంధి.;

గమనింపుఁడు:— అనాశక్తియోగము. గాంధిశతకము విలువ 1—0—0 పోస్టుఖర్చులు వి. పి. ద్వారా పంపుటకు 0—8—0 అగును (వెరసి 1—8—0) కనుక ఈరెండువలయువారు 1—4—0 ముందుగా పంపిన యెడల లాభకరముగనుండును.

 మా గ్రంథమాలనుండి, డిటెక్టివ్ నవలలు, నాటకములు, మృదుమధుర శృంగార ప్రబంధములు వెలువడినవి—వలయువారికి కేటలాగు పంపెదము.

భాగవతుల నృసింహశర్మ

వేగుంజుక్క గ్రంథమాల, బరంపురం—గంజాం.

For copies apply to:-

Bh. N. Sarma,

Vegu-Jukka Series

Poodi peddi Vari Street

Berhampur, GanJam Dt.